# చౌక
# +
# మన్నిక
# =
# జెన్సోలిన్
## రంగు

జెన్సోలిన్ ప్లాస్టిక్ వాల్ ఫినిష్ ధర తక్కువే అయినా అనేక రంగుల్లో, అతి అందమిచ్చే శ్రేష్ఠమైన రంగు.

జెన్సోలిన్ సింథటిక్ ఎనామెల్ క్విక్ డ్రైయింగ్ ప్రకాశవంతం చేసి కొత్తదనం చేకూరుస్తుంది. అనేక అందమైన రంగులనుంచి మీకు నచ్చినదానిని ఎన్నుకోవచ్చు.







(ఉత్పత్తిదారులు: జెన్సన్ & నికల్సన్ ఎక్కువగా అమ్మడవుతున్న రోదియాలక్ ఉత్పత్తిదారులు!)

అటువంటి పౌరాదాకలపాలెవర్తో నా ఆంతిగా దేమానని నేను చాలా రోజులనుంచి ఎదురు చూస్తున్నాను. ప్రస్తుత విద్యార్థులను ఎదుర్కొంటున్న సమస్యల్లో ఏ ఒక్కటి దేశంలోని ఇతర సమస్యలతో సంబంధం లేనిది కాదు. తక్కిన సమస్యలకేది మూల కారణమో అదే ఈ సమస్యలకూను.

కాగా, శ్రీ పుల్లారెడ్డిగారన్నట్లు, ఇంగ్లీషును వదిలేసి తెలుగుకు విద్యాలయాల్లో బోధనాభాషగా వాడితే, అసలే అధ్వాన్నంగా ఉన్న ఆంధ్రుల పరిస్థితి మరింతఅధోగతి అవుతుంది. అందుచేతనే కొందరు అర్థంలేని విషయాలపై ప్రయోగం చేస్తున్నారు. అది మరీ ప్రమాదకరం! రాష్ట్రంలో ఇప్పుడు, ఉన్నత విద్యాభ్యాసం చేసిన వాళ్ళకు ఉద్యోగ సదుపాయం పొత్తిగా లేదనే చెప్పుకోవాలి. దేశానికి, అందులో వ్యవసాయం ప్రధానవృత్తిగా గల ఈ రాష్ట్రానికి మరీ అవసరమైన వ్యవసాయ, పశు వైద్య శాస్త్రాల పట్టభద్రులకే, భవిష్యత్తు అగమ్యంగా ఉన్న ఈ రోజుల్లో ఈ అర్థంలేని అనబడే ప్రయోగాలతో పట్టాలు పుచ్చుకుంటున్న వారి దుర్గతి చెప్పనక్కర్లేదు. మన రాష్ట్ర ప్రభుత్వానికున్న శక్తి సామర్థ్యాలను, సిరిసంపదలతో, మనసాయకులకుగల చిత్తశక్తితో, వారిమధ్యగల సహకార భావాలతో ఇంకెన్ని ప్రణాళికలు వేసుకున్నా ఆంధ్రులకు ఈ నాయకుల మోటారుకార్లు తిరగడానికి రోడ్లు తప్ప బాగుపడుతాయన్న ఆశలేదు. ఈ పరిస్థితుల్లో రాగల కొన్ని సంవత్సరాల్లో ఆంధ్రులు — కేరళీయుల్లాగా "మోస్ట్ మొబైల్" కావాలి. పారిశ్రామికంగా అభివృద్ధి చెందుతున్న ఇతర రాష్ట్రాలకు వలస వెళ్ళాలి. అందువల్ల మనకు ఇంగ్లీషు చాలా అవసరం.

పోతే, భాష ఎంత బాగున్నా, దేశంలోని అన్ని వదిలేసి నేర్వడం అంత తెలివైనపని కాదు. అంత కోరదగిందీకాదు. ఈ విషయం మనం పూర్తిగా పరిశోధన చేసి తెలుసుకోవలసిన పనిలేదు. మాతృభాషలో విద్యార్జన చేసిన ఇతర భాషా ప్రాంతాల విద్యార్థుల్లో అధిక సంఖ్యాకుల చెప్పే మాటే ఇది. ఇక, అధ్యాపకులకు విద్యార్థులకు మధ్య సామరస్యం పెంపొందడానికి ఇంగ్లీషు అడ్డొస్తున్నదంటే నవ్వొస్తున్నది. అసలు విద్యా విధానంలో అచ్చాయి వెళ్ళి అయ్యవారితో మాట్లాడవలసిన అవసరం ఏముందీ? ముచ్చటగా మూడుపూటలూ ముంగిలా కూచుని చెప్పేదేదో వినేసి జ్ఞాపకముంచుకున్నంత వరకూ ఉంచుకుని ఆ అరగంటలో సందేహాలని కొకసారి కక్కేయడమేకదా చేయాలంటే - ఈ మధ్యలో గురు శిష్యుల మధ్య సుహృద్భావమెందుకూ?

ఆగలాడించిటే, అన్ని భాషలకన్నా తెలుగు ఆరు నెలల్లో వచ్చేస్తుంది ఇంగ్లీషు భాష మాట్లాడ్డానికి! చాలా కారణాలవల్ల తెలుగు కుర్రాడికి అదని మరీ తేలిక. మొత్తంమీద ఇంగ్లీషును వదిలేసి ఏదో ఒకటి రెండు లాభాలు పొందడంకన్నా, దాన్ని సాధనంగా చేసుకుని అపారమైన సహాయం పొందకుండా చూసుకోవడం తెలుగువాళ్ళు చేయవలసిన తెలివైన పని.

నేనందుకు వ్యతిరేకిని కాను. బహుశా ఉదాహరణన్నీ.

22వ పేజీలోని శ్రీమతి కస్తూరిగారి వ్యాసం అనే వ్యాసం 'షన్ఫా' వారు అందించింది — సం.

# ఉత్తరాలు

ఇంటర్వ్యూ పరంపరకొనసాగ అంతచక్కగా మాకు అందించిన సుదర్శనరెడ్డిగారు అభినందనీయులు.

భాస్కర వేణుగోపాల్, (పూనా—4.)

*　　*　　*

నన్ను రెండు వారాలపాటు హఠాత్తుగ రష్యాలో ఎడిపెట్టిన శ్రీమతి జమునకి ధన్యవాదాలు చెప్పకుండా వుండలేను. ఆమె సరిగ్గా చూసేరో లేదో గాని అక్కడి విషయాల్ని మాకు బహు చక్కగా చూపేరు. కేవలము సినిమాపై దృష్టిలో పెట్టుకొనకుండా, అక్కడి సహజ సాంఘిక జీవనాన్ని కూడ చక్కగా చూపేరు. అందుకు చాల ఆనందంగా వుంది. ఆమె చెప్పే తీరు అమోఘంగా వుంది. అయితే మరో వారం పాటు మీ పత్రిక వచ్చిన దాకా అలా రష్యాలోనే వుంటాను.

అక్కడి మిగతా జీవన క్రమాన్ని కూడ సవివరంగా తెల్పగలందులకు కోరుతాను.

జి. వి. ఎల్. ఎన్. స్వామి, (బరంపురం.)

## కార్టూన్లు

ఈ వారం పత్రిక (27—1—67) 19వ పేజీలో శ్రీ జయదేవ్‌గారు వేసిన చిత్రం చాల అసమంజసంగా యున్నది. చిత్రంలోని వ్యక్తి రేడియోలో క్రికెట్ కామెంటరీ వింటూ హాకీ బాట్‌తో బవుండరీ ఎలా కొట గల్గాడు? ఒక్క క్రికెట్ ఆట గాసే వాటిని కొట్టడమనేది ఉంటుంది. లేక తొంటరలో ఆ వ్యక్తి హాకీ బాట్‌ని క్రికెట్ బాట్ అనుకొని కొట్టాడా?

మహేంద్రవాడ విశ్వనాథం,
ములగాల సత్యవరప్రసాద్, (గొల్లప్రోలు.)

## కథలు

ది. 27—1—67 సంచికలో ప్రచురించిన కథలన్నీ చాలా బాగున్నాయి. మురళీకృష్ణగారి "తప్పు" కథ నా హృదయాన్ని కదిల్చి వేసింది. వెంకటేశ్వరరావు గారి "లచ్చి" నా కెంతగానచ్చిందో మాటల్లో వ్రాయలేక పోతున్నాను. లచ్చి నిజంగా ఈ కథలో జీవించిందనే చెప్పాలి. ఈ కథని యెన్నిసార్లు చదివినా తనివి తీరలేదంటే నమ్మండి. లచ్చి లాంటి వాళ్ళు ఈ ప్రపంచంలో ఎందరున్నారని? లచ్చి నా హృదయంలో చిరస్థాయిగా వుండగలదు. ఈ కథని మొదటిసారి చదివి లచ్చిని మర్చిపోలేకపోయాను. రెండోసారి చదివి లచ్చి అభిమానిని, మూడోసారి చదివి లచ్చి దాసుడినయ్యానయాను.

షేక్ అన్వర్‌బాషా, (ఐరాల.)

*　　*　　*

"మాయమ్మ పుట్టింది" అను కథానిక చాల బాగుంది. కథ చదువు మున్నంత సేపు ఎంతో ఉత్సాహముగా మున్నది.

యం. సౌరి, (చిలకలూరిపేట.)

*　　*　　*

శ్రీ పంచుల విశ్వనాథరావు గారు రచించిన "బాదరాయణ సమ్మంధం—పరసం—వయం" అన్న కథ చాలా సహజంగా వుంది. నిత్యజీవితంలో ప్రతివారికి కాపుణ్ణమ్మలాంటి వ్యక్తులు తారసపడుతూ వుంటారు.

"జగం", (ఖర్గపూర్.)

మూడునాలుగు రోజులుగా వర్షం పడి గొప్ప చికాకు కల్పిస్తున్న సమయంలో "రెయిన్ కోటు" కథలోని "రావు" గారిని తల్చుకున్నా. అంతే. వెంటనే ఒక గంటలో వర్షం ఆగిపోయింది.

'ఆంధ్రసచిత్ర వారపత్రిక' ద్వారా ఈ కిటుకు తెలియజేసిన శ్రీ నోరి సుబ్రహ్మణ్యశాస్త్రి గారు నిజంగా అభినందనీయులు.

యస్. వి. అప్పారావు, (హిందుపురం.)

## సిరిసిల్ల

27—1—1967 పత్రికలో పాఠకుల ఉత్తరాలలో శ్రీ ఎం. ఓ. గోస (బొబ్బిలి)గారు నా "మృత బాతం"లో ఒక విషయం విమర్శించారు. అంతటితో వూరుకోక 'ఇటువంటి విషయములలో కొంత రసాయనిక అనుభవం యుండుట మంచిది' అని 'ఇకనైనా ఇటువంటి తప్పులు చేయకుండా తమ రచనలను అందజేయగలరని' వ్రాశారు.

ముందుగ ఆయన రాసిన విషయం చర్చిస్తాను. స్వచ్ఛమైన నీటిలో విద్యుత్తు ప్రవహించదు అన్న విషయం నిజం. కాని నేను, గాజు తొట్టిలోని నీరు 'స్వచ్ఛమైన నీరు' అని రాయలేదు. అది వారి వూహామాత్రమే. 'నీళ్ళు' అని వాడాను. స్వచ్ఛమైన నీరు (ప్యూర్ డిస్టిల్డు వాటర్) మనము తయారైనా చెయ్యాలి, లేక వాన నీటిస్నైనా (Industrial area) కాని చోట పట్టవలెనా ఎట్లాగో. అంతేగాని మామూలు నీరూ, స్వచ్ఛమైన నీరూ ఒకటి కాదు. సాధారణంగా అనేక వూళ్ళల్లో త్రాగే నీరు కొంచెం acidic అనగా ఆమ్లమయంగా వుంటుంది. కాబట్టి తప్పకుండా ఆ నీరు విద్యుద్వాహకంగా పని చేస్తుంది. ఇది ఎలెక్ట్రిక్ హీటర్లు ఉపయోగించే వారికి ప్రత్యక్ష అనుభవం. గాజుతొట్టిలో నీరు—స్వచ్ఛమైన—నీరు—అని రాయనప్పుడు, అది మనం మామూలుగా వాడే నీరు, అది acidic గా వుండడంలో అసంభవమేమీ లేదని పాఠకులు చాలామంది వూహించుకొని వుంటారు. కాని శ్రీ గోస్‌గారు, 'రచయితకు రసాయనిక అనుభవం యుండుట మంచిది' అన్నారు. నాకు రసాయనికశాస్త్రంలో రెండు యూనివర్సిటీ డిగ్రీలు వున్నాయి. పదిసంవత్సరాలకు పైగా రసాయనిక శాస్త్రజ్ఞుడిగా అనుభవం వుంది. కాబట్టి రచనలను శ్రద్ధగా చదువకుండా, 'ఇకనైనా ఇటువంటి తప్పులు' ఉత్తరాలలో వ్రాయరని ఆశిస్తున్నాను, ఆ పాఠక మహాశయులు.

చిత్తగించవలెను.

రంగధామ్, (తాడేపల్లిగూడెం.)

## లోకం పోకడ

20—1—67 మీ పత్రికలో ప్రచురితమైన 'లోకం—పోకడ'లోని విషయాలు ఆసక్తిదాయకంగా వున్నవి. ప్రతివారమూ ఇటువంటివి ప్రచురించ మనవి.

శ్రావణిగారి ఆహారము—ఆరోగ్యము వ్యాసంలో గోధుమను గురించి ఒక్కక్షరం గూడా వ్రాయలేదు. ఎందుకనో? వేరుశనగ పప్పులను పిండిగ చేసి గోధుమ పిండిలో కలిపి పూరియైనా, చపాతీయైనా చేసుకు తింటే బలము అధికమవుతుంది. కష్ట పడు వారికి ఇదొక కలగదు. శరీరానికి చాలా మంచిది. కె. శివరామయ్య (కొల్లూరు)

# ఆంధ్రసచిత్ర వారపత్రిక


వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులు గారు

శుక్రవారం : 10—2—'67
పరాభవనామ సం॥ మాఘ మాసం॥ శుద్ధ పాడ్యమి

సంపుటము : 59 సంచిక : 22

స్థాపితము :
1908

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1


చందా వివరాలు : 10-2-1967 మొదలు
భారతదేశం

పోస్టు ద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 22.40 |
| 6 మాసముల చందా | 11.20 |
| 3 మాసముల చందా | 5.60 |
| విడిప్రతి | 0.40 |

ఇతరదేశాలకు
ఓడమీద (Sea Mail)

| | |
|---|---|
| సంవత్సర చందా | 42.00 |
| అర్థసంవత్సర చందా | 21.00 |

## విషయానుక్రమణిక

ముఖచిత్ర రచన శ్రీ కె. శేషగిరిరావు.





శ్రీ కృష్ణ

# సాంఘిక విలువలు - శ్రామిక వర్గము

జాతీయ ఉత్పాదనా సంఘానికి ఒక పత్రిక వుంది. దాని పేరు 'ప్రొడక్టివిటీ'. ఉత్పాదన అన్నమాట. సంతకంతో సహా ప్రచురించిన వ్యాస మొకటి అందులో వుంది. ఆ వ్యాసాన్ని బట్టి మన కేంద్ర కార్మికమంత్రి బాబూ జగ్జీవన్‌రావ్ గారి భావాల్ని యిట్టే పసిగట్టేయవచ్చు.

"ఉత్పాదనపై కార్మికుల వైఖరిని గురించి మాట్లాడే ముందు, కార్మికులు సంఘంలో భిన్న వర్గానికి చెందినవారేమీకాదు, వారూ సంపూర్ణ పౌరులున్నవారేనని గ్రహించుకోవాలి. సంఘం యొక్క తీరు తెన్నుల ననుసరించే కార్మికులూ వుంటారు. దురదృష్టవశాత్తు నేటి మన సంఘంలో విధానాలు, సాంఘిక విలువలు ఉత్పాదనకు అంతగా అనుకూలంగా లేవు. 'నువ్వెంత తక్కువగా పని చేస్తే అంత మర్యాదగల వాడివి, నువ్వసలు పనినే చేయకపోతే నీయంతటి మర్యాదగల మనిషి ఈ భూమ్మీద యిక లేనేలేడు?'—మనమిప్పుడు వినిపిస్తున్న సంఘం సాధించిన ప్రయోజనాలు ఇవి. ప్రబలమైపోయిన యిలాంటి ప్రయోజనాల్ని దాటి బయట పడేందుకు మనకిప్పుడు అవకాశం లేదు.

అంచేత శ్రామికోత్పాదన గురించి, ఉత్పాదన వైఖరిని గురించి మాట్లాడే ముందు, ప్రధానమైన సాంఘిక విధానాలు పూర్తిగా మారిపోయేలా చూడాలి.

ఉత్పాదనలో కార్మికుల వైఖరి అంత సుముఖంగా లేదూ అంటే అందుకు కారణం వారి పనితనాన్ని గుర్తించలేకపోవడమే. అది పొలం కానివ్వండి, ఫ్యాక్టరీ కానివ్వండి, లేదా సచివాలయమయినా సరే. ఇవి సంఘానివే కదా. పని తక్కువయినా ఎక్కువ గుర్తింపు కావాలని అందరూ అనుకుంటూ వుంటారు. ఇది నేను గమనించిన విషయం. మానవకోటి స్వభావమే అలా వున్నప్పుడు, తక్కువ పనికి బాగా గుర్తింపు లభించాలని కార్మికులు వాంఛిస్తే మనం వారిని నిందించడంలో అర్థంలేదు. ఇది సంఘం (అంటే మనుషులు!) సరికొత్త విధానం. బాధ్యతల్ని ఇలా కొలుచుకొంటూ నిశ్చయాలకు వచ్చేస్తున్న ఇటువంటి వైఖరిని సమూలంగా త్రుంచి వేయాలి. ఆధారమెక్కడో తెలుసుకుని దాన్ని అంత మొందించాలి, లేదా భారతదేశం ఎప్పుడూ అట్టడుగునే వుండిపోతుంది. ప్రపంచంలోని ఇతర దేశాలతో ఉత్పాదనపరంగా పోల్చి చూసుకున్నప్పుడు న్యూనత గానే వుంటుంది. అందువల్ల సంఘం యొక్క వైఖరి మారాలి. పని, పాటు, ఉత్పాదన అన్నిటిలోనూ మార్పు రావాలి. ప్రపంచంలో తదితర దేశాల పోటీకి నిలబడగల్గాలంటే, సరిసమానంగా ఉత్పత్తిని సాధించాలంటే, సంఘం యొక్క స్వభావం మారడం ముఖ్యం. అప్పుడు పనివాళ్ళు బాధ్యత తెలుసుకుంటారు. ఉత్పత్తిని పెంచుతారు. సంఘం సుఖ సంపదలతో తులతూగడానికి, సర్వసమృద్ధం చేసుకోడానికి మనుష్యుల ప్రమాణం పెరగాలి. అన్నివిధాల ఎదగాలి. కొండను తవ్వి ఎలుకను పట్టడం లాంటి కష్టతరమైన పని అది. అయినా ప్రయత్నించాలి కృషి చేయాలి."— ఇది ఆయన వ్యాస సారాంశం.

ఆమరణమూ పని చేశారు గనక మహాత్మాగాంధీ, పండిట్ జవహర్లాల్ నెహ్రూ, లాల్‌బహదూర్ శాస్త్రి వీరందరూ మనుషులు కారని బాబూ జగ్జీవన్‌రావ్‌గారి ఉద్దేశమా? ఈ ముగ్గురూ దేశానికి అపకీర్తి తీసుకువచ్చారని కాబోలు! పై ముగ్గురి వలెనే జగ్జీవన్‌రావ్ కూడా శ్రామికవర్గానికి చెందిన ప్రతినిధిగా వచ్చారు. కార్మికమంత్రిగా తమ వంతు విధిని నిర్వర్తిస్తున్నారు. అసలు కార్మికులు అధిక సంఖ్యలో వున్నది రైల్వే, తంతితపాలా శాఖల్లోనే. జగ్‌జీవన్‌రావ్‌గారు కార్మికమంత్రి ఉన్నత ప్రమాణం గల వ్యక్తి! ఆయా శాఖల్లో 'తక్కువ పని ఎక్కువ గుర్తింపు' కోసం గోల జరుగుతున్నది కదా. మన ఉత్పత్తుల్లో స్థాయి తగ్గి, ప్రపంచ మార్కెట్‌లో ధరలు పడిపోతున్నాయి. మరి ఇటువంటి ఉత్పాదనకు సాంఘిక విలువలు ఎలా దోహదం చేస్తాయో బాబూ జగ్జీవన్‌రావ్ చెప్పనేలేదు. భిన్నమైన సాంఘిక విలువల్ని ఆధారం చేసుకుని అవకాశం అందుబాట్లో వున్న దేశాల అడుగుజాడల్లో గుడ్డిగా నడుస్తూ, పారిశ్రామికంగా అభివృద్ధిలో వున్న దేశాలకు అనుకూలంగా వుండే న్యాయసూత్రాల్ని తయారుచేసి వాటిని ప్రయోగించి కోతికొమ్మచ్చులాడుతూ వుంది ఆయన మంత్రిత్వం. ప్రపంచ మార్కెట్టులో భారతదేశ తయారీలకు ప్రాతినిధ్యం కావాలంటూ వాణిజ్యమంత్రిత్వశాఖ అందుకు శ్రమ పడుతోంది. కార్మిక మంత్రిత్వం చూస్తే ఇలా వుంది. ఇది విరుద్ధమైన వ్యవహారం కాదా? ఒకోసారి ముందుగానే భుజాలు తడుముకొని ఈ పద్ధతిని సమర్థిస్తున్నారు కార్మికమంత్రి. 'పని' అనే దాని మీద భారతీయ విధానం అంతగా బాగుండడంలేదు, అందుకనే ఉత్పాదనలో స్థాయి జారిపోతూ వుంది— అంటున్నాయి పారిశ్రామికృతమైన దేశాలు. ఆదేశాల్ని వెనక వేసుకువచ్చి వంతపాడుతున్నారు కార్మికమంత్రి!

## ఆకాశవాణిలో వ్యాపార ప్రకటనలు

వ్యాపారానికి సంబంధించిన ప్రకటనల్ని రేడియో, టెలివిజన్‌లలో పరిమితంగా ప్రవేశపెట్టదలిచినట్లు భారత ప్రభుత్వం ఇటీవల ప్రకటించింది.

చాందా కమిటీ సిఫార్సుల అనంతరం ఇటువంటి నిర్ణయం తీసుకోవడం జరిగింది. సిఫార్సుల్లో వున్న నియమాలు ఇవి:

"రాబడిని అధికతరం చేసుకోడానికి, పథకాలను విస్తరించుకోడానికి, కార్యక్రమాల్లో చక్కని మార్పులు తీసుకురావడానికి వీటన్నిటికీ డబ్బు కావాలి. ఆదాయాన్ని అభివృద్ధి చేసుకోవాలంటే అడ్వర్టయిజ్‌మెంట్లను ప్రవేశపెట్టడమే ఉచితం. ఆ ప్రకటనలు కూడా కొన్ని భద్రతలను దృష్టిలో వుంచుకుని అదుపు ఆజ్ఞల్లో వుంటూ మితంగా వుండాలి. 'వివిధ భారతి' ప్రసారాల్లో ప్రవేశపెట్టినట్లుగానే ప్రాంతీయ కార్యక్రమాలకు, విదేశీ ప్రసారాలకు కూడా దీనిని వర్తింపజేసుకోవచ్చును."

ఈ సూచనలకు, నియమాలకు రేడియో సమాచార శాఖల మంత్రిత్వం ఎదురు చెప్పింది. "ఈ కమిటీ వెదికరించిన ఉద్దేశాలు మంచివికావు. వ్యక్తిగతమైన ఒత్తిడివల్ల, 'ఒకరు' లేదా చాలమంది బలాత్కారము వల్ల, పక్షపాత బుద్ధితోను ఈ సూచనలు చేశారు." అని నేరాన్ని ఆపాదించారు. ఈ మంత్రిత్వంలోని ఒక వ్యాఖ్యాత ఇలా అన్నారు:

"ప్రయివేటు ఆదాయాల్ని, స్వదేశ సంబంధమైన ఆదాయాల్ని తుడిచిపెట్టడంపై మన భారతజాతీయ అభివృద్ధి పథకాలు ఆధారపడి వున్నాయి. అనవసర వినియోగ వస్తువుల తయారీల్లోనే ఇదంతా వృథా అయిపోతోంది. జాతీయ నిర్మాణానికి ఉపయోగించే ప్రధాన వస్తువుల ఉత్పత్తి కోసం అంతగా పాటుబడుతున్నట్లు కన్పించడంలేదు. ఇందుకై పెట్టే పెట్టుబడులను దృష్టిలో వుంచుకుంటే ఈ విషయం ఇట్టే ద్యోతకమవుతుంది. ప్రస్తుతం వున్న కంపెనీలను లెక్కపెట్టుకున్నా చాలు. అందుకే భారీసామగ్రులు జనం అందుబాట్లో లేకుండా పోతున్నాయి. సరే, ఆర్థిక వాదాన్ని చాటు చేసుకొని ఇది అంత చర్చించుకోతగిన విషయం కాదని సంతృప్తి పడదాం. ఇప్పుడు ఆకాశవాణిలో ప్రవేశపెడుతున్న వాణిజ్య ప్రసారాల ప్రసక్తి తీసుకువద్దాం. టెలివిజన్ మనదేశంలో యింకా పాపాయి దశలో వుంది. విస్తరించడానికి ఇంకా ఎన్నేళ్ళు పడుతుందో? ఆకాశవాణిలోను, ప్రారంభదశలో వున్న టెలివిజన్‌లలోను విరివిగా ప్రకటనలను చేసేవారు జనాన్నాకర్షించే తక్కువరకం మూకుమ్మడి వస్తువుల పంపిణీదార్లు. ప్రచారం లేకపోయినా జనాదరణ పొందుతూనే వుంటాయి ఇవి. ఇక ప్రచారం లభిస్తే పట్టపగ్గాలుండవు. ఈ వస్తువులు ఏమిటీ అంటే—ప్రాసెస్ చేయబడిన ఆహారోత్పత్తులు, ఆడంబరం కోసం

ఉపయోగపడే పదార్థాలు, సౌందర్య సాధనాలు, అలంకరణ వస్తువులు, విలాసవస్తువులు, ఖరీదైన బట్టలు. ఇవి వాణిజ్య ప్రసారాలను ఉపయోగించుకునే పక్కా తయారీలు. రేడియో, టెలివిజన్‌లలో ప్రపంచ వ్యాప్తంగా ప్రకటించబడుతున్న వస్తువులు. ప్రకటనలలో అగ్రస్థానం ఆక్రమించినవి ఇవే.

మన ప్రభుత్వం పొదుపు పొదుపు అంటూ మొత్తుకొంటూ వుంది. వృథా ఖర్చుల్ని తగ్గించడానికి శాయశక్తులా ప్రయత్నిస్తూ వుంది. జనాన్ని అలానే చేయమని, పైన చెప్పిన వస్తువుల అన్నిటి వినియోగాన్ని తగ్గించుకోమని బోధిస్తున్నది ప్రభుత్వం. వీటికి అధిక ప్రచారం ఇవ్వడంలో ఉద్దేశ్యమేమిటి? ప్రపంచంలో ఎక్కడా భారీ సామగ్రికు తగిన ప్రచారం లేదు. రేడియో, టెలివిజన్‌లు ఆమాటే ఎత్తడంలేదు. యంత్రాలను తయారు చేసే యంత్రాలకే దిక్కులేదు. 'పవర్ జనరేటింగ్' యంత్రాలను పట్టించుకున్న వాళ్లే లేరు. చిన్నరకం వస్తువుల ఉత్పత్తిదార్లు ఆకాశవాణిలో ప్రకటన్న ప్రసారం కోసం ముందుకు వస్తున్నారు. 'ఫిల్మ్స్ డివిజన్' కోసం చిత్రాలను నిర్మించడానికి ఎగబడుతున్నారు. మనదేశంలో కూడా ఈ విధమైన కంపెనీలకే ఎక్కువ ప్రాతినిధ్యం లభిస్తూ వుంది. హిందూస్తాన్ లివర్, ఇంపీరియల్ టొబేకో, బర్మాషెల్ మొదలైన కంపెనీలు అగ్రగణ్యాలు. భారీపరిశ్రమలు వాటి ఉత్పత్తుల ప్రచారం కోసం రేడియో టెలివిజన్‌లను ఉపయోగించుకుంటా యనుకోవడం ఒకభ్రమ. వాళ్లకు ఇటువంటి ప్రచారం మీద అంతగా ఆసక్తి లేదు. 'మెషిన్ టూల్' ఇండస్ట్రీ, లేదా నిత్యావసరాలైన మన్నిక గల వస్తువులకు ఈ ప్రకటనల సదుపాయం ఎంతవరకు ఆమోదంగా వుంటుందో తెలియదు. అసలు అవి ఈ అవకాశాన్ని ఉపయోగించుకుంటాయా అని?

వ్యాపార ప్రకటనాసంబంధమైన ఈ కార్యక్రమం ప్రకటనదార్లకు వారి ఉత్పత్తులకు ఉపయోగపడుతుందన్నమాట వాస్తవం. అయితే సాంఘిక, ఆర్థిక, పారిశ్రామికాభివృద్ధిపై భారత ప్రభుత్వ విధానం దెబ్బతింటుంది. ప్రభుత్వ విధానాన్ని నిరర్థకం చేయగల ఉపకరణంగా తయారవుతుంది ఆకాశవాణి. ఆకాశవాణి కేంద్రం భవన శిఖరంమీద ఎగిరే స్వతంత్ర్యోద్యమ జెండా క్రింద జరిగే ఈ వ్యాపారాన్ని చూసి మనకు మనం సంతృప్తిపడడం కష్టం. అందుచేత వ్యాపార పతాకాన్నొక దాన్ని ప్రవేశ పెట్టాల్సి వుంటుంది!"

"దేశసేవ దృష్ట్యా ప్రజాధనాన్ని పెట్టుబడిగా వినియోగించుకోడానికి ఆకాశవాణికి హక్కు వుంది. దేశ సేవ కోసం ఆకాశవాణి ఏమి చేయాలి? విద్య, విజ్ఞానం, వినోదం అనేది ఆకాశవాణి లక్ష్యం. మన ప్రభుత్వం ఎంతో తెలివైంది, వివేకమైనదీను. అంతటి ప్రజ్ఞావంతమైన ప్రభుత్వమూ విద్య, విజ్ఞానం, వినోదాలకు ఎంతగా కృషి చేస్తూ వుందో అర్థమవుతూనే వుంది."

"ప్రణాళికా సంఘము ఇప్పుడున్న ఆర్థిక యిబ్బందితో సతమతమైపోతూ వుంది. ఈ విధమైన వ్యాపార ప్రకటనా ప్రసారం పరిస్థితిని ఎంతగా మెరుగుపరుస్తుందనేది ఆలోచించవలసిన విషయం. పథకాల విస్తరణ కోసం, కార్యక్రమాలను మరింత ఆకర్షణీయంగా తయారు చేయడం కోసం పెట్టుబడి లేదు అంటూ ఆర్థికమంత్రిత్వశాఖ, ప్రణాళికాసంఘము అంత సాహసం తలపెట్టలేక పోతున్నాయి. వ్యాపార ప్రకటనలు వుండి వుంటే ఆదాయం పెరిగేది. మరో రకమైన ఆదాయం లభిస్తూ వున్నప్పుడు కార్యక్రమాలను సవిస్తరంగా చక్కగా నడిపే ఏర్పాట్లు చేయవచ్చు. ఇప్పుడా అవకాశం చిక్కింది. ప్రసార కాలపరిమితిని ఎక్కువ చేస్తూ ఎక్కువమందిని ఆకట్టుకొనేలా కార్యక్రమాలను ఆకర్షణీయంగా తయారు చేయడానికి పూనుకోవాలి."

"అంతర్ నిర్మాణంలో ఈ శాఖ పటుతరం అవుతున్నది గనక, డైరెక్టరు జనరల్ దగ్గర్నుంచి మిగతా ఆఫీసర్లందరికీ ఇచ్చే జీతభత్యాలకు వాణిజ్య ప్రసారాల ద్వారా లభించే ఆదాయం చాలు. ఆకాశవాణి కార్యక్రమాల్లో పాల్గొనే కళాకారులకు ఇప్పుడు తక్కువ తక్కువ పారితోషికాలు ఇస్తున్నారు. ఇకమీదట మంచి వేతనాలు ఇవ్వడానికి అవకాశం వుంటుంది. అలాకాని పక్షంలో ఉత్తమ కళాకారులందరూ వ్యాపార ప్రకటనా కార్యక్రమాల్లో చొరబడి అక్కడ అధిక ఫలాన్ని పొందడం జరుగుతుంది. అందుచేత ఈ విషయాలన్నిటినీ సమగ్రంగా ఆలోచించి కట్టుదిట్టమైన పథకాన్ని ఏర్పాటు చేయాలి."

"ముఖ్యాతి ముఖ్యంగా, ఆకాశవాణి ప్రసారాల్లో వ్యాపార ప్రకటనలను ప్రవేశ పెట్టినప్పుడు, ఈ శాఖ దేశసేవ చేస్తున్నదని చెప్పుకోడానికి అర్హత కోల్పోతుంది. ఇది ప్రభుత్వ స్వతంత్ర వ్యాపారమై వూరుకుంటుంది."

చాందా కమిటీ సిఫార్సులను అంగీకరించిన కేంద్ర మంత్రివర్గం తీర్మానం మీద అనేక వాద ప్రతివాదాలు తలెత్తాయి. ప్రభుత్వం తన ప్రధాన నియమాల్ని ఉల్లంఘిస్తున్నదంటున్నారు. చిన్న చిన్న ఆదాయాలను పోగుచేసి ప్రణాళికాసంఘానికి నచ్చజెప్పి అది వేసే పథకానికి తోడ్పడమంటోంది. ప్రభుత్వం. ఈ వ్యాపార ప్రకటన్ని ఆమోదించడంతో కొంత దారి కనబడుతుంది. వాద ప్రతివాదాలు లేనిదెప్పుడు? ప్రభుత్వానికి విధానమంటూ ఒకటి వుంటే దాన్ని ఎక్కడ చక్కగా అనుసరించింది? ప్రభుత్వం అనుసరించిన విధానమేదీ మెచ్చుకోలును తెచ్చుకోలేదు. వినియోగ వస్తువుల వాడకం తగ్గించడం ద్వారా కొంత మదుపు పెట్టొచ్చు. 'కంపల్సరీ డిపాజిట్లు', 'యాన్యుటీ డిపాజిట్ పథకాలు' సరయిన మార్గాల్లో నడుస్తున్నాయనా? ఎండమావుల్ని చూసి ఉవ్వెత్తున ఉప్పొంగిపోవడం మాత్రం కనిపిస్తూ వుంది. ఒక్కో శాఖలోను మిగులు తేలిన డబ్బు ఏమైనా వుంటే, సత్ప్రయోజనాలైన అవసర వస్తువులను ప్రజలకు అందుబాటులో వుంచేందుకు దానిని వినియోగించడం అవసరం. ఏది ఏమైనా, ఎట్టకేలకు వ్యాపార ప్రకటనా ప్రసారాలను ప్రభుత్వం ఆమోదించడం ముదావహం. ●

## లోకం పోకడ

(మైసూరు ముఖ్యమంత్రి శ్రీ నిజలింగప్ప "కదిలే మహారాష్ట్ర ఎల్లలు" అనే గ్రంథాన్ని ఆవిష్కరిస్తూ బెంగుళూరులో ఇలా అన్నారు):—"మైసూరు తన ఎల్లలని సవరించాలని అనుకున్నప్పుడు, కొత్త ప్రాంతాలు సంపాదించుకోవాలనికాక, మైసూరు బయట కన్నడభాష మాట్లాడేవారు పరిపాలనా సౌకర్యంకోసం కోరే కోరికలని గౌరవించాలని మాత్రమే అనుకుంటున్నది."

—టయిమ్స్ ఆఫ్ ఇండియా (28—1—67)

* * *

"నేను సెనెటర్ ఫుల్‌బ్రయిట్ చేతిలో బొమ్మనికాను. నన్ను ఇక్కడ నియమించటానికీ, తీసివెయ్యటానికి ఆయనకి హక్కు లేక అధికారం లేదు. నన్ను నమ్మకపోతే శ్రీ ఫుల్‌బ్రయిట్‌తో ప్రయత్నించి చూడమని చెప్పండి."

—దక్షిణ వియత్నామ్ ప్రధానికి (వార్త)

* * *

—ఇది అమెరికా "బలవంతంగా అమలుపరచిన షరతు." దానిని ప్రధానమంత్రి వెనువెంటనే తోసిపుచ్చివేసి ప్రజలతో "జాతీయాభిమానాన్ని అమ్ముకొనటంకన్నా పస్తు పడి" ఉండటానికే సిద్ధంకమ్మని చెప్పి ఉండాలి. —పేట్రియాట్ (24 1-67)

* * *

—(పూరీ) ఆచార్యులు తమ వేదనని తమంతటే ఆపివేసుకుంటే అది 'జ్యోతి'కి ప్రతిగా చేసిన పాపం కానేరదు.

—'ఆర్గనయిజర్'లో చిత్రగుప్త

* * *

—తను (మావ్ ట్సెటుంగ్) తయారుచేసిన ఉద్యమమే తనని పరిత్యజిస్తూ ఉన్నదంటే దానికొక ముఖ్యకారణం ఉంది. ఆయన ఈ ఉద్యమానికి చిహ్నాలుగా ఉన్న స్వేచ్ఛా మానవ ప్రధాన సిద్ధాంతాలని వదులుకుని తన ప్రజల మీద 'ప్రొలేటేరియన్ డెమోక్రసీ' అనే పేరుతో ఒక సైనిక నియంతృత్వాన్ని బలవంతంగా నియమిస్తున్నాడు. విప్లవిక నిరాడంబరత అనే పేరుతో శాశ్వతంగా హీనమయిన జీవిత ప్రమాణాలని అమలు [illegible] చూస్తున్నాడు. సిద్ధాంత పవిత్రత [illegible] అంతర్జాతీయంగా వంటరితనాన్ని [illegible]

—పేట్రియాట్ (25—1—[illegible])

* * *

—బొంబాయి ఎన్నికల కురుక్షేత్రం అయిపోయింది. —[illegible]

James Bond
BY IAN FLEMING
DRAWING BY JOHN McLUSKY

BOND HEARD THE SOUND OF A CAR DRIVING OFF. HE WAS ALONE IN GOLDFINGER'S HOUSE, WITH ALL ITS SECRETS...
TRAP OR NO TRAP, THIS IS TOO GOOD A CHANCE TO MISS.
LOOKS HARMLESS ENOUGH. HANDY HAVING ONE'S OWN MECHANICS— HE MUST'VE DENTED A PANEL.
BEHIND THE HOUSE WERE WORKSHOPS, WHICH SEEMED TO BE SOME SORT OF METAL-WORKING BUSINESS...
734
BACK IN THE HOUSE...
TIME FOR A LOOK-SEE AT THE BATHROOM AND THE BEDROOMS. THAT'S WHERE THE REAL SECRETS USUALLY ARE...

కారు బయటికి వెళ్తున్న శబ్దం విన్నాడు బాండ్. ఎన్నో రహస్యాలుకల గోల్డ్‌ఫింగర్ ఇంట్లో తాను ఒంటరిగా ఉన్నాడు.......

'పడటమో, పడకపోవడమో, చేజారిపోగల మంచి అవకాశం.'

ఇంటి వెనక వీవో వర్క్‌షిప్‌లు ఉన్నాయి. చూస్తే ఏదో లోహానికి సంబంధించిన వ్యాపారానికి చెందినవిగా ఉన్నాయి.......

'అంత ప్రమాదకరమైనదిగా కన్పించడంలేదు. దేనికితగ్గ అమరికతో సదుపాయంగానే ఉన్నాయి. సొట్టపడింది కాబోలు.......'

తిరిగి యింట్లో......

'చూడ్డానికే కిదే తగిన సమయం. అసలు రహస్యాలు దాగి ఉండేది బాత్‌రూంలు, బెడ్‌రూముల్లోనే.'

James Bond
BY IAN FLEMING
DRAWING BY JOHN McLUSKY

ONLY ONE OF THE FIRST FLOOR ROOMS WAS LIVED IN, GOLDFINGER'S, BOND SUPPOSED.....
HE'S A DEVIL FOR LEAVING LIGHTS BURNING. WELL, NOTHING HERE, AND IT'S TIME TO GO...
RAAAAAAOOW.
QUIET, PUSS— YOU'RE SPOILING MY EARS. I HEAR SOMETHING— JUST.
735
YOU GOT IT TOO, CHUM? SOUNDS LIKE MOSQUITOES COMES FROM THAT CUPBOARD...

మొదటి అంతస్తులో గదుల్లో ఒకే గది నివాసయోగ్యంగాఉంది. అది గోల్డ్‌ఫింగర్ దయి ఉండొచ్చనుకున్నాడు బాండ్......

'లైట్స్ అన్నీ వేసేవెళ్ళాడు. వీడు మనిషేనా! ఇక్కడేంలేదు. ఇక కదలాలి......'

'రా అఅఅఅ వ్వా వ్'

'వినిపించిందా? చెవికింద ఏ రొద గోల? ఇప్పుడే వినిపించింది.'

'నీ క్కూడా వినిపించిందా? దోమలమోతలా ఉంది. ఆ అలమారాలోంచి వస్తోంది......'

James Bond
BY IAN FLEMING
DRAWING BY JOHN McLUSKY

TENSED UP, BOND SWUNG OPEN THE CUPBOARD DOOR. HIS JAWS CLENCHED AT WHAT HE SAW...
FILM—! CINE-CAMERAS— THREE OF THEM! RECORDING EVERY MOVE I MAKE...
THE DAZZLING LIGHTS— LIKE A FILM STUDIO! AND I'M IN THE LEADING PART! GOD KNOWS WHERE GOLDFINGER'S GOT THE LENSES HIDDEN..
736
LET THE LIGHTS GET TO THE FILM— FINE! THAT'LL FOG IT. BUT HOW DID THE CUPBOARD DOOR GET OPENED? GOT TO MAKE IT LOOK NATURAL...

అలమారా తలుపు తెరచిన బాండ్ ఆశ్చర్యపోయాడు. అతనికి కనిపించిన దృశ్యాన్నిచూసి అచేతనుడయ్యాడు.......

'ఫిల్మ్!—సినీ కెమేరాలు—మూడు, నా ప్రతి

'ఫిల్మ్ స్టుడియోలా కళ్ళు మిరిమిట్లు గొలిపే లైట్లు. ముఖ్యభూమికలో నేను. గోల్డ్‌ఫింగర్ ఆ లెన్స్‌లని కనబడకుండా ఎక్కడ పెట్టాడో ఆ దేవుడికే తెలియాలి.

'లైట్ ఫిలింమీద పడేలా చేయాలి— భలే! అలా చేస్తే పనికిరాకుండాపోతుంది. అయితే అలమారా తలుపు ఎలా తెరుచుకున్నట్లు? అదీ సహజంగా కన్పించేలా చేయాలి......!







గోల్డ్‌ఫింగర్ తిరిగి రావటానికి దగ్గరపడుతున్న విలువైన నిమిషాలను గురించి బాండ్ మరిచిపోయాడు........

'నువ్వే దోషివి కాబోతున్నావు.......'

'నువ్వే ననుకోవాలి ఆ అల్మారా తలుపు తెరిచింది. ఆ ఫిల్మ్‌ని వెలుతురులోకి లాగి పాడుచేసింది కూడా నువ్వే.......'

'పిల్లిని బాగ్‌లోనించి బయటికి వదిలిపెట్టాననిమాత్రం నే చెప్తాను. ఏది ఏమైనా నా రహస్యాలు ఏవీ గోల్డ్‌ఫింగర్‌కి దొరకలేదు.....'










ఏమీ జరగనట్లే హాల్లోకి తిరిగొచ్చాడు బాండ్. ఇంకా గోల్డ్‌ఫింగర్ వచ్చిన జాడలు ఏవీ కనిపించలేదు.......

'ఇంతకీ నా చర్యలన్నీ ఉన్న ఆ ఫిల్మ్‌ని పిల్లే నాశనం చేసిందని అనుకుంటాడా......?'

'నిశ్శబ్దంగా ఉంది, కానీ సాయంకాలపు చల్లగాలి బాండ్ మెడవెనుక భాగానికి తగిలింది. గోల్డ్‌ఫింగర్ ఆ రూంలో అడుగెట్టాడు......

'హల్లో ఎప్పుడొచ్చారు? నే చూణ్నేలేదు....'

'బోర్ కొట్టలేదనుకుంటా. నేను పైకెళ్లివస్తా, తర్వాత మనం భోంచేద్దాం.......'










కొన్ని నిమిషాలు పైనుంచి ఏ శబ్దమూ విన్పించలేదు. గోల్డ్‌ఫింగర్ ప్రతి కదలికనీ బాండ్ వూహిస్తూనే ఉన్నాడు........

'మీకు పిల్లులంటే యిష్టమా మిస్టర్ బాండ్?'

'చాలా.......'

'మా నౌకర్లలో ఒకతన్ని కల్సుకోడం మీకు చాలా సరదాగా ఉంటుంది. కొరియన్లనే నేను పనిలో పెట్టుకుంటానన్నది మీరు గమనించే ఉంటారు.......'

'ఇదుగో ఆడ్ జాబ్. చిల్లర పనులుచేసే యితనికిది సరైన పేరు!'

(ఇంకా ఉంది)

# అప్పులేకాని అంతర్యం



టి. శ్యామల

గోపాలంగారు హడావిడిగా వచ్చి "ఏమోయ్! విశ్వనాథం! నీవద్ద ఒక పదిరూపాయలుంటే యివ్వు. నేను తీసుకురాలేదు. రేపుదయాన యిస్తాను" అనడిగారు. గోపాలంగారు రైల్వే ఆఫీసులో హెడ్‌క్లర్కు. జీతం అంతాకలిపి అంటే కరువుభత్యము మొదలయిన వన్నీ కలిపి నాలుగొందలు పైచిలుకు వస్తుంది. మనిషికి దాదాపు నలభై ఏండ్లు వుంటాయి. మనిషి ఎప్పుడూ చిరునవ్వుతో వుంటాడు. ఎదుటివారితో, తనక్రింది పనిచేసే గుమస్తాలతోసహా మనసునొప్పించకుండా, ఎంతోమంచి మర్యాదగా మాట్లాడుతారు. నిండైన విగ్రహం. మనిషిని చూస్తేనే అతనియందు ఎవరికయినా గౌరవభావం ఏర్పడుతుంది. విగ్రహానికి తగినట్లు ఎప్పుడూ మడత చెరగని తెల్లని బట్టలనే వేస్తాయి. గోపాలంగారు బెజవాడ రైల్వే డివిజనల్ ఆఫీసుకు వచ్చి పట్టుమని పదివేలయిగాకపోయినా, అన్ని ఆఫీసులలోనూ చాలా మందికి అతిసన్నిహితుడైనారు. ఎవరు ఏకష్టాలు చెప్పుకోటానికివచ్చినా అతి ఓపికగ వినేవారు.

విశ్వనాథం బ్రహ్మచారి. సిగిరెట్లు, వగయిరాల వంటి అలవాట్లేమీ లేనివాడు. ఉన్న డబ్బు కాస్త రూములో వదలిపెట్టేరాక, జేబులోనే పెట్టుకుని వస్తూంటాడు ఆఫీసుకి. అంచేత ఎప్పుడు ఎవరికి డబ్బు కావలసివచ్చినా విశ్వనాథం వద్దకు పరుగెత్తుకుంటూ వస్తారు. కాబట్టే తన ఆఫీసులో అందరూ విశ్వనాథాన్ని 'షాహుకారువిశ్వనాథం' అని పిలుస్తూంటారు. అలాపిలిచినప్పుడు విశ్వనాథం కోపం తెచ్చుకోక ఒకవిధమయిన సంతృప్తిని గూడ పొందేవాడు.

ఆరోజు అయిదవ తారీకే! అయినా గోపాలంగారు అడిగారు. అంటే అలా అడగటం విన్నవాళ్లెవరూ కూడ ఆశ్చర్యపడరు. విశ్వనాథం జేబులో నుండి పదిరూపాయల నోటు తీసియిస్తూ—

"చాలువాండీ! మరో పదియివ్వమంటారా?"

"అబ్బే, అవసరముండదనుకుంటా! మా రెండో వాడికి ఏవేవో మందులు రాసిచ్చాడు డాక్టరు. రెండు రోజులనుండి మరచిపోతున్నాను. ఇప్పుడే ఏదో రాసుకుంటూంటే గుర్తుకు వచ్చింది. వెంకటస్వామిని పంపించి యిప్పుడే తెప్పిద్దామని. లేకపోతే మరలా ఇల్లు చూశాకగాని గుర్తురాదు.

"మందులకయితే మరో పది తీసుకోండి. ఆపది చాల్తుందో, చాలదో"

"మరి రేపటివరకు నీకేమి యిబ్బంది కలుగదు కదా! రేపు ఇచ్చేస్తాను."

"రేపుగాకపోతే ఎల్లుండి ఇవ్వండి! ఇంతలో నాకేమీ అవసరం లేదు".

"అయితే సరే! ఆపదికూడా యివ్వు!" అని విశ్వనాథం వద్దనుండి ఆ రెండవ పది నోటుకూడ తీసుకున్నారు. హెడ్‌క్లర్కు గోపాలంగారు.

గోపాలం తన సీటులో కూర్చుంటూ "ఒరే! వెంకటస్వామీ!" అని కేకవేసి, వచ్చింతరువాత, "నువ్వు బజారుకెళ్లి యీ కాగితంలో వ్రాసివున్న మందులు పట్టుకురా! ఆ సుధామెడికల్ స్టోర్సుకు వెళ్ళు, అక్కడకాస్త చవకగా దొరుకుతాయి. అంటూ రెండు పదిరూపాయల నోట్లు వెంకటస్వామిచేతికిచ్చారు. వాడు వెళ్ళటానికి నాలుగడుగులు వెయ్యగానే "వెంకటస్వామీ! నువ్వు వచ్చేసరికి ఆలస్యమవుతుందేమో! నాకొక సిగరెట్లుపెట్టే, కాఫీ, ఇచ్చివెళ్ళు" అని పురమాయించారు గోపాలంగారు.

సాయకాలం పిల్లవాడికి మందులు ఎలాకొనటమా అని ఆలోచిస్తున్న ఆయనకు తలపైనుండి ఎంతో బరువు దింపినట్లుంది.

* * *

"ఏం! సుజా! చినబాబుకు ఎలావుంది? డాక్టరు దగ్గరకు వెళ్ళివచ్చావా? యివిగో మొన్న ఆయన వ్రాసిచ్చిన మందులన్నీ తీసుకొచ్చాను." రెండోకొడుకు మురళీ ప్రక్కన దిగులుగా కూర్చున్న భార్య సుజాతను అడిగారు గోపాలంగారు.

"ఏమీ తగ్గలేదండీ! మధ్యాహ్నం రెండుగంటలకు జావత్రాగి పడుకున్నవాడు యిప్పటివరకు కన్ను తెరవలేదు. లేపుతే మూలుగుతున్నాడు గాని, మాట, పలుకు లేదు. ఉండండి కాఫీ తీసుకువస్తాను" అని వంటింటి వైపు వెళ్ళింది సుజాత. కొడుకు ఒంటిపై చెయ్యివేసి చూశాడు. జ్వరం పేలిపోతోంది. ఆఫీసు బట్టలు విడుద్దామనుకున్న వాడు ఆగిపోయి, భార్యరాకకై ఎదురు చూస్తూ, కొడుకు పడుకున్న మంచంపైనే కాళ్లవైపున కూర్చుని కొడుకువైపు దిగులుగా చూస్తున్నాడు. ఇంతలో కాఫీ తీసుకు వస్తున్న భార్య నుద్దేశించి, "సుజా! పోని డాక్టరు వద్దకు తీసికొని వెళ్ళిరాక పోయావా!" అని అడిగాడు.

"వెళ్దామనే అనుకున్నాను. కాని మొన్న వ్రాసియిచ్చిన మందులు వాడారా" అంటే ఏం చెప్పాలా అనుకొని వెళ్ళలేదు. పైగా ఆయన బిల్లొకటి యివ్వాలిగదా!" తలవంచుకునే తనేదో నేరం చేసినట్లు చెప్పింది పాపం సుజాత.

"పిచ్చి సుజాతా! అందుకొరకని పిల్లవాణ్ణి చంపుకుంటామా! అయినా ఆయన బిల్లు ఒకరోజు అటు, ఇటుగా ఎప్పటికప్పుడు యిస్తూనే వున్నాంగా! ఏం! ఆయన బిల్లు గురించి అడిగాడా!"

"పాపం ఆయన ఖర్చుకు ఆదుకోవాలండీ! నేనే వెంటేసుకొచ్చాను."

"సరే భయంలేదు. నువ్విప్పుడు వాణ్ణి తీసుకుని వెళ్ళిరా! యీ మందును గూడా చూపించి ఎలా వాడాలో కనుక్కో. వచ్చేటప్పుడు ఆయన బిల్లు గూడా ఎంతయిందో కనుక్కో."

సుజాత సరేనని తలూపి పిల్లవాణ్ణి తీసుకో బోయింది. "ఇదిగో యీ రూపాయి తీసుకొని రిక్షామీద వెళ్ళిరండి. ఉండు రిక్షా పిలుస్తాను." అంటూ వీధి గుమ్మంవైపు బయలుదేరారు గోపాలంగారు.

"నేను బాబును తీసుకుని వెళ్ళగలను లెండి యిప్పుడు రూపాయి దండుగెందుకు?" గోపాలంగారది విని చిరునవ్వునవ్వుతూ రిక్షా కొరకెళ్ళారు.

ఉదయాన్నే లేచి, గోపాలంగారు ఆనాటి పేపరు చదువుతూ కాఫీ త్రాగుతున్నారు. పాలవాడువచ్చి ఒక ప్రక్కగా నిలబడ్డాడు.

"ఏమోయ్ గోపన్నా! నీపాల డబ్బులో! ఎంత యిందేమిటి!"

"అమ్మగారు ప్రొద్దు టేలెక్కచూశారండీ! నలభై మూడు రూపాయల అరవైరెండు పైసలైంగండీ!"

"అలాగా! ఇప్పుడు చిల్లరలేదుగాని, సాయంత్రం వచ్చి తీసికెళ్ళు."

"మా పెద్దమ్మాయిని రేపు అత్తగారింటి కంపిస్తున్నానండి. మొత్తం ఏభై యిస్తేరా ఎంతో పున్నెముంటుంది. ముందువారంలో పట్టుకుందురుగాని"

"అలాగే తీసికెళ్ళవోయ్! దాన్లో ఏముంది."

"నందేనే వత్తానండి" పాలగోపన్న వెళ్ళబోయాడు.

"నాకు ఆఫీసులో పని ఎక్కువగా వుంది. కొంచెం ఆలశ్యం కావచ్చు. దానిచేతికిస్తాను ప్రొద్దున్నే పాలు కొచ్చినప్పుడు తీసికొని వెళ్ళు."

"అట్టాగేనండి."

గోపాలంగారు పాలడబ్బు సాయంకాలం ఇస్తానని గోపన్నకు హామి యిచ్చారు. అప్పటికి డబ్బు ఎలా వస్తుందో ఆయనకే తెలీదు. ఒక్కక్షణం బాధ పడ్డాడు కాని వెంటనే సమాధానంచుకో గలిగాడు.

"అదేమిటండీ! యీనెల పాలడబ్బు వచ్చేనెలలో ఇస్తానని చెప్తానన్నారుగా! మరి యింకో ఏడురూపాయలు ఎక్కువే యిస్తానన్నా రేమిటి?"

"అవును! సుజా! పాపం గోపన్న కూతుర్ని అత్తవారింటికి పంపుతున్నాట్ట. అలాంటప్పుడు మనం ఎలా కాదనగలం. పోతేతే నేనే ఎక్కడో అక్కడ తెచ్చి ఇచ్చేస్తాను."

"మీరూ! మీధైర్యమేమిటోగాని నాకర్థంకాదు. ఎవరెంత అడిగినా మొహమాట పడి సరేనంటారు."

"సుజా! మనము ఇతరులవద్ద నుండి సహాయము పొందుతున్నప్పుడు మనమూ యితరులకు సహాయము చెయ్యాలి. మనకిచ్చే వాళ్ళుకూడ నీలాగ అనుకుంటే మనమేమయిపోతాం చెప్పు?"

సుజాతకు ఏం సమాధానం చెప్పాలో తోచక లోపలికి వెళ్ళి పోయింది.

*   *   *

అది లంచ్ టైము గోపాలంగారు ప్యూను వెంకటస్వామి తెచ్చిన టిఫిను, కాఫీ, పూర్తిచేసి, సిగరెట్టు వెలిగించుకుని—

"వెంకటస్వామీ! నాకొక చిన్నపని చేసిపెట్టాలిరా"

"ఏంటిసార్!"

"ట్రాఫిక్ బ్రాంచీలో వెంకటరత్నంగారున్నారు తెలుసుగా! ఆయనకో చీటి ఇచ్చిరావాలి."

"ఆయనకాడగూడ ఫోనువుందిసార్."

"ఫోనులో మాట్లాడితే బాగుండదుగాని. నువ్వెళ్ళిరా! యిదిగోచీటి. ఆయన చేతికే ఇవ్వు."

"అలాగేసార్."

చీటివ్వయితే యిచ్చిరమ్మారుగానీ, ఆయన ఏమను కుంటాడో, గతాలున లేదంటే ఎంత బాధపడవలసి వస్తుందో అనుకుంటూ ఆయనకు తెలియకుండానే మనస్సులోనే భగవత్ప్రార్థన చేయసాగారు గోపాలంగారు.

ఇంతలో బల్లమీదున్న యింటర్నల్ ఫోన్ గణగణ మ్రోగింది.

"గోపాల్ హియర్"

"గుడ్ ఆఫ్టర్‌నూన్! సార్! కులాసా!"

"భగవంతుని దయవలన కులాసాగానే వున్నాను. మీచీటీ చూశాను. యీమాత్రం దానికి ఫోను చేస్తే చాలదుటండీ తెలిపేస్తే వీలవుతుందా! యిప్పుడే కావాలా?"

"మీకిబ్బందిలేకపోతే యీపూట ఇస్తే నయం."

"సరే ప్రస్తుతం నావద్ద అరవై మాత్రం వున్నాయి మిగతాదానికి చెక్కు పంపిస్తాను సరేనా!"

"చాలా థాంక్సండీ!"

"అబ్బే థాంక్సు కేముందండీ యిందులో! ఈమధ్య బొత్తిగా క్లబ్బుకు రావడం లేదేం మీరు?"

"ఇంట్లో పిల్లలకు సుస్తీగా వుంటున్నది.. మీ పైకం వచ్చే ఫస్టుకు పంపిస్తాను."

"డోన్టువర్రీ! వీలు చిక్కినప్పుడు పంపండి."

అటువైపున ఫోను పెట్టబడిందని గ్రహించి, తను గూడ ఫోను పెట్టేసి—

"హమ్మయ్య యీ పూటకు గండం గడచింది. ఈ అరవైలోను పాలవాడికి ఏభై యిచ్చేస్తాను. రేపటి వలభైలో ఆ హోటలు వాడికి పద్దెనిమిదిగా బోలివ్వాలి. అదీ, పాపం నిన్న విశ్వనాథం వద్ద తీసికొన్న పదిరూపాయలు వచ్చేస్తే సరిపోతుంది." అని మనస్సులోనే లెక్కలు వేసుకున్నారు గోపాలంగారు.

"యీ కవరు మీ కియ్యమన్నారు సార్ వెంకటరత్నంగారు" అంటూ నవ్వుతూ డబ్బు, చెక్కు వున్న కవరు అందించాడు వెంకటస్వామి. కవరు జేబులో పెట్టుకుని, ఒక అర్ధరూపాయి తీసి "వెంకటస్వామీ! యీ డబ్బులతో నీ పిల్లలకు మిఠాయి కొనుక్కెళ్ళు యీపూట." అని అర్ధరూపాయి అందించారు గోపాలంగారు.

వెంకటస్వామి మొహమాటంగా "వద్దులెండి సార్! మొన్ననేగా రూపాయి ఇచ్చారు."

"అలాకాదురా! నిన్ను ఎక్కడికి పంపినా పని సవ్యంగా జరుగుతుంది ఫర్వాలేదు తీసుకో."

అలాపని చేసుకొచ్చినప్పుడంతా కొద్దోగొప్పో యిస్తూంటారు కనుకనే గోపాలంగారు ఏ పని చెప్పినా విసుక్కోకుండా చేస్తాడు వెంకటస్వామి.

అయిదు అయ్యేసరికి అందరూ ఆఫీసు వదలి వెళ్ళే ప్రయత్నం చేస్తున్నారు. అలవాటు ప్రకారం కలిసి వెళ్ళేందుకు దగ్గర యిండ్లవాళ్ళయిన మరో యిద్దరు గోపాలంగారి వద్దకు వచ్చి కూర్చుంటూ—

"ఏం! గోపాలంగారూ! ఇవ్వాళ ఓవర్‌టైం చేద్దామనుకుంటున్నారా! అయిదయినా ఇంకా టేబిల్ సర్దలేదేం! మీకింకా రెండా ఫైల్స్ వున్నాయి!"

"అబ్బే లేదండీ! యిప్పుడే డి. యస్. వద్ద నుండి ఫైల్సు వస్తే చూస్తున్నాను. ఒక్కరెండు నిముషాలుంటే నేనూ వస్తున్నాను." అంటూ టేబిల్ సర్దుకుని ముగ్గురూ బయల్దేరారు.

గోపాలంగారితో వున్న యిద్దరూ మురళి కేఫ్‌లోకి దారితీశారు. ఆ హోటల్లోనే గోపాలంగారికి ఖాతా వుంది. ఆ హోటలు ప్రొప్రయిటరు వీళ్ళ ఎదుట డబ్బు అడిగి తన పరువు తీస్తాడేమోనని తనే'

"ఏం! చౌదరిగారు నా ఎకౌంటు ఎంత యిందో చెబుదురూ. రేపు పంపిస్తాను." అని అడిగాడు ముందుగానే.

ప్రొప్రయిటరు కృష్ణయ్య చౌదరి ముఖం విప్పారింది. ఆరో తారీఖయినా యింకా డబ్బు యివ్వలేదనే బాధ ఒక ప్రక్క, అడుగుతే ఏమనుకుంటాడోననే బాధ యింకో ప్రక్కన అతన్ని వేధిస్తున్నాయి. ముగ్గురూ కాఫీలు త్రాగి, మెల్లగా నడక సాగించారు యింటి వైపు. ముగ్గురూ ఒక ఆఫీసు వాళ్ళయితే కబుర్లకు కొదవేముంది. ఆఫీసర్లను గురించో, ఏ కేసులో ఏవిధమైన తప్పులున్నాయో, వాటిని తామెలా సరిదిద్దుకోగలిగారో లాంటి మాటలే.

గోపాలంగారు యిల్లు చేరుకునేసరికి ఆరుదాటింది సుజాత అప్పుడే పిల్లవాణ్ణి డాక్టరు వద్దకు తీసుకొని వెళ్ళి వచ్చినట్టుంది.

"సుజా! చినబాబుకు ఎలా వుంది! డాక్టరు ఏమన్నాడు?"

"మరో నాలుగురోజుల వరకూ అన్నం పెట్ట కూడదుట. అడిగినప్పుడల్లా హార్లిక్స్ యివ్వమన్నారు మరికొన్ని మందులు వ్రాసి యిచ్చారు. వెంటనే కొని వాడటం ప్రారంభించమన్నారు. ఈ నాలుగు రోజులు ప్రతిరోజూ అబ్బాయిని ఆస్పత్రికి తీసుకు రమ్మన్నారు." అని డాక్టరు వ్రాసి యిచ్చిన మందుల చీటిని భర్తకు అందించింది సుజాత.

"యింతకూ ఏం జబ్బని చెప్పారు! డాక్టరు."

"జబ్బేమిటో పేరు చెప్పలేదుగాని, భయపడవలసిన అవసరంలేదని మాత్రం అన్నారు."

"ఆయన బిల్లు ఎంతయిందో కనుక్కున్నావా" గోపాలం గారడిగారు.

"పన్నెండు రూపాయలయిందని కాంపౌండరు చెప్పాడు. రెండుమూడు రోజులలో తీసుకొచ్చి ఇస్తానని చెప్పివచ్చాను."

"అలాగే! ఏదో ఒకటి చూసి ఇద్దాములే. బాబుకు హార్లిక్స్, మందులు తీసుకొస్తాను." అంటూ, బయలుదేరబోయారు.

"అదేమిటండీ! ఆఫీసు నుంచి వచ్చినవారు వచ్చినట్టే వెళ్ళిపోతున్నారు. కాళ్ళుచేతులు కడుక్కొని రండి! కాఫీ యిస్తాను."

గోపాలంగారు భార్య వైపు ప్రేమపూర్వకంగా చూశారు. ఆ చూపులకు తట్టుకోలేక సుజాత సిగ్గుతో తలవంచుకుంది. పాపం తన కోసం నేను ఏదీ ప్రత్యేకంగా చేయకపోయినా, నేనంటే ఎంత ప్రేమ! ఏ యిబ్బంది వచ్చినా తనను పల్లెత్తు మాట అని ఎరుగదు. ఛ! త్వరలో ఏదో విధంగా ఈ బాకీలన్నీ తీర్చేసి వచ్చే జీతంతో సుఖంగా గడుపుకోవాలి. నేను ఇహనుంచి అనవసరపు ఖర్చులేమి చెయ్యగూడదు." అని తనలో తను అనుకుని, కాళ్ళుచేతులు కడుక్కొని వచ్చి, భార్య అందించిన కాఫీ త్రాగారు గోపాలంగారు.

"ఏమిటి! అంత దీర్ఘంగా ఆలోచిస్తున్నారు.

# అప్పులలోని ఆంతర్యం

అబ్బాయికి మందులకు డబ్బు గురించా! యీ పూటకి డాక్టరుగారిచ్చిన మందులున్నాయి. రేపు తీసుకు రావచ్చులెండి." సుజాత మనస్సు దిగులుతో నిండిపోయింది. ఉదయం నుండి సాయంత్రం వరకు ఆఫీసులో చాకిరీ చేసుకుని వచ్చి, విశ్రాంతి లేకుండా వెంటనే బయల్దేరుతున్న భర్తను చూసి తనలో "పాపం ఎంత సహనమున్నది. నేటికి తనకు డబ్బు కరువైందేగాని, నిజంగా తను చాలా అదృష్టవంతురాలే. దేవుడు లాంటి భర్త దొరికినందుకు."

"ఫరవాలేదు! ఇప్పుడే వస్తానుగా. అడగటమే మర్చిపోయాను. ఇంట్లోకి ఏమైనా సరుకులు కావాలా?"

"వీలవుతే కాఫీ పొడి మాత్రం తీసుకురండి. తర్వాత మిగతావి తెచ్చుకోవచ్చును."

"అలాగే" అని గోపాలంగారు వెళ్ళిపోయారు.

సుజాతకు ఎన్నో ఆలోచనలు రాసాగినయి. "పాపం ఆయన గూడా దుబారా ఏమి చెయ్యరే! కాని వచ్చే వాలుగొందలూ ఏమైపోతాయో తెలియదు. ఏ నెల కానెల అక్కడిది ఇక్కడ, ఇక్కడిది అక్కడకు మారుస్తుంటేనేగాని నెలగడవదు. మరి తను కంటె తక్కువ జీతం తెచ్చుకునే వాళ్ళు ఎలా గడుపుకుంటున్నారో గదా!" అనుకుంటూ ఆలోచించసాగింది.

*  *  *

"నమస్తే! కపూర్‌చంద్ సేట్."

"నమస్తే! గోపాల్ సాబ్! ఎక్కడా కనిపించటం లేదు. ఏమిటి విశేషాలు."

"నాకు కొంచెం పని వుండి వచ్చాను." అని మార్వాడికి తనయందు ఎంత అభిమానమున్నదో చూద్దామని ఆగారు గోపాలంగారు.

"చెప్పండి! ఫికర్ నక్కో."

"నాకు కొంత డబ్బు కావాలి."

"ఎంత."

"రెండు వందలు కావాలి. ప్రతినెల మీ వడ్డీ ఇచ్చి, అసలులో పాతికకు తక్కువ గాకుండ ఇస్తాను. అంతేకాని అంతా ఒక్కసారి మాత్రం ఇవ్వను."

"అలాగే కానివ్వండి. కాని నెలవడ్డీ ముందుగానే యిరవయ్యి తీసుకుని, మిగతాది ఇస్తాను. వడ్డీ మాత్రం ప్రతినెలా కరెక్టుగా ఇస్తే, అసల్ ఎప్పుడయినా యివ్వండి. ఫర్వాలేదు."

గోపాలంగారికి వడ్డీకి పైకం తీసుకోక తప్పలేదు. ఒక ప్రక్క చిన్నవాడికి మందులు కావాలి. మరొక ప్రక్క ఇంట్లోకి సరుకులు లేవని సుజాత చెప్పినా తనకు తెలుసు. యివిగాక చిల్లర బాకీలు, డాక్టరు ఫీజు, అన్నీ ఒకవంద దాకా వున్నాయి. ఎలాగో ఈ నెలంతా గడవాలి. అందుచేత వివరీతంగా పని పోతున్నదని తెలిసి గూడా గోపాలంగారు అప్పు తీసుకున్నారు.

చిన్నబాబు మందులకే ముప్పయ్ రూపాయల వరకు ఖర్చు అయ్యాయి. వస్తూ వస్తూ భార్య సుజాతకు మల్లెపూలు, పెద్దబాబుకు జిలేబీలు, తీసుకుని ఇల్లు చేరేసరికి ఎనిమిది గంటలు దాటింది. మార్వాడి వద్ద డబ్బు తీసుకున్న కొద్ది క్షణాలు గోపాలంగారికి విచారం కలిగింది. కాని వెంటనే తేరుకుని మామూలు మనిషి అయ్యారు.

సుజాత భర్తకు, పెద్దకొడుకు మోహన్‌కు వడ్డించింది. మోహన్ దగాసీగా వుంటాడు. హైస్కూలులో 6వ ఫారము చదువుతున్నాడు, భోజనం మధ్యలో,'

"నాన్నా! నాన్నా! మా స్కూలు వాళ్ళంతా దసరా సెలవులకు హంపీ ఎక్స్‌కర్షన్‌కు వెళ్తున్నారట. వచ్చే వాళ్ళందరూ రేపటి లోపల డబ్బు యిచ్చెయ్యాలట."

"ఎన్ని రోజులురా మీ యాత్ర."

"వారంరోజులుట. భోజనం, కాఫీలు, అన్నీ వాళ్ళే పెడ్తారుట."

తను ఎక్స్‌కర్షన్ సంగతి ఎత్తినపుడు తండ్రి ఏమంటాడో అని కొంత భయపడ్డాడుకాని, తండ్రి ఏమీ అనకపోగా ఎక్స్‌కర్షన్ గురించి ప్రశ్నించేసరికి వాడి ఉత్సాహానికి అంతే లేకపోయింది.

"యింతకూ ఎంత కట్టాలట" అడిగింది సుజాత. డబ్బు విషయం ఎత్తేసరికి ఆవిడకు ఎక్కడలేని దిగులు పట్టుకుంది.

"పెద్ద వాళ్ళందరకూ అన్నానికీ, అన్నింటికీ కలిపి 20 రూపాయలట. మేము చిన్నపిల్లలం కనుక పదిరూపాయలట. నాన్నా మరినేను,వెళ్ళొద్దా" అని మారాం మొదలుపెట్టాడు.

తల్లి అందుకుని "ఎప్పుడూ ఒంటరిగా వుండ లేదు గదురా. వారంరోజులెలా వుంటావు! ఆ పది రూపాయలూ పెట్టి లాగు చొక్కా కుట్టించు కుందుగానిలే." అన్నది సుజాత.

"పోవే! అమ్మా! ఏదడిగినా నువ్వు అలాగే అంటావు! ఎన్నాళ్ళుపోయినా నేనుచిన్నపిల్లవాణ్ణేనా" అని బుంగమూతి పెట్టుకుని, తండ్రి వైపు ప్రాధేయపడుతున్నట్లు చూశాడు.

"ఒరేయ్ యిప్పుడే కదురా నువ్వన్నది. మేమం దరం చిన్నపిల్లలం అని. ఇంతలోకే ఎలా పెద్దవాడ వయ్యావురా."

"అదికాదు నాన్నా! ఒంటరిగా వుండలేనంత చిన్నపిల్లవాణ్ణి కాదుగా! అమ్మ ప్రతిదానికి అలాగే అంటుంది." అని గోపాలంగారి పెద్దకొడుకు తల్లి మీద ఫిర్యాదు చేశాడు.

గోపాలంగారు, భార్య సుజాత నవ్వుకున్నారు.

"అలాగే వెళ్ళుగానిలే. రేపొద్దున్నే అడుగు డబ్బిస్తాను." అని అన్న తండ్రి మాటలకు పిల్లవాడి ముఖం వికసించింది. వాడి సంతోషాన్ని చూసే సరికి దంపతు లిద్దరికి సంతోషం కలిగిందిగాని, సుజాతకు మాత్రం లోలోపల బాధగానే వుంది. అసలే డబ్బుకి యిబ్బందిగా వున్నది, ఇప్పుడిదొక అనవసరపు ఖర్చు అని. కాని పైకి ఏమీ అనలేక పోయింది.

*  *  *

గోపాలంగారు భోజనం పూర్తి అయిన తరువాత తమలపాకులు వేసుకుని, చిన్నకొడుకు వద్దకు వెళ్ళి చూశారు. వాడు ప్రశాంతంగా నిద్రపోతున్నాడు. పొట్ట మీద చెయ్యి పెట్టి చూశారు. వాడి వొళ్ళు బాగా వేడిగా వుంది. క్రమేణా తగ్గుతుంది అని సరిపుచ్చుకున్నారు గోపాలంగారు. ఒక వైపున అత్యవసరమైన వాటికి డబ్బు దొరికింది, రెండవ ప్రక్కన కొడుకుకు జ్వరము పూర్తిగా నయముగాక పోయినప్పటికిని ఆందోళన కరంగా లేదుగదాని తేలిక మనస్సుతో వరండాలోని వాలుకుర్చీలో కూర్చుని పేపరు చదువు తున్నారు.

సుజాత గూడ భోజనం చేసి, పని పూర్తి చేసుకుని, వంటింటి నుండి బయట పడేసరికి, దాదాపు పది కావచ్చింది. ఆమె కూడ వచ్చి, భర్త ప్రక్కనున్న కుర్చీలో కూర్చున్నది. గోపాలంగారు భార్య వచ్చింది కదాని పేపరు మడిచి, ప్రక్కనపెట్టి, భార్య వైపు చూశారు.

"ఏమండీ! మళ్ళీ డబ్బు ఎక్కడయినా అప్పు తెచ్చారా" అని అడిగింది.

"లేదులే! పదిరోజుల క్రిందట మనదొడ్లో రూపాయల చెట్టు నాటాను. దానినుంచె కోసుకొచ్చాను" అన్నారు గోపాలంగారు.

"నేను ఏది మాట్లాడినా మీకు వేళాకోళంగానే వుంటుంది. యివన్నీ ఎలా తీర్చుదామని మీ ధైర్యం" అని భయం వెలిబుచ్చింది.

"ఎలా తీర్చేదేముంది. వచ్చే జీతంలోనే తీరుద్దాము. అయినా నీ కెందుకీ బెంగ. నీకెన్నోసార్లు చెప్పాను. వీటిని గురించి ఆలోచించవద్దని. ఆ పడే బాధలేవో నేనేపడతాను కదా!"

"మీరు బాధపడుతూంటే నేనెలా నిశ్చింతగా వుంటానండీ. నెలకు నాలుగొందలు వస్తున్నా అదేమి ఖర్మమోగాని, మనకప్పుడూ ప్రతిదానికీ వెతుక్కోవటమే అవుతుంది." అని నిట్టూర్పు విడిచింది.

గోపాలంగారికి భార్య ప్రవర్తన కొంత విసుగు కలిగించింది. "అదేమిటి! సుజా! నేను నా కొరకు ఏమైనా అప్పులు చేస్తున్నానా? నెలంతా ఎక్కడ యిబ్బంది పడతావోనని గదా నేను తీసుకురావటం. మీకు కావలసినవన్నీ ఏదో విధంగా యిస్తున్నా. మీరెవ్వరూ తృప్తిపడటం లేదంటే అది నా దురదృష్టమే అనుకోవాలి." అన్నారు.

"మిమ్మల్ని నేనేమి అనలేదండీ! వున్న పరిస్థితులు చెప్పానుగాని, మీరు నాకేదయినా తక్కువ చేశారని అన్నానా?" అని సంజాయిషీ చెప్పుకుంది.

గోపాలంగారు వచ్చే విసుగును అణచుకొని ప్రశాంతంగా అన్నారు. "మనేం చేస్తాం చెప్పు. ప్రతి ఖర్చు అవసరమైనదే! ఏది లేకపోయినా జరుగదయ్యె. అయినా మనమెవ్వరికీ తిరిగి ఇవ్వకుండా పోవటం లేదుగా".

"ఇప్పుడెందుకండీ! పెద్దవాణ్ణి ఆ ఎక్స్‌కర్షన్‌కు పంపటం. పదిరూపాయలు కట్టాలి. పోయేటప్పుడు మరో అయిదయినా చేతి ఖర్చులకు యివ్వాలి. ఏదో చెప్పి వాణ్ణి మరిపించితే పోయెగా."

"పోనీలే సుజా! పిల్లల సరదాలు యీ వయస్సులోనే వుంటాయిగాని మన యీడు వచ్చినప్పుడు వుంటాయా? బాధ్యత తెలియని సంతోషపు రోజులు ఇవేగదా వాళ్ళకు. అయినా నెలకు యిన్నివందల ఖర్చు పెడుతూ వాడికిచ్చే పదిహేను రూపాయలతో మనకయ్యే ఆదా ఏముంది."

"ఏమో! బాబూ! మీ ధైర్యం!" అని నవ్వి వూరుకుంది. సుజాత మరునాడు గోపాలంగారు ఆఫీసుకు వెళ్తూ ఒక్క అయిదు రూపాయలు మినహా యించి రాత్రి మార్వాడి వద్ద వడ్డీకి తీసుకొచ్చిన రెండువందల రూపాయలు, వెంకటరత్నం గారిచ్చిన అరవై రూపాయలతోసహా, సరుకులు కొనగా మిగిలిన పైకమంతా సుజాత కిచ్చి, "నా దగ్గరున్న డబ్బంతా

యిదే. దీనితో యివ్వవలసిన బాకీలన్నీ యిచ్చేసి, యింటికి కావలసినవన్నీ తెప్పించుకో." అన్నారు.

"అయితే పెద్దబాబుకు పదిరూపాయలు యిచ్చి పంపమంటారా?"

"ఆ! ఇచ్చేసెయ్!" అని చెప్పారు.

గోపాలంగారు ఆఫీసుకు వెళ్ళారు. పన్నెండు గంటల వరకు ఆఫీసు పనితో మునిగిపోయారు. అప్పుడు గుర్తుకు వచ్చి వెంకటస్వామిని పిలిచి "యీ చెక్కు తీసికెళ్ళి మార్చుకురా" అని క్రితం రోజు వెంకటరత్నంగారిచ్చిన నలభైరూపాయల చెక్కును యిచ్చి పంపారు.

గోపాలంగారు ఎప్పుడు తీరుబడిగా వుంటారా అని చూస్తున్నట్లు, ఆయన కుర్చీలో వెనకకు వాలి కూర్చున్న వెంటనే తన క్రింద ఎల్. డి. సి.గా పని చేసే కృష్ణమూర్తి చేతితో ఒక ఎర్ర కాగితం పట్టుకుని వచ్చి,

"సార్! సార్! మీకోసమే చూస్తున్నాను.. మా చెల్లెలుకు సీరియస్‌గా వుందిట యిప్పుడే టెలిగ్రామ్ వచ్చింది. మధ్యాహ్నం బండికి వెళ్తాను. ఒకవారం రోజులు సెలవు కావాలి సార్" అని అడిగాడు.

"సెలవు సంగతి సరేకాని! పిల్లకు ఏమిటి జబ్బు'

"ఏమో సార్! నాలుగురోజుల క్రిందట వచ్చిన వుత్తరంలో కూడా జబ్బు విషయమేమీ లేదండి. అందుకనే భయమేస్తోందండి.'

"ఎన్నేళ్ళుంటాయి."

"పదిహేనేళ్ళండి. మా వూళ్ళోనే స్కూలు ఫైనల్ చదువుతోందండి"

"సరే! వెళ్ళిరా నీకు బండి ఎన్నిగంటలకు?'

"రెండుగంటల కండి."

"రేపటి నుండి లీవు పెట్టి, యీ పూటకు పర్మిషన్‌కు రాసిచ్చెయ్."

"చాలా థాంక్సండి." అని చెప్పి కృష్ణమూర్తి వెనుదిరిగి వెళ్తున్నాడు.

"కృష్ణమూర్తీ" అని కేకేశారు గోపాలంగారు.

"ఏమిటి సార్!

"మరి నీ దగ్గర కావలసిన డబ్బున్నదా! లేకపోతే ఏమయినా కావాలా?"

"ఫరవాలేదులెండి. ఏదో కొద్దిగా వుంది."

"కావలసి వస్తే సందేహించకు. చెప్పెయ్"

"ప్రస్తుతం నా వద్ద ముప్పయ్ వున్నయ్ సార్! మీకు యిబ్బంది లేకపోతే మరో యిరవై వుంటే యివ్వండి సార్! మళ్ళీ ఇస్తుకిచ్చేస్తాను."

"అలాగేలే! వెంకటస్వామిని బ్యాంకుకి పంపించాను. వాడు వచ్చిన వెంటనే తీసుకుని వెళ్ళు."

ఆనాటి సాయంకాలం నాలుగుగంటలకు ట్రాఫిక్ బ్రాంచి హెడ్‌క్లర్కు అయిన వెంకటరత్నంగారు గోపాలంగారి దగ్గరకు వచ్చారు.

"రండి! రండి! వెంకటరత్నంగారూ దారి తప్పలేదు గదా!" సాదరంగా ఆహ్వానించి, వెంకటస్వామిని పిలిచి, రెండు కాఫీలు తెమ్మని పురమాయించారు గోపాలంగారు.

"దారి తప్పటం ఏంలేదు. మీ పిల్లవాడికి సుస్తీగా వుందన్నారు గదూ ఎల్లా వుందో కనుక్కు వెళ్దామని వచ్చాను."

"మీ దయవలన యిప్పుడు కొంచెం కులాసా గానే వుందండి."

"ఏ డాక్టరు వద్దండీ మీరు మందిప్పించింది?"

"మెయిన్ రోడ్డులో డిస్పెన్సరీ వుంది. డాక్టరు కృష్ణయ్యగారని."

"ఓహో! కృష్ణయ్యగారా! ఆయన హస్తవాసి మంచిదని కూడా అనుకుంటూ వుంటారు. దేవుని దయవలన నయమవుతే అదే పదివేలు." అన్నారు. ఆప్యాయత వుట్టిపడేలా వెంకటరత్నంగారు.

వెంకటస్వామి కాఫీలు తీసికొని రావటం, యిద్దరూ త్రాగటం పూర్తి అయిన తరువాత, వెంకటరత్నంగారు వెళ్ళే ప్రయత్నంలో లేస్తూ "వెళ్ళొస్తానండి. నేనేదైనా చెయ్యగలిగింది వుంటే నాకు ఫోన్ చెయ్యండి" అన్నారు. మర్యాదగా ఆయనను సాగనంపేందుకు గోపాలంగారు లేచి తలుపు వరకు వెళ్ళారు, వెంకటరత్నంగారు వెనుదిరిగి.

"మరో చిన్నపనుండి గూడ వచ్చాను. మా బావమరిది వెంకటేశ్వర్లు మీకు తెలుసనుకుంటాను. యిక్కడే ట్రాఫిక్ ఇన్స్‌పెక్టరుగా పని చేస్తున్నాడు." అని అంతటితో ఆపాడు.

"పెద్ద పరిచయం లేదుగాని, ఒకటిరెండు సార్లు నా వద్దకు వచ్చారాయన."

"ఇంకో రెణ్ణెల్లలో యిక్కడే చీఫ్ ట్రాఫిక్ ఇన్స్‌పెక్టర్పు పోస్టు ఖాళీ అవుతుంది. ఇప్పుడున్న జార్జిగారు రిటైరవుతున్నారట. మావాడు సీనియర్‌మోస్టు అయినా వాడికి పనిష్మెంటు యింకా మూడునెలల పాటు వుంది మీకు తెలియందేముంది! పనిష్మెంటు పీరియడు ప్రమోషనుకు పనికి రాదాయెను. ఏదో విధంగా చూసి ఆ పనిష్మెంటును తీసేసే ఏర్పాటు చెయ్యాలి. అది మీచేతులలోనే వుంది. అయితే వస్తానండీ. అప్పుడప్పుడు క్లబ్బుకు వస్తూండండి" అని కరచాలనం కొరకు చెయ్యి చాపారు.

గోపాలంగారికి వెంకటరత్నంగారి ప్రవర్తన చూసేసరికి అసహ్యము, కోపము వచ్చింది. ఆయన వద్ద ఎందుకు అప్పు పుచ్చుకున్నానా అనిపించింది. చిన్న అప్పు అడగబట్టే గదా ఆయన యీ పూట యింత ధైర్యంగా తన బావమరిదికి ఏదో చేసిపెట్టమని అడిగాడు. ఆ బావమరిది ఎంతటి ఘటుడో అందరికీ తెలిసిందే. లంచాలు తిన్నందుకు, అవకతవక చేసినందుకు, ఉద్యోగం వూడాల్సింది పోయి, అతికష్టం మీద ఏనాడన్నా యింక్రిమెంటు లేకుండా చేశారు. అందరూ చెప్పుకోవటం మాత్రం అతనికేదో పెద్ద అండ వుందని. అలా వుండబట్టే యింకా ఆ వుద్యోగం నిలిచిందని కూడా అంటారు. అలాంటి వాడికా సాయం చెయ్యడం. ఏవిధంగా నయినాసరే వెంకటరత్నాన్ని ఎంత తొందరగా వదిలించుకుంటే అంత మంచిది. బుద్ధి తక్కువై కొరివితో తల గోక్కున్నానే అని బాధపడ్డారు.

కొన్నినెలలు యిలాగే గడచినయ్. గోపాలంగారు తాను ఎంత పొదుపు చేద్దామని ప్రయత్నిస్తున్నా ఏదో సంసారంలో అవసరాలు ఎక్కువై, అప్పు చేసేటట్టు చేస్తున్నయ్ గోపాలంగారిని. పైకి హుషారుగా వున్నా లోలోన యీ అప్పులన్నీ తను ఎప్పటికి తీర్చగలనా అని భయపడుతూనే వున్నారు. పోనీ భార్య ఏదైనా దుబారా చేస్తున్నదంటే పాపం ఎంతో కష్టపడి యిచ్చిన దాంట్లోనే దాచి అవసర మొచ్చినప్పుడు సర్దుకుంటుంది.

ఒకనాటి సాయంత్రం ఏమి తోచకపోవటం వలన క్లబ్బుకు వెళ్ళి వరండాలోనే కూర్చుని ఆంధ్రసచిత్ర వారపత్రిక చదువుదామని తెరచారు. లోపలి హాలులో నుండి మాటలు వినిపిస్తున్నయ్. ఆ మాటల మధ్యలో తన పేరు వినిపించేసరికి గోపాలంగారికి కొంత కుతూహలం కలిగి ఆ మాటలు వినసాగారు.

"నేను అప్పుడే అనుకున్నా! ఏదో అప్పుకే వచ్చి వుంటాడని" అని నవ్వు మిళితమైన గొంతుతో వెంకటరత్నంగారి మాటలు వినిపించాయి.

"ఆయన అప్పుకేం రాలేదండీ! ఆయనకే నేను ఓ వందరూపాయల వరకు యివ్వాలి. అప్పుడే అయిదారు నెలలు గాటింది. ఎప్పటికప్పుడు యిద్దామను కుంటూనే ఆలస్యం చేశాను. పాపం ఆయన ఇంత వరకు ఒక్క సారి గూడా దాని విషయం అడగలేదు.

(64 వ పేజీ చూడండి)



సీరియల్

# రామశాస్త్రి

వి.ఎస్.సుక్తాంకర్

## 6

(జరిగిన కథ:—రామ్‌ప్రభుణె బీద కుటుంబంలో జన్మించటంచేత చిన్న వయసులో విద్యాభ్యాసానికి నోచుకోలేకపోతాడు. కాని, పద్దెనిమిదేళ్ళ తర్వాత చదువుమీద ఆసక్తి అధికం అయి పని వదులుకుని కాశీకి వెళ్ళి బాగా చదువుకొనటమేకాక 'శాస్త్రి' బిరుదుకూడా సంపాదించుకుంటాడు. అతను ఇంటికి వచ్చే సమయానికి తల్లి రాధాబాయి మరణశయ్య మీద ఉంటుంది. కొడుకు చేతుల్లో సంతృప్తితో మరణిస్తుంది. రామ్‌శాస్త్రి పాండిత్యం అతనిని మరాఠా సామ్రాజ్యం ప్రధాన న్యాయమూర్తిని చేస్తుంది. అతను ఈ పదవిలో ఉండగా చించ్‌వాడ్ అనే చిన్న గ్రామంలో శ్యామా అనే బానిస పిల్లకీ చంఫాజీ అనే గాయకుడికీ మధ్య ప్రేమ ఏర్పడుతుంది. ఇది గమనించిన ఆమె యజమానురాలు శ్యామా పారిపోతుందని భయపడి ఆమెని పూనాలో అమ్మివేయవలసిందిగా భర్తకి నచ్చచెపుతుంది.)

"అన్నలారా వినండి! వినండి! ఇదిగో ఈ రత్నంలాంటి బానిసపిల్లని చూడండి! చాలామంచి బేరం! ఈ అమ్మాయిని కొనుక్కున్నవారికి నిధి దొరికినట్లే—జీవితాంతం అదృష్టంఅనుభవిస్తారు".

సోమవారం పూనాబజారులో జరిగే సంతలో మోర్‌భట్ శ్యామాని అమ్మకానికి పెట్టాడు. ఒక మామిడితోపుమధ్య జరిగే ఈ సంతలో ఒక చెట్టునీడకింద చాపవేసుకుని కూర్చుని పక్కనే మంచువిఉన్న శ్యామాని చూడమని, కొనమని అరుస్తున్నాడు. ఆమె దిగాలుపడిపోయి దించిన తల ఎత్తలేకపోయి ఉంది. మామిడితోపు నీడకోసం వచ్చే సోమరులు చాలామంది ఈ వినోదాన్ని చూస్తున్నారు. క్రమంగా అక్కడి గుంపు పెద్దది అవుతూ వచ్చింది. ఇది గమనించిన మోర్‌భట్ ఉత్సాహంగా తాంబూలం నములుతూ, "అన్నలారా, చూశారా ఈ అమ్మాయి అందం! రత్నంలాంటి బానిసపిల్ల—" అని రెట్టించి అరవటం ప్రారంభించాడు. "ఈ బానిసపిల్ల మొహమేకాదు. బుద్ధి కూడా అందమయినదే! ఎంతోమంచి స్వభావం—ఎంతో అణకువ, వినయం! ఇంటిపనులన్నీ బాగా తెలిసిన అమ్మాయి—"

"అయితే మీరెందుకీ నిధిని అమ్మేస్తున్నారండీ!" అని అక్కడే మంచుని ఉన్న ఒక అమాయకుడు అడిగాడు.

"ఏం చెప్పమంటావుబాబూ, అంతా నాకర్మ! నా కసలు బుద్ధిలేదు కాని, నాలాంటి పేద బ్రాహ్మడు బానిసల్ని పోషించగలడా అంట? నాలుగేళ్ళక్రితం నా పాండిత్యాన్ని మెచ్చి మన పీష్వాసాహెబ్‌వారే ఈ పిల్లని యజ్ఞంలో దాసీ దానంగా ఇప్పించారు! అప్పటినుంచీ ఈ అమ్మాయిని పువ్వుల్లోపెట్టి పోషించామనుకోండి......" అని సమాధానం ఇచ్చాడు మోర్‌భట్. ఈ రకం ప్రశ్నని ఎదురుచూసినవాడే కాబట్టి. "కాని, రోజులు ఎప్పుడూ ఒకలాగే ఉండవుకదా! నే నొక అప్పుల వాడి చేత బడ్డాను. రుణం తీర్చుకోవటానికి ఈ రత్నాన్ని అమ్మేస్తున్నాను.. .ఈ సంగతి విన్న నా భార్య మూర్ఛపోయినంత పని చేసిందంటే నమ్మండి! పొద్దున్నుంచి ఏడుస్తూనే ఉంది పాపం......"

మోర్‌భట్ వర్ణించిన ఈ జాలిగాథ, శ్యామా అందం అక్కడ గుంపుని మరింత పెద్దదిచేశాయి. శ్యామాకిమాత్రం ఇదంతా దుర్భరం అనిపించింది. చంఫాజీని తలుచుకొనగానే నక్షత్రాలవంటి ఆమె కళ్ళు చమర్చాయి.

"భగవంతుడా! నా ప్రార్థనలు నీకు వినిపించి ఉండవు. నేను పంపిన పావురం సురక్షితంగా చంఫాజీకి చేర్చమని వేడుకున్నాను. నా సందేశం అతనికి కనుక అందేవుంటే ఈపాటికి గుర్రమెక్కి ఇక్కడికి వచ్చేసిఉండడూ? ఇంకా ఎందుకురాలేదో! నా నుదిటిరాత ఎలా ఉందోకదా....." అని లోలోపలే కుమిలిపోయింది. ఈ బాధకితోడు కొందరు ఆమెని కొనటానికి ఉద్యుక్తులవటం మొదలుపెట్టారు.

"అయితే ధర ఏమాత్రం?" అని అడిగాడు ఒక రయితు.

"బాబూ నేనేం పెద్ద షావుకారినా వ్యాపారం చెయ్యటానికీ, బేరం చెయ్యటానికీ? మోసం అనేది నాకు చాలా దూరం— పది మొహర్లు ఇప్పించండి చాలు—" అన్నాడు మోర్‌భట్ కొంచెం నిర్లక్ష్యంగానే.

ఈ వెలని విన్న మోతుబరి రయితు అదిరిపోయాడు. "ఇదేమి టీ వింత! ఆడపిల్లకి పది మొహర్లా? పానిపట్ ముందు రోజుల్లోకూడా ఇంతలేదే! మూడిస్తాను ఇచ్చేసెయ్!" అన్నాడు.

ఇంతలో ఒక కువిందుడు ముందుకు వచ్చి, నాలుగు మొహర్లు పాడాడు. మోర్‌భట్ ఇద్దరికీ తల అడ్డంగా ఆడించాడు.

"బాపనయ్యా, ఈ మోతుబరి చెప్పింది నిజమే. రోజులు బాగా లేవు. మూడు మొహర్లు మంచి వెల! కాని, నాకు ఈ పిల్లనిచూస్తే సద్భావం కలుగుతోంది. అయిదు మొహర్లిస్తాను, తీసుకో!" అని ముందుకి వచ్చాడు ఒక అంగడి పెట్టుకున్న వ్యక్తి.

మోర్‌భట్ విరగబడినవ్వాడు. తర్వాత సావధానంగా తమలపాకు చిలక చుట్టుకుని, వక్కపొడితో నములుతూ, "బాబూ చెప్తున్నా విను! ఈ పిల్లని పొలం చేసుకునే వారూ, బట్టలునేసే వారూ, అంగడి పెట్టుకునేవారూ కొనుక్కోగలరా ఏమిటి? ఎవరో మహారాజా ఇంట్లోనో, అంతఃపురంలోనో వెలిగిపోవలసిన కన్యా రత్నం!" అన్నాడు.

"ఈ బ్రాహ్మడు చాలా గడసరి!" "ముసలి నక్కేననుకో!" "ఎంత దురాశ!" అనే మాటలు వినిపించాయి అక్కడివారు మోర్‌భట్ జవాబు విన్న తర్వాత. అదే సమయంలో ఇద్దరు అశ్వికులు అటు రావటంతో ఈ హడావుడి కొంత తగ్గింది.

"టోపీవాలె సాహెబ్‌లకి వందనాలు!"

"బొంబయికర్ సాహెబ్‌లకీ జయ్!"

"కంపెనీవాలె సాహెబ్‌లకి స్వాగతం!" అని కొందరు వారిని ఆహ్వానించారు. (టోపీవాలా, బొంబయికర్, కంపెనీవాలె— ఈ పదాలన్నీ ఆ కాలంలో ఇంగ్లీషువారిని వర్ణించేందుకు వాడేపేర్లు—రచయిత.) ఇలా ఆహ్వానించిన వారంతా 'తెల్ల దొర'లతో మంచి బేరం కుదుర్చు కొనవచ్చునని ఆశించే వ్యాపారులే.

గుర్రాలమీద సపరివారంతో వచ్చిన ఆ ఇద్దరి పేర్లూ, 'మిస్టర్ మోస్టిన్, మిస్టర్ ప్రయిస్.' ప్రయిస్‌కి ఏదీకొనాలని లేకపోయినా మోస్టిన్‌చెప్పటం వల్ల కొన్ని తివాసీలూ, ఒక హుక్కా, పన్నీరుబుడ్డీ, ఇంకా ఇతర చిల్లర వస్తువులూ కొన్నాడు. 'ఇవి చాలు'నని వెళ్ళిపోబోతున్న అతనితో మోస్టిన్, "సర్! మీరు దేశం వస్తువులని ఎన్నికొన్నారు. మీరేమీ అనుకోకుండావుంటే మరో అందమయిన వస్తువుని చూపిస్తాను. మన బొంబాయి ఆస్థానానికి బాగా ఉంటుంది......." అన్నాడు కొంచెం బెరుకుగా. ప్రయిస్ మోస్టిన్‌కన్నా 'సీనియర్' అధికారి.

"ఏమిటది?" అని అడిగాడు.

"ఒక బానిసపిల్ల సర్! అదుగో ఆ చెట్టుకింద ఉన్నమ్మాయి! అంత ఖరీదు కూడా చెయ్యదు. పానిపట్ యుద్ధం తర్వాత మరాఠా దేశంలో బానిసల వెలలు బాగా పడిపోయాయిట. ఇండియాలో ఇంకెక్కడా ఇంత చవకగా దొరకదుట—" అన్నాడు మోస్టిన్.

"బానిసపిల్లని మనమేమి చేసు కుంటాము మోస్టిన్? మనదేమన్నా దేశియ ప్రభుత్వమా, బానిసలని కొనుక్కొనటానికి? మనదొక కంపెనీ తెలుసా?"

మోస్టిన్‌కి ప్రయిస్ అంటే భయం లేకపోలేదు. కాని ఎందుకో శ్యామామీద బాగా మోజు పడటంతో అంతటితో వదలలేదు.

"క్షమించండి, సర్!.....ఇంతకీ నేను చెప్ప వచ్చేది......ఈ దేశంలో ఉన్నప్పుడు ఇక్కడి పద్ధతులు అలవాటు చేసుకొనటం మంచిదికదా......ఇండియన్లుకూడా మనల్ని మరింత ఆదరిస్తారు....బానిసపిల్ల ఉండటం ఈ దేశంలో గొప్ప......" అని వాదించాడు.

మోస్టిన్ పట్టుదల ప్రయిస్‌కి ఆశ్చర్యం కలిగించింది. ఇంతగా అతన్ని ఆకర్షించిన బానిసపిల్ల ఎవరా అని శ్యామా ఉన్నవైపు పరిశీలనగాచూశాడు.

"మోస్టిన్ నీకు మతిపోతోంది! కాని నీ సరదా తీర్చుకో......అమ్మాయి నిజంగా అందంగాఉంది.....మన కార్యాలయంలో ఉంచినా కంటికి నదురుగా

కనిపిస్తుంది—సరే, బేరం కుదుర్చు!" అన్నాడు చిరునవ్వుతో.

అతని మాటల్లోని వేళాకోళానికి మోస్టిన్ కొంచెం సిగ్గుపడినా, గుర్రాన్ని మోర్‌భట్ కూర్చుని ఉన్న చెట్టువైపుకి తీసుకువెళ్ళి, మరాఠీలో, "ఈ అమ్మాయి వెల ఎంత?" అని అడిగాడు.

అతని ప్రశ్న వినగానే శ్యామా ఒక్క అరుపు అరిచి, కుప్పగా కూలిపోయింది.

"అయ్యో భగవంతుడా! నన్నొక 'యవను' డికా అమ్మేస్తున్నారు! నా మతమే మార్చేస్తారే! అమ్మా, అమ్మా! నన్ను కన్నప్పుడే నా 'మెడలో నీ గోళ్ళుగుచ్చి చంపెయ్యక' పోయావా?" (ఇది మహారాష్ట్ర భాషలో వాడే పదజాలం—ర.) అని వెక్కి వెక్కి ఏడిచింది.

మోర్‌భట్‌మాత్రం మంచి బేరం దొరికిందని సంతోషించాడు. "సాహెబ్! తెల్లదొరలకి బేరం అంటే ఇష్టంలేదని నాకు తెలుసు! అందుకనే ఒకే ధర చెప్పేస్తున్నాను. 15 మొహర్లు ఇచ్చి ఈ పిల్లని తీసుకువెళ్ళిపొండి!" అన్నాడు.

మోస్టిన్‌కి ఈ ధర సరసంగానే తోచింది కాని ఎందుకయినా మంచిదని బేరం ప్రారంభించాడు. ఇంతలో అక్కడ ఒక చిన్న అలజడి బయలుదేరింది. ఒక బ్రాహ్మణుడు హైందవ బాలికను మ్లేచ్ఛుడికి అమ్మటం చాలా దోషం అన్నారు కొందరు. కాని మోర్‌భట్ వారిని లెక్కచెయ్యలేదు.

"చదువుకున్న బ్రాహ్మడిని. శాస్త్రాలని గురించీ, తప్పొప్పులని గురించీ నా కెక్కువ తెలుసా, మీకా? సముద్రంలాంటి మన మతానికి ఒక చుక్కపోతే పెద్ద నష్టం కలిగించదులెండి!" అని బిరుసుగా సమాధానం ఇచ్చాడు.

వీరి కలహం ముదరవచ్చునని మోస్టిన్ అవస రవసరంగా 15 మొహర్లు తీసి మోర్‌భట్‌కి ఇచ్చాడు. శ్యామా పూర్తిగా కుంగిపోయింది. ఆమె కన్నీరు ధారలుగా ప్రవహించసాగింది. చుట్టు పక్కల వారు ఆమెని ఓదార్చపోయారు. ఆ సమయంలో ఒక చిన్న, తెల్లటి పావురం ఎగిరివచ్చి రెక్కలు రెపరెప లాడిస్తూ, శ్యామా భుజంమీద వాలింది. వాలినదే తడవుగా ముక్కుతో మృదువుగా ఆమె బుగ్గమీద పొడవటం మొదలుపెట్టింది. శ్యామాకి కొత్త ప్రాణం పోసినట్లయింది! అమాంతంగా లేచి మంచుని పావురాన్ని గుండెలకి పొదువుకుంది. ఎవరిది పావురం, అని ఆశ్చర్యపోతున్న అక్కడివారు మరొక వింత దృశ్యాన్ని చూశారు. అశ్వారూఢుడయిన ఒక యువ కుడు అతివేగంగా అక్కడికి వచ్చాడు.

"శ్యామా!" అనే అరుపుతో గుర్రంమీదనుంచి నేలమీదకి దూకాడు.

శ్యామా చిన్న కేకవేసి అతని చేతుల్లో వాలింది. "చంఫాజీ—నన్ని దారుణ ప్రమాదంనుంచి కాపాడు! మతాన్ని వదులుకుని భ్రష్టురాలనయి పోకుండా రక్షించు!" అన్నది వెక్కిళ్ళమధ్య. "నన్ని టోపీ వాలా సర్దార్‌కి అమ్మేస్తారుట!"

చంఫాజీ మొహం కోపంతో ఎర్రబడింది. మోర్‌భట్‌వంకా, మోస్టిన్‌వంకా ఉరిమి చూశాడు. ఇక పట్టలేక ఒరలోని కత్తిని కొంచెం బయటికి లాగాడు.

మోర్‌భట్ హడలిపోయాడు. వెనక్కి తగ్గి పోయి—"అయ్యయ్యో, వీడు గజదొంగ! శిలేదార్ అని పేరేగాని పిల్లల్నెత్తుకుపోయేరకం! బాబూ, ఈ పిల్లని వెనక్కిలాక్కుపోయారా మన కింక దక్కదు. చూడండి సిగ్గు లేకుండా ఇందరి మధ్య వాడి నెలా వాటేసుకుందో!" అని అరవటం ప్రారంభించాడు. ('శిలేదార్', అంటే స్వంత గుర్రం కల అశ్వ దళ సైనికుడు. అవసరం వచ్చినప్పుడు మాత్రమే ప్రభుత్వం ఇటువంటి వారిని ఉద్యోగంలోకి పిలు స్తుంది —రచయిత.) "ఈ టోపీవాలా సాహెబ్ వారి సొత్తుని దోచేందుకు వీడి కెన్ని గుండెలు?"

మోస్టిన్‌కి కూడా కోపం వచ్చేసింది. శ్యామాని విడిపించమని తన పరివారానికి ఆజ్ఞ ఇచ్చాడు.

చంఫాజీ వారినిచూసి బెదరలేదు. ఒరలోని కత్తిని పూర్తిగా బయటికిలాగి, "జాగ్రత్త! ముందుకి వచ్చినవాడి తలనరికి పారేస్తాను!" అని గర్జించాడు.

మోస్టిన్ పరివారం కచేరీ జనం. వారికి యుద్ధం అలవాటులేదు. చంఫాజీ మాటలకి జడిసి ఇక ముందడుగు వెయ్యలేక ఆగిపోయారు. కాని మోస్టిన్‌కి రోషం వచ్చింది. గుర్రాన్ని ముందుకి నెట్టాడు.

"ఇదుగో శిలేదార్! అమ్మాయిని వదిలారా సరే

(64 వ పేజీ చూడండి)






ఈ కథను తల్చుకున్నప్పుడల్లా నా గుండె నీరయి పోతుంది. ఒక నిండు ప్రాణం బలి అవటానికి నేనే కారణమేమో అనిపిస్తుంది. అందుకే కనిపించిన నా మిత్రులందరికీ ఈ కథను చెప్పి, ఇందులో నా పాపమేదయినా వుందా అని ఆదుర్దాగా అడిగాను. వాళ్లేవో సమాధానాలు చెప్పారు. కాని నాకు తృప్తి లేదు. మీకూ ఆ కథ చెప్తాను. మీరయినా నన్ను తృప్తి పరిచే సమాధానమిస్తారేమో చూస్తాను—

అసలీ కథ మావూళ్లో జరిగింది. అవి నేను మద్రాసులో మా మామగారితో కలిసి వ్యాపారం చేస్తున్న రోజులు. వ్యాపారంలో ప్రతి యేటా మంచి లాభాలు తీస్తున్నాను. కాని నాకు సుఖంలేదు. నా భార్యకు ఏదో జబ్బు. ఎన్నిరకాల వైద్యాలు చేయిస్తున్నా నయం లేదు. ఒక డాక్టరు కొన్నాళ్లపాటు గాలి మార్పు కావాలన్నాడు. అందుకని నా భార్యని తీసుకొని మా వూరు వెళ్లాను. మా వూరు విజయవాడకు దగ్గర్లో వున్న ఒక పల్లెటూరు. అక్కడ మా అమ్మ ఉంది. మా అమ్మని చూసినట్లుగా వుంటుందని బయలు దేరాను. మా వూరెళ్ళటానికి ఇంకో కారణం వుంది. విజయవాడలో మా బ్రాంచి ఒకటి తెరవాలను కుంటున్నాం. ఆ పరిసర ప్రాంతాల్లోని మార్కెట్‌ను స్టడీ చేసి విజయవాడ మా వ్యాపారాని కనుకూలంగా వుంటుందో, లేదో చూడటం కూడ ఒక కారణం.

మా వూళ్లో నా బాల్యమిత్రుడు రంగారావు కలిశాడు. వాడు చాలా సరదా మనిషి. అందుకే మాకు స్నేహం కల్సిందేమో. నేను చదువాపేసిన తర్వాత నా పెళ్లయి మద్రాసు తరలివెళ్లేవరకు మావూళ్లోనే వున్నాను. అప్పట్లో రంగారావు, నేను కలిసి స్టైలా పచ్చీసుగా తిర్గాం. ఇప్పుడు రంగారావు మావూళ్లో కొంత భూములు చూచుకుంటున్నాడు.

నేనా వూళ్లో వుండగా రంగారావు ద్వారా పరిచయమైన వ్యక్తి శ్రీరంగం మాస్టారు. మావూరి ఎలిమెంటరీ స్కూలులో టీచరుగా చేస్తూ వున్నాడు. మనిషి ఎర్రగా, అందంగా చూడ్డానికి ఆడపిల్లలాగా వుంటాడు. నాటకాల్లో వేషాలు వేస్తుంటాడు. అంతే. స్కూలు వదిలిన తర్వాత మా వూళ్లో ఒక నాటక సమాజాన్ని స్థాపించాడు. అందులో మావూళ్లోని యువకులు చాలా మంది చేరారు. మా రంగారావు ఈ సమాజానికి కార్యదర్శి. వీళ్లు పొరుగూళ్ళకెళ్లి నాలుగయిదు ప్రదర్శనలిచ్చి పెద్దల ప్రశంసలు పొందారు కూడా.

— ఇదంతా ఈ కథకు ఉపోద్ఘాతం మాత్రమే! అసలయిన కథ నేనూ, రంగారావు నా కార్లో విజయవాడ నుండి తిరిగి వస్తున్న పున్నమరాత్రి మొదలవుతుంది. ఒక సాయంత్రం నాకు పనివుండి నా కార్లో విజయవాడ వెళ్తూ రంగారావుని కూడ వెంట తీసుకువెళ్లాను.

విజయవాడలో నా పని పూర్తయి మరల మా వూరికి మేం బయలు దేరేసరికి రాత్రి పన్నెండు గంటలు దాటింది. పని అంటే పెద్ద పనేమీకాదు. అక్కడ నాకొక మిత్రుడున్నాడు. వాడ్ని కలిశాం. వాడు మాకు డిన్నరిచ్చాడు. పసందైన పదునుసు, మేలిరకం సారీయాల్ను తెప్పించాడు. రంగడు రెండో దాన్ని, నేను రెండిట్నీ ఖాళీ చేశాం.

మత్తుగా తీయగా వెచ్చగా కాళ్లో కూర్చుని మెత్తగా కారుని డ్రైవ్ చేసుకుంటూ మావూరి దారి పట్టాం.

పున్నమి వెన్నెల, అరగంట క్రితం నావళ్లో కూర్చుని నాకు యాపిల్ ముక్కలు తినిపించిన చిన్నది కట్టుకున్న చీరలాగా తెల్లగా వుంది.

నేను సిగిరెట్టు మీద సిగిరెట్టు కాలుస్తూ ఖుషీరుగా ఏదేదో మాట్లాడేస్తూ రయ్‌న డ్రైవ్ చేస్తున్నాను. జాగ్రత్తగా తోలరా బాబు (వాడు 'తోలరా' అనే అన్నాడు!) అంటూ రంగడు మధ్య మధ్యలో గొడవ జేస్తున్నాడు. వాడి భయానికి నాకు నవ్వు వచ్చింది. అనవసరంగా వాడ్ని కంగారుపెట్టట మెందుకని మెల్లగా డ్రైవ్ చెయ్యటం మొదలు పెట్టాను.

పున్నమి చంద్రుడు విసిరిన వెన్నెల వలల్లో చిక్కుకొని కదలక మెదలక నిశబ్దంగా వున్న ఆ సుందర ప్రకృతిలో, తీయటి మత్తులో వెచ్చగా కారు నడుపుకుంటూ ఎన్నివందల మైళ్లయినా అలా పోవాలని పిస్తుంది నాకు. కాని మావూరు దగ్గర పడింది. 18 మైళ్ల దూరాన్ని ఎంత నెమ్మదిగా పోయినా ఎంతసేపు పోతాం? అదిగో ఆ గట్టు మలుపు దాటితే మావూరు. ఆ గట్టు పేరు భోగం దాని గట్టు. ఎవరో జమీందారు ఆ గట్టుమీద ఒక భోగం దాని కొరకు బంగళా కట్టించి అందులో దాన్ని వుంచారట. అందుకే ఆ గట్టుకు ఆ పేరు వచ్చివుండాలి. ఆ బంగళా ఇప్పుడు పూర్తిగా శిథిలమైపోయింది.

ఆ గట్టు ఇంకా నాల్గు మైళ్ల దూరంలో వుంది. అనగానే రంగారావులో ఏదో సంచలనం మొదలయింది. ఇవాళ పౌర్ణం కదరా అని అడిగాడు. అవున్రా అని అన్నాను. అంతే! వాడు నా దగ్గరికి జరిగాడు నన్ను ఆనుకుంటూ కూర్చున్నాడు. మాటి మాటికి ముందుకు నిక్కి నిక్కి చూస్తున్నాడు. 'నన్ను కరుచుకుంటున్నావ్ చలిగా వుందా ఏమిటి' అని అడిగితే— కాదులే పోనీయరా బాబు అంటున్నాడు. తన వాచీలో టైం చూచుకున్నాడు. 'పంటిగంట అయిందిరా' అన్నాడు. 'మీనాన్న తంతాడని భయమా ఏమిట్రా' అని అడిగితే 'ఛా పోరా' అన్నాడు.

వాడు కర్చీఫ్ తీసి మొహం తుడుచుకున్నాడు.
"అరె బ్రదర్, కారు కాస్త జోరుగా పదరా!"— అన్నాడు.

"ఇప్పుడే కదరా మెల్లగా తోలరా అన్నావు. ఇప్పుడు మళ్లీ జోరు అంటున్నావు. అసలు సంగతేమిటి? ఇపుడు నీకు 'కిక్' యిచ్చిందా?" అని అడిగా ఇంకా స్లో చేస్తూ.

"పరాచికాలు కాదు. నీవు స్పీడ్ ఎక్కించు. నేను తర్వాత చెప్పుతాను. నా మాట విను—" అని ప్రాధేయ పడటం మొదలు పెట్టాడు.

వాడి పద్ధతి నాకేమి అర్థం కాలేదు. వున్నంత సేపు వుండి ఈ ఆరు మైళ్ల దూరం వెళ్లేలోపల ఏం కొంపలు మునిగి పోతాయని? అంత అతివేగంగా యింటి కెళ్లి ఇంత అర్ధరాత్రి వీడెలగ పెట్టవల్సిన రాచ కార్యాలేమిటి? నాకేమి అర్థం కాలేదు. అయినా వాడంత తొందర జేస్తున్నాడు కదా అని నేను స్పీడు రైజ్ చేశాను.

"మనం వూళ్లోకి వెళ్లేదాక ఎట్టి పరిస్థితిలోనూ నీవు మాత్రం కారు ఆపవద్దు—" రంగారావు హెచ్చరిక! వాడి వంక వింతగా చూశాను. వాడు మాత్రం రోడ్డు వంక చూస్తూ కూర్చున్నాడు.

వాడు నా భుజాన్ని గట్టిగా పట్టుకున్నాడు. మనిషి కాస్త వణుకు తున్నట్లని పించింది.

"అదిగో అటు చూడు—" బావి లోంచి మాటాడుతూ వున్నట్లుగా వుంది వాడి గొంతు.

అటే చూస్తున్నాను. ఏముంది? నల్లటి తారు రోడ్డు. ఒక వంతెన. వంతెన కటూ ఇటూ పెద్ద పెద్ద మర్రిచెట్లు. మరేవో చెట్లు. కంప. చీకటి నీడలు. చనిపోయిన ఏనుగు రోడ్డు కడ్డంగా పండుకున్నట్లుగా భోగం దాని గట్టు మలుపు తిరుగుతుంది....... ఆ — ఇంతలో వంతెన ప్రక్కనుండి ఒకఆకారం— ఒక స్త్రీ— వచ్చింది. కారు ముందు వెళ్లుతుంది. ఆ స్త్రీ దగ్గరవుతుంది. ఆమె, కారు ఆపమన్నటు చేయి వూపుతుంది........

నేను బ్రేక్‌మీద కాలు వేయబోయాను. రంగారావు నా భుజాన్ని తన గుప్పిలిలో బిగించి పిసేస్తున్నాడు.

"వద్దు, ఆపవద్దు. ఇంకా స్పీడెక్కించు— ఆపకు— డేంజర్— నా మాట విను— ఆపకు ఆపకు—" భయంతో గజగజ వణుకుతూ కంగారుగా అంటున్నాడు రంగారావు.

ఆ స్త్రీకి మాకు మధ్యన అర ఫర్లాంగు దూరముంటుంది. కారు హెడ్‌లైట్లకాంతి ఆ స్త్రీ ఆకారం మీద ఫోకస్ అవుతున్నది. ఆ ఆకారం స్పష్టంగా కనిపిస్తోంది. తెల్ల చీర, రవికా. నల్లటి జారు జడ పిరుదులను దాటుతుంది. తలనిండా మల్లెపూలో, మరే పూలో తెల్లగా మెరుస్తున్నాయి. 19, 20 ఏళ్ళ కంటే ఎక్కువ వయస్సు వుండదు. పొంకమైన వంటి బిగితో మాంచి వయస్సులో వున్న పడుచుపిల్ల. కారాపమని చేయి వూపుతుంది. కారాపి ఆ పిల్లను కారులో కూర్చో బెట్టుకొని ఎక్కడికయినా తీసికొని పోవచ్చు. కాని నా పక్కన ఈ శనిగాడొకడు. భయంతో వణికి చస్తున్నాడు. ఆపవద్దు ఆపవద్దని వూరికే పతాయింపు— అసలెందు కాపమంటుందో ఏమో—

...... కొన్ని గజాలు మాత్రం మిగిలాయి. వీడికి కుండపోతగా చెమట కారుతుంది— వణి జ్వరం వచ్చిన వాడిలాగా గజగజ వణుకుతున్నాడు.

ఆ పిల్ల తీయటి గొంతుకతో, 'నన్ను కారు ఎక్కించు కోరూ?' అని అంటూ చేయి వూపుతుంది.

నా కాలు బ్రేక్‌మీద పడపోవటం రంగారావు కనిపెట్టి, 'దెయ్యంరా బాబూ—' అని అరచి కళ్లు గట్టిగా మూసుకున్నాడు. కారు ఆమెని దూసుకుని దాటి ముందు కెళ్లింది.

వెనక పకపకా నవ్వు— ఆ నిశ్శబ్ద వాతావరణంలో అనుకోకుండా అలాటి వికృతపు నవ్వు వినగానే నా గుండె ఆగిపోయినట్లనిపించింది.

కారు గట్టు మలుపు తిరగబోతుండగా వెనక్కి తిరిగి చూశాను. రోడ్డుమీద ఎవరూ కనిపించలేదు. మెరికలు తిరిగిన నల్లటి తారు రోడ్డు వెక్కిరించి నట్లనిపించింది. ఆ స్త్రీ ఏమయింది? ఎక్కడికి పోయింది? మాయమయి పోయిందా? ఇదెలా సాధ్యం? కలా, మాయా?

*　　*　　*

రంగారావు యింటి దగ్గర్లోవున్న రామమందిరం ముందు కారాపాను. అప్పటికి రంగారావు కాస్త స్థిమిత పడినట్లున్నాడు. తాపీగా సిగిరెట్టు తీసి వెలిగించాడు. వాడయితే స్థిమిత పడ్డాడుగాని, నాలో పెద్ద సంచలనం రేగింది ఈ సంఘటన మూలంగా.

ఏమిట్రా సంగతి అని వాడ్ని అడిగితే వెంటనే చెప్పి చావడే? రేపు మాటాడుకుందాం లేరా అంటాడు. ఈ మిస్టరీ తెల్సుకోకుండా వెళితే ఈ రాత్రికి ఇక నాకన్ను మూత పడుతుందా? కాదు ఇప్పుడే చెప్పాలని పట్టు పట్టితే ఎట్టకేలకు నిక్కుతూ నీల్గుతూ సస్పెన్స్, టెంపో ఇత్యాదివి మెయిన్‌టెయిన్ చేస్తూ వాడు చెప్పింది ఇది:

ఆ స్త్రీ మానవాంగన కాదు. ఒక దెయ్యం. శ్రీరంగం మేష్టారి భార్య. ఆమె చనిపోయి ఇలా దెయ్యమయింది. ఆమె అసమాన్యమైన సౌందర్యవతి. ఆమె అంటే ఆయనికి ప్రాణం. ఆయనే ఆమె ప్రాణం! వాళ్ళ ఈ వూరొచ్చిన నాల్గు నెలలకి ఒకసారి ఆమె తన పుట్టింటికి వెళ్లింది. అలా వెళ్లి నామె మళ్లీ తిరిగిరాలేదు. అక్కడ అకస్మాత్తుగా పెద్ద జబ్బు పడింది. ఈయనికి కబురందింది శలవు పెట్టి వెళ్లేసరికి ఆమె ఈలోకం నుండి తప్పుకుంది. జబ్బులో ఆమెకు సంధి పుట్టింది. ఆ సంధిలో భర్త కోసం విపరీతంగా పలవరించి, పలవరించి చనిపోయింది. భర్తకోసం అపరిమితమైన ప్రేమతో కొట్టుకులాడిపోయిన ఆమె జీవుడు చనిపోయిన తర్వాత ఇలా దెయ్యమయింది. ఆమె నిండు పున్నమి రోజున చనిపోయింది. ప్రతి పున్నమికీ ఆమె ఆ గట్టు అవతలవున్న వూడలమర్రి దగ్గర రాత్రి పన్నెండు దాటిన తర్వాత అలా కనిపిస్తుంది. ఆ రోడ్డున వచ్చే పోయే లారీలను, చిన్న కార్లను, "నన్నెక్కించుకోవూ—" అంటూ ఆపుతుంది. ఈ వుదంతం తెల్సిన వాళ్లెవరూ ఆపరు. ఆపలక్కడికి వచ్చేసరికి ప్రాణాలు బిగపట్టుకొని అరవై మైళ్ల స్పీడులో పోతారు. తెలియని వాళ్ళ ఎవరైనా ఆపితే కారు ఎక్కకుండా ప్రక్కనున్న వూడల మర్రి ఎక్కి కూర్చుంటుంది. మళ్లీ సైకిలు వాళ్లను, ఎడ్లబండ్ల వాళ్లను ఆపదు. దూరంగా వూరికే కనిపించి ఏవో వికృతపు చేష్టలు చేస్తుంది. లేకపోతే వూరికే ఎక్కిఎక్కి ఏడుస్తూ వుంటుంది. ఒక్క బస్సులను కార్లను లారీలనే ఆపటానికి కారణం వుంది. ఆమె చనిపోయే రోజు సంధిలో మంచం మీదనుండి లేచి బయటి రోడ్డుమీద కొచ్చి "మా వారి దగ్గరికి తీసికెళ్లండి, నన్ను కారెక్కించుకోండి—" అని కేకలు పెట్టుతూ ఏదొక పోయే కార్లను ఆపిందట.

ఇలా సంవత్సరం నుండి జరుగుతుందట. తెల్సిన వాళ్లెవరూ పౌర్ణమి రోజు పన్నెండు దాటిన తర్వాత ఆ రోడ్డునపోరు. తప్పని సరయి పోవల్సి వస్తివా ప్రాణాల్ని గుప్పెట్లో పెట్టుకొని భయం భయంగా పోతారు. ఆ ఆకారం నడిచినంతమేర చుట్టూ రెండు ఫర్లాంగుల దూరంవరకు మొగలిపూలు, మల్లె పూలు, సంపెంగపూలు వాసన కొట్టుతుందట. ఇదీ కథ!

నాకు దెయ్యాల మీద నమ్మకం లేదు. కళ్ళతో చూచిన తర్వాత నమ్మకేంజేస్తాను?

ఈ సంఘటన జరిగిన రెండు మూడు రోజుల తర్వాత శ్రీరంగం మేష్టారి భార్య ఫోటో చూడటం సంభవించింది. నాటకం రిహార్సల్ చూస్తానికి ఒక సారి రంగారావుతో ఆయనింటికి వెళ్లినపుడుచూశాను. నిజంగానే ఆమెది గొప్ప అందం! నేనెంతో మంది గొప్ప అందగత్తెలను చూశాను గాని, ఈమె అందములో ఒక విలక్షణమైన విశిష్టతేదో వుంది. పూర్వపు మహారాజుల అంతఃపురాల్లోని శుద్ధాంత స్త్రీల అందం! రాజ్యాలను కూల్చిన మహాసౌందర్యం! రాజాధి రాజులను పిచ్చెక్కించి బికారులను జేసిన లోకోత్తర సౌందర్యం! ఒక్కసారి చూస్తే జన్మ జన్మాలకు మర్చిపోలేని మనోహర రూపం ఆమెది!

అంత గొప్ప అందగత్తె యిన భార్య చనిపోయినా పిచ్చివాడు కాకుండా ఈ మాష్టారు నాటకాలెలా వేస్తున్నాడా అని పించింది.

ఆ రోజంతా కళ్ళు మూసినా తెరచినా నా మనో యువనిక పయిన ఆ ముగ్ధ మోహన రూపమే సాక్షాత్కరించింది!

*　　*　　*

మావూరు వదలి ఒకవారం రోజుల పాటు మద్రాసు, నెల్లూరు, తెనాలి తిర్గి తిర్గి మళ్లీ ఆ రోజు కార్లో మావూరు బయలుదేరాను. తెనాలి నుండి విజయవాడ వచ్చేసరికి రాత్రి తొమ్మిది అయింది. మళ్లీ మా మిత్రుడ్ని కలసి వాడి ఆతిథ్యం తీసుకొని ఆ రాత్రికే యింటికి బయలుదేరాను.

లక్ష్మీటాకీస్ సెంటర్‌లో రంగారావు కనిపించాడు. వాడ్ని చూచి కారాపాను. నవరంగ్‌లో రెండో ఆట సినిమా చూసి వస్తున్నాడంట. ఆఖరి బస్సు తప్పి పోయేసరికి ఈ రాత్రికి ఇక్కడ ఆగిపోయి సినిమా చూచి ఏదయినా లాడ్జింగులో పండుకుందామను కున్నాడంట. లాడ్జింగులకోసం చూస్తూ నాకు కనిపించాడు. పదరాపోదాం పద కారెక్కు అన్నాను. వాడు వెంటనే కారెక్కటానికి సంకోచించాడు. వాడి గుంజాటన చూచి ఏమిట్రా ఫూల్ అని అడిగితే వాడు చెప్పిన సమాధానమిది!

"ఏం లేదురా బాబూ, ఇవాళ కూడ పౌర్ణమే అయింది. ఆ మేష్టారి పెళ్లాం దెయ్యమై అక్కడ కూర్చొని వుంటుంది. నన్ను నీవు నవ్యంగా యింటికి జేరుస్తావా అని— నీ వెంట రావాలంటే భయమేస్తుందిరా—"

నాకు నవ్వు వచ్చింది. వెంటనే రెండు రోజుల

క్రితం వెల్లూరులో నా మిత్రుడు రెడ్డి బంగళాలో చూసిన దృశ్యం గుర్తుకొచ్చింది.

"నీ కొచ్చిన భయమేమిలేదు. నిన్ను సురక్షితంగా ఇంటికి జేర్చే బాధ్యత నాది! రా— వచ్చికూర్చో—' అన్నాను.

మ్యాయిండియాలో రెండు స్ట్రాంగ్ టీ బిగించి బయలుదేరాం.

ఆకాశంలో వత్తుగా నక్షత్రాలు మెరుస్తున్నాయి. మెల్లగా క్రిందికి జారుతున్న పొగమంచుతో వెన్నెల దుమ్ము కొట్టుకు పోయినట్లుగా వెల వెలబోతుంది. కనిపించని చలి వణికిస్తుంది. రంగారావు తను కూర్చున్న వయిపు గ్లాస్ క్రిందకు దింపి నావయిపు గ్లాసు కూడ దింపమన్నాడు. చలిగా వుంటేనే సరదాగా వుంటుందని చెప్పి గ్లాస్ దింపలేదు.

రంగారావు నాటక సమాజం గురించి ఏవో చెప్పుతున్నాడు. మధ్యలో స్పీడు తొక్కరా అని అన్నాడు. నాడు అనటమే తడువుగా ఎక్సిలేటర్ తొక్కాను. కారుస్పీడుతో ముందుకు దూసుకు పోతుంది.

మా వూరు దగ్గరవుతున్నకొద్దీ మా వాడిలో మామూలు సంచలనం మొదలయింది. నా దగ్గర దృక్కతను జరుగుతున్నాడు. నా భుజాన్ని తన గుప్పిటతో పిండి పారేస్తున్నాడు. అంత చలిలోనూ వాడికి చెమట కారుతుంటే నాకు బలే నవ్వు వచ్చింది. నా నవ్వుచూచి వాడు కోపగించుకున్నాడు.

సోగందాని గట్టుమీద పొగమేఘాలు గుంపులుగా క్రిందకు దిగుతున్నాయి. వూడల మర్రి చుట్టూ చీకటిని దింపుతుంది. కారు వెలుగు నల్లటి తారు రోడ్డును మింగేస్తుంది. వంతెన...... కారును చూచి ప్రక్క డొంకలోంచి తెల్లచీర కట్టుకున్న ఆకారం రోడ్డు మీదకు వచ్చింది— చేయి చాచి కారు ఆపమంటుంది—

వద్దురా— ఆపకు— ఇంకా స్పీడు తొక్కు

# నన్ను కారెక్కించుకోవూ

అని రంగారావు వణుకుతున్న కంఠంతో నన్ను హెచ్చరిస్తున్నాడు. ఆపనులేరా అని చెప్పుతుంటే నా గొంతు నాకే వికృతంగా వినిపించింది.

కారుకు ఆ ఆకారానికి మధ్యనున్న దూరం తొందర తొందరగా తరిగిపోతుంది. కారు వెలుగులో ఆ ఆకారం స్పష్టంగా కనిపిస్తోంది. ఆ యువతి ఎంతో అందంగా వుంది.

కారుకూ వంతెన ప్రక్కన నిలబడ్డ ఆ యువతికీ మధ్య వున్న దూరాన్ని ఒకమారు చూశాను. కళ్ళు మూసుకొని లెక్కవేశాను— ఒక వంద గజాలున్నట్లుగా మనస్సుకు తట్టింది— రంగారావు వంక చూశా— నన్ను అంటుకుపోతున్నాడు—...... స్టీరింగ్ మీద కుడిచేయి తీసి డోర్ మీద పెట్టాను.... ముప్పై గజాల దూరం........ ఆ స్త్రీ చేయి చాచి క్రిందకీ మీదకూ వూపుతుంది.......

బ్రేకుల మీద కాళ్ళు పెట్టి గట్టిగానొక్కా....... తారు రోడ్డుమీద, చక్రాలు 'కర్'న శబ్దంచేస్తూ, కారు కచ్చితంగా ఆ స్త్రీ ముందు ఆగింది— కారు ఆగటం, నేను ఆ స్త్రీ చేయి గట్టిగా పట్టుకోవటం, ఆమె కెవ్వున అరవటం— అన్నీ ఒక రెప్పపాటు కాలంలో జరిగాయి. వెంటనే మా రంగారావు, 'చంపావురా' అని కేకపెట్టి సీట్లో వరిగిపోయాడు.

ఈ అలజడికి వూడల మర్రిమీద పక్షులు ఒక్కసారిగా గోలగా లేచాయి.

నా చేతిలో ఆ యువతి చేయి మెలికలు తిరుగుతుంది. నేను డోర్ తీసుకుని క్రిందకు దిగాను. ఆమె తన శక్తినంతా వినియోగించి విడిపించుకోవటానికి తెగ గుంజుకుంటుంది. కాని లాభం లేక పోయింది.

కారు లైట్ల వెలుగులోకి లాగి ఆమెనుచూశాను.

వండర్— ఆడదికాదు! ఆడవేషంలో వున్న మొగవాడు!!

"అరే పిరికి వెధవ. కారు దిగిరారా— ఈ వగటి వేషం— సారీ, ఈ రాత్రి వేషగా డెవడో చూద్దువు గాని రా—" అన్నాను.

"ఏమిటి, వేషమా?" అంటూ రంగారావు కారు దిగి వచ్చాడు. వచ్చి చూచి ఆశ్చర్యపోయాడు.

"ఎవ్రడావీడు?" అని రంగారావుని అడిగాను.

రంగారావు కూడ పోల్చుకోలేక పోయాడు. ఏమోరా అన్నాడు. వీడ్నే అడిగితేపోలా— అని "ఎవ్రడానివ్?" అని అడిగా. సమాధానం లేదు. రాత్రుళ్ళు ఆడవేష మేసుకొని, దెయ్యంలాగా వచ్చే పోయే జనాన్ని దడిపించి చంపుతున్న ఆ రాస్కెల్‌ను చూడగానే నా కెక్కడలేని కోపం ముంచుకువచ్చింది. పళ్ళు పట పట కొరుకుతూ మెడ మీద ఒక్కటిచ్చాను. ఆ దెబ్బకు 'అమ్మో!' అన్నాడు బాధగా.

"ఆవిగ్ లాగరా— తెల్సిపోతుంది—" అని అంటూ రంగారావు ఆ పెట్టుకున్న జడను పట్టుకుని లాగాడు.

వండర్. మా కళ్లను మేం నమ్మలేకపోయాం. శ్రీరంగం మేష్టారు!

ఆయన్ని చూడగానే నా చేతిపట్టు సడలిపోయింది.

శ్రీరంగం మేష్టారు వంతెన దగ్గర కూలబడి రెండు కాళ్ళసందున తల పెట్టుకుని భోరు భోరున ఏడుస్తున్నాడు. ఆ నిశబ్ద నిశీధిలో ఆయన ఏడ్పు హృదయ విదారకంగా వుంది.

రంగారావు ఆయన్ని వోదార్చటానికి ప్రయత్నిస్తున్నాడు. నేను సిగిరెట్టు వెలిగించి తల రుద్దుకుంటూ అటూ ఇటూ పచార్లు చేశాను.

కొద్దిసేపుకు మాష్టారి ఏడ్పు వుధృతం తగ్గింది. ఏడ్పు ఎక్కిళ్ళుగా మారింది.

"ఏమిటి మాష్టారు? ఈ ఆడవేషం— ఇలా దెయ్యంలాగా అందర్నీ దడిపించటం— నాకేం అర్థం కావటంలేదు—" రంగారావు మెల్లగా అనునయంగా అడుగుతున్నాడు.

ఆయన వస్తున్న దుఃఖాన్ని దిగమ్రింగుకుంటూ అన్నాడు: "అదే నారాజి చనిపోయింది కదా!— అలా చనిపోయింది దెయ్యమయి—"

"ఆగండి మాష్టారు—" అని ఆయన చెప్పబోయేదాని కడ్డు తగిలాను. మేష్టారు, రంగారావు తలెత్తి నా వంక వింతగా చూశారు.

సిగిరెటు క్రిందపారేసి బూటుకాలుతో నలుపుతూ అన్నాను: "మీ భార్య చనిపోయిందా? దెయ్యమయిందా? ఇదొక పెద్ద అబద్ధం— ఆమె నట్నాలల్లో రంగేలి రవ్వలాగా అవలీలగా తలలు మార్చి పారేస్తుంటేను. రెండు రోజుల క్రితం వెల్లూరులో చూశా— మారెడ్డి బంగళాలో. నిదానంగా, వివరంగా చూద్దామనుకునే సరికి కారులో వెళ్లిపోయింది. అప్పుడే నా కనుమానం తట్టింది. ఈ దెయ్యం గియ్యం అనేది ఒక పెద్ద కట్టు కథ అని. ఇప్పుడు తెలిసింది ఈ కట్టుకథకు నాయకుడు మీరని—"

శ్రీరంగం మేష్టారు మళ్ళీ కుళ్ళి కుళ్ళి ఏడ్చాడు. "మీకు తెల్సిపోయింది— అంతా తెల్సిపోయింది— లాభం లేదు— అంతా చెప్పేస్తా—" అని అన్నాడు వెక్కుతూ—

ఆయన చెప్పినదాన్నిబట్టి తేలింది ఇది—

మాష్టారు భార్య రాజేశ్వరి నొస్సు అందగత్తె





"—పార్టీ టిక్కెట్టు ఇవ్వనప్పుడు ఎంత స్వార్థరహిత సేవచేసి మాత్రం ఏమిలాభం?!"

తన త్రిప్పుకోలేని ఆ అందం ముందు ఇతను తల వంచాడు. దాసానుదాసు అయ్యాడు. చాలాగొప్పగా ప్రేమించాడు, కాదు ఆరాధించాడు. తన ప్రేమకు, ఆరాధనకు ప్రతిఫలంగా ఆమెనుండి అతను పొందింది నిరాదరణ, నిరసన మాత్రమే! ఆమెకు తను గొప్ప అందగత్తెనని తన అందానికి ఇతను ఏవిధంగాను తగడని తెలుసు. ఆమెకు విలాస జీవితంమీద మోజు మెండు. ఈ బడిపంతులు తన విలాసాలను తీర్చ లేడని కూడా తెలుసు. అతనితో వున్న సంవత్సర కాలంలో అతనితో ఏనాడూ తృప్తి పడలేదు. తన అందానికి ఇది తగిన చోటుకాదనుకుంది. తనలో తగిలే లాలనకు ఇతను తగినవాడు కాదనుకుంది. అందుకే పుట్టింటికి వెళ్లిపోయింది. పుట్టింటికి వెళ్లిన భార్య రెండు నెలలైనా తిరిగి రాకపోయే సరికి ఆమెను చూస్తానికి, తన వెంట తీసుకు రావటానికి వెళ్లాడు. వస్తుతః దరిద్ర దేవతకు నిలయమైన తన పుట్టింటిని ఈ రెండు నెలల్లో ఆమె తన అందచందాల ప్రభావంతో లక్ష్మికి ఆలవాలం చేసింది. ఆమె క్రీగంటి చూపుకు తహ తహలాడే రసిక పురుషులెందరో చూశాడు. ఆమె ఆ జీవితాన్ని వదులుకుని తనతో రాదని తెలిసి కూడ, ఇంటికి తిర్గి రమ్మని అడిగాడు. అందు కామె నవ్వింది. అతను ప్రాధేయపడ్డాడు. నీకు నాకు రాంరాం అంది. చేసేదిలేక తిరిగి వచ్చాడు. అప్పటికే గుచ్చి గుచ్చి అడుగుతున్న వూరివారిని నమ్మించటానికి ఒక కట్టు కథను సృష్టించాడు. తన భార్య జబ్బుచేసి చచ్చిపోయిందని చెప్పాడు. తను కల్పించిన కట్టుకథను గట్టిగా నమ్మించ టానికి ఒక దెయ్యాన్ని సృష్టించాడు. ఆ దెయ్యం తనే అయ్యాడు. అలా అవటంతో తనలోని ఒక విచిత్రమైన "మేనియాని" చల్లార్చుకోవటానికి ప్రయత్నించాడు. తను ఇంతగా ఆరాధించిన భార్య, తనని నిర్దయగా తృణీకరించి పాప కూపంలోకి దిగబడిపోతున్న తన భార్య, పెద్ద జబ్బు చేసి చని పోయిందని— చనిపోయి తన మీద మమకారం చంపుకోలేక తనకోసం దయ్యమయిందని— తను తాను నమ్మించుకోవటంలోను, వూరి వారిని నమ్మిం చటంలోను అతని కేదో తృప్తి, వోదార్పు. అలా వెల కొల్పినాడు— తెల్లమినాడు— ఏ రోజునైతే తన భార్య నీచ జీవితాన్ని తను కళ్లారా చూశాడో, ఏరోజునైతే తన భార్య తన ముఖాన్ని ఈ జీవితంలో తనకు చూపించవద్దని ఆదేశించిందో, ఏరోజునైతే తనలో అశాంతి మంటలురేగి తనని నిలువున దహించ వేస్తాయో ఆ రోజున అతడవుతాడు, దయ్యమవుతాడు. వూరి వాళ్లను బెదిరించి— తన లోపలివాడు హృదయ విదారకంగా ఏడుస్తోంటే — తను పైకి నవ్వుకుంటాడు.

తన ఈ 'మేనియాని' ఇలా తీర్చుకొనివుండక పోయినట్లయితే తను ఏనాడో ఆత్మహత్య చేసు కొని వుండేవాడు!

అతన్ని పూర్తిగా వశంచేసుకున్న ఆ 'మేనియాని' అలా కొనసాగించు కోవటానికి నావల్ల అవరోధం కలిగింది. కాబట్టి శ్రీరంగం మాష్టారు తెల్లారే పొటికి వూరవతల మర్రికి వురిపోసుకుని చనిపోయాడు.

అతని చావుకు నేనెంతవరకు బాధ్యుణ్ణి అని నేను ఈ రోజువరకు ఆలోచిస్తూనే వుంటాను. మరి మీరేమంటారు? ●

# వారఫలం

**10-2-1967 శుక్రవారం మొదలు 16-2-1967 గురువారం వరకు.**

**మేషం :** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు చురుకుగా సాగడంవల్ల ఆదాయం బాగా ఉంటుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు కూడా లాభించగలవు. వారం మధ్యలో అధికవ్యయం జరగడంవలన ఆర్థికంగా ఒత్తిడి వస్తుంది. రాజకీయ వ్యవహారాలు బాగా ఉంటాయి. కళాకారులకు మంచి సమయం.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. ప్రయాణాలోచనలు చేస్తారు.

**వృషభం :** ఆదాయం కూడా మొలగొల్లిస్తూ, అన్ని వ్యవహారాల్లోను గౌరవప్రాబల్యాలు బాగా ఉంటాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. ప్రయాణాలు ప్రయోజనకరంగావుంటాయి. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. వారాంతంలో చికాకులు యేర్పడతాయి. వస్త్ర సౌభాగ్యం లభిస్తుంది.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగానే వుంటుంది. సాహిత్య కళారంగాల్లో మీ కృషి రాణించగలదు.

**మిధునం :** మీకు ముఖ్యంగా లాభించగల వ్యవహారాల్లో అనుకూలతను సాధించగలరు. ఆర్థిక వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరుతాయి. ఉద్యోగంలో గౌరవప్రాబల్యాలు బాగా ఉంటాయి. సాంఘిక వ్యవహారాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. దైవకార్యాలు నెరవేరతాయి.

**కర్కాటకం :** వారం ప్రారంభంలోనే వృత్తి వ్యాపారాల్లో చికాకులు యేర్పడతాయి. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. ఉద్యోగంలో మెప్పుకులావి కార్యభారాన్ని వహిస్తారు. వృత్తిలో వారాంతంలో అనుకూలత లభిస్తుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. మిత్రులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉండదు. బంధువుల వ్యవహారాల్లో మీ కృషి ఫలించగలదు.

**సింహం :** పూర్తిగా నెరవేరేవరకు యే వ్యవహారాన్ని నమ్మడానికి అవకాశంలేదు. మీరు స్వంతంగా చేసే వ్యాపారాలకంటే భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. విద్యా వైజ్ఞానికరంగాల్లో మీ కృషి ప్రోత్సాహకరంగా ఉంటుంది.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. విలాస వస్తువులు కొంటారు.

**కన్య :** వృత్తి వ్యాపారాల్లో మీరు అనుకొనేది ఒకటి జరిగేది మరొకటి కావచ్చును. నూతన వ్యాపారాలు ప్రారంభించడానికి యిది సమయం కాదు. ఉద్యోగంలో అకారణంగా అపోహలకు గురి కాగల ప్రమాదం వుంది. రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాల వంచనం పెరుగుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది.

స్త్రీలకు:— ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. అలంకరణకోసం వ్యయం చేస్తారు.

**తుల :** కొంచెం శ్రమ కలిగినా, అన్ని వ్యవహారాల్లోను అనుకూలతను సాధించగలరు. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు ప్రోత్సాహకరంగావుంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు కొంతవరకు లాభించగలవు. ఉద్యోగంలో అధికారుల ఆదరాభిమానాలను పొందగలరు. నూతన విషయాలను తెల్సుకొంటారు.

స్త్రీలకు:— కుటుంబ కార్యక్రమాలలో మార్పులు వస్తాయి. బంధు మిత్రులను కల్సుకొంటారు.

**వృశ్చికం :** సామాన్యమైన పనులకు కూడా విశేషమైన ప్రయత్నం చేయవలసి వస్తుంది. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలకు లోనుకావడం తగదు. వృత్తిలో అనుకూలమైన మార్పులు వస్తాయి. ప్రయాణాలు ప్రోత్సాహకరంగా వుంటాయి. ఉద్యోగంలో మిత్రులకు ఉపకారం చేయగలరు.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**ధనుస్సు :** వ్యాపారంలో పోటీదారి పోటీని యెదుర్కొని అనుకూలతను సాధించగలరు. వృత్తిలో అనుకూల వార్తలను వింటారు. సాహసముతో కూడిన వ్యవహారాలు కూడా లాభించగలవు. రాజకీయ వ్యవహారాల్లో మిత్రుల సహకారం లభించగలదు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాల్లో అధిక వ్యయం జరుగుతుంది. పుణ్యకార్యాలు చేస్తారు.

**మకరం :** రావలసిన డబ్బు సమయానికి అందడం వలన అన్ని వ్యవహారాలు అనుకొన్నట్లుగా నెరవేరుతాయి. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు కొంచెం శ్రమ మీద నెరవేరుతాయి. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. వస్త్ర సౌభాగ్యం లభిస్తుంది.

స్త్రీలకు:— ఆరోగ్యం సామాన్యంగా వుంటుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

**కుంభం :** ఇదివరకు మీ కార్యక్రమాల్లో యేర్పడిన చికాకులు తొలగిపోతాయి. వృత్తిలో మీరు యిదివరకు చేసిన ప్రయత్నాలు యిప్పుడు ఫలిస్తాయి. వ్యాపారరీత్యా చేసే ప్రయాణాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ఉద్యోగంలో మీ పరిస్థితి బాగా ఉంటుంది. సాటివారిలో గౌరవం లభిస్తుంది.

స్త్రీలకు:— కుటుంబ కార్యక్రమాలు విరాటంకంగా నెరవేరుతాయి. విలాస వస్తువులు కొంటారు.

**మీనం :** వారం ప్రారంభంలోనే వృత్తి వ్యాపారాల్లో చికాకులు యేర్పడి తరువాత సర్దుకొంటాయి. కొన్ని వ్యవహారాల్లో అధిక వ్యయం జరగడం వలన ఆర్థికంగా ఒత్తిడి వస్తుంది. మీ విలువైన వస్తువులు పోయే ప్రమాదం వుంది. వారం మధ్యలో నూతన వ్యాపారాలు లాభిస్తాయి. అనుకూలమైన మార్పులు రాగలవు.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. బంధు మిత్రులను కల్సుకొంటారు.

—మహేష్

# శ్రీమతి కెన్నెడీ రాణివాసం



శ్రీమతి జాక్విలెన్ కెన్నెడీ

కీ. శే. కెన్నెడీ భార్య జాక్వెలిన్ కెన్నెడీ. ఒక ప్రఖ్యాతి వహించిన అధ్యక్షుని భార్యగా ఆమెకు కావలసినంత ఘనత, పరపతి లభించింది. లభించిన గౌరవ మర్యాదల్ని పురస్కరించుకుని ఆమె అమెరికాకు 'రాణీ'గా చలామణి అవుదామని చూస్తున్నారు.

జాక్వెలిన్ కెన్నెడీ ఈ మధ్య ఒక రచయితమీద దాడి చేశారు. ఆమె రాజరికపు దర్పాన్ని ఇది కొంచెం భంగపరచింది. సెనేటర్ రాబర్ట్ కెన్నెడీ అధ్యక్ష పదవిని గాలిమేడలు కట్టుకొంటూ వున్న సమయంలో వారి మర్యాదగల వంశానికి కొద్దిగా ముప్పు ఏర్పడింది.

ఇదివరలో 'జాకీ'కి "మొట్టమొదటి స్త్రీ" అనే పేరుండేది. వారి వంశాన్ని గురించి సవిస్తరమైన చరిత్ర రాయడానికి రచయిత శ్రీ విలియమ్స్ మాంచెస్టర్‌కు కొన్ని హక్కులు ఆదిలో ఆమె ఇచ్చివున్నారు. అందులో చాలవరకు నిజాలు వెల్లడి కావాలని ఆమె అభిప్రాయం. కొన్ని సత్యాల్ని వెల్లడి చేయడంలో అక్కడక్కడ వంశ మర్యాదకు భంగం కలిగినా ఫరవాలేదని మొదట ఆమె రచయితకు సెలవిచ్చివున్నారు. మరి అటువంటి చరిత్ర ప్రపంచ వ్యాప్తమైనప్పుడు తమకు తలవంపులు తీసుకువస్తుందని ముందుగా ఆమె ఎందుకు ఆలోచించలేకపోయారు? ప్రెసిడెంట్ కెన్నెడీ ప్రపంచాదరాన్ని పొందిన వ్యక్తి. ఆయన హత్య గావింపబడ్డారు. తదాదిగా శ్రీమతి కెన్నెడీ వ్యవహారాలు అంత మెచ్చుకోదగినవిగా లేవు. భర్త మరణించినప్పటి నుండి నడుస్తున్న ఆమె చరిత్ర వంకరటింకరగా వుందని తెలుస్తూవుంది. శ్రీమతి కెన్నెడీ గౌరవ మర్యాదలు గల ఉన్నత కుటుంబానికి చెందిన వనిత. ఆమెను ఇతర ముఖ్య గంగాభాగీరధీ సమానులతో పోల్చినప్పుడు కొంత మర్యాదను కోల్పోతూవున్నారు. నవనాగరిక యువతిగా, నేటి అధునాతన పోకడలలో శ్రీమతి కెన్నెడీ వ్యవహరిస్తున్నారని అంటున్నారు

భర్త హత్యగావింపబడినప్పుడు ఆమె ఎంతగా విలపించారో, ఎంతగా దిగ్భ్రమచెందారో అన్న విషయం అందరికీ తెలిసిందే. అసలామె మళ్లీ మనుష్యుల్లో పడతారా అనిపించింది చూసిన వాళ్లకి. ఆమె సంతాపానికి ప్రపంచం నలుమూలల నుంచి సానుభూతి లభించింది. ఆమెను పొగడని వాళ్లు లేరు. ఆమె జీవిత శేషానికి ఎటువంటి లోపమూ రాకూడదని, ఎన్నో సదుపాయాలను కలుగజేయాలని అమెరికా ప్రజలు వాంఛించారు. కెన్నెడీ మరణించిన దానికంటే ఆమె వ్యక్తపరచిన కష్టమే ప్రజల్ని ఎక్కువగా కలతపెట్టింది. రీములకు రీముల కాగితాలు ఆమెను చిత్రించడంలో మునిగిపోయాయి.

ఒక విషయాన్ని ఇక్కడ మనం గమనించడం అవసరం. 1963 నవంబరు 22 నుండి వియత్నాంలో ఆరువేలకు పైబడిన వీరులు పరమపదించారు. కీ. శే. జాన్. యఫ్. కెన్నెడీ వలెనే వీరూ యువకులు, యోధులు, భవిష్యత్తులో అభ్యుదయ నిర్మాతలూను. వారి భౌతిక దేహాలు అల్యూమినియమ్ పెట్టెల్లో పెట్టి వారి వారి స్త్రీలకు అందించడం జరిగింది. ఈ స్త్రీలు అందరూ వున్నవాళ్లు కారు, అందమైన వాళ్లూ కారు. భర్తల అకాల మరణంతో కుమిలిపోతున్న ఆ స్త్రీలు తండ్రిలేని పిల్లల్ని సాకలేక ఎన్నో అగచాట్లు పడుతున్నారు. అప్పులోత్తుకు అమ్మకాలతోను యమయాతన పడుతున్నారు. ఉద్యోగాల కోసం ఎగబడి ప్రాణాలు విడిచాయిలే అనిపించుకొంటూ వున్నారు. కాని వీరి కథ ఎక్కడా చెప్పబడదు! బహుశా వెనక్కి తిరిగి చూచే సాహసం లేకకావచ్చు.

## పూడ్చిపెట్టిన మర్యాద

'మొట్టమొదటి స్త్రీ'గా తమను ఎక్కడెక్కడ గుర్తిస్తారో ప్రపంచంలో వున్న ఆ అన్ని వినోద ప్రదేశాలకు ఆమె ప్రయాణించడం జరిగింది. ఆమె మీద శరాఘాతంగా వచ్చే విమర్శలను సమాధాన పరచలేక పెద్ద పెద్ద వాళ్లంతా (శ్రీయుత లిండన్ జాన్సన్‌తో కలిపి) పప్పులో పడుస్తున్నారు!

ఇది సుమారు ఒక సంవత్సరంనాటి మాట. వేసవికాలం చివరిలో 'కేప్‌కోడ్', 'న్యూపోర్ట్' ప్రదేశాలు ఎంతవిలాసంగా వుంటాయో తెలియని వారుండరు. అక్కడ మాంచి టిప్‌టాప్‌గా దర్శనమిచ్చారు 'జాకీ'. ఆమెతోపాటు మరో సర్వకాల స్నేహితుడు కూడా వున్నారు. ఆయన చిత్రకారుడయిన శ్రీ విలియమ్ వాల్టన్. అతను— "ఆమె యధాప్రకారం పూర్వపు జీవితంలోకి అడుగు పెట్టేశారు......" అని నాతో అన్నారు. కీర్తిశేషులైన 'భర్త ప్రస్తావన వచ్చినప్పుడు చలన రహితంగానే ఆమె ఇప్పుడు చర్చించగల్గుతున్నారు'— అని మరికొందరు మిత్రులన్నారు. అంటే ప్రజలకంటే ముందుగానే ఆమె కీ. శే. కెన్నెడీ గురించి మరిచిపోయాలనాలా?

ఇప్పుడు వ్యాప్తిలో వున్న గొడవ ఆమె విచారాన్ని అధికంచేసేదిగా వుండాలసలు. ఈ రభస దేశానికీ, ఆమె వ్యక్తిత్వానికీ దెబ్బతీసేదిగా వుంది. బహుశా ఆమె అమెరికా చరిత్రలో కొత్తదనం చూపించాలని తలపోస్తూ వుండొచ్చు. కెన్నెడీ బతికున్నప్పుడు ఆయన సతీమణితో కలిసి స్వార్థంకోసం ఎటువంటి అనుకూల వాతావరణాన్ని సృష్టించుకున్నారో అవగాహన చేసుకుంటున్న అమెరికా ప్రజల్ని ఆమె దుయ్యబట్టడానికి కాలుదువ్వుతున్నారా? కొందరు అవుననే అంటున్నారు. ఇదివరలో ఆమెకు అత్యంత గౌరవాన్నిచ్చినవారు, ఇప్పుడామెను అధికార దుర్వినియోగంతో గౌరవ మర్యాదలకు సమాధికట్టినట్టు ఆడిపోసుకుంటున్నారు.

1945 ఫ్రాంక్లిన్ రూజ్‌వెల్ట్ మరణించినప్పుడు, ఆయన భార్య శ్రీమతి ఎలినార్ కొంతకాలం అజ్ఞాతవాసంలోవుండి తమ ప్రగాఢ సంతాపాన్ని ఎంతో గౌరవంగా తెలియపరచుకున్నారు. తర్వాత మళ్లీ యధాజీవితంలోకి తిరిగివచ్చి, తమ శక్తినంతా సాంఘికసేవలో ధారపోశారు. ఏ 'ప్రథమస్త్రీ' కూడా అంతటి త్యాగనిరతి పాటించి వుండలేదేమో! అదృష్టహీనుల్ని కాపాడడమే తమ పరమావధిగా ఎంచి కష్టనష్టాలకు వెరవకుండా తీయగా అనుభవించారామె.

యాభయ్యవ దశాబ్దంలో మరో చరిత్రవుంది. బ్రిటన్ రాజా ఆరవజార్జి మరణానంతరం రాజమాత మళ్లీ సింహాసనాన్నలంకరించడానికి తెగబడలేదు. ఆమె జీవితశేషాన్ని జాతిమైత్రికి అంకితంచేసి అందుకోసం ఎంతో శ్రమపడ్డారు. దేశాలు పర్యటించి శక్తినంతా ఉపయోగించి మహత్కార్యానికి తోడ్పడ్డారు.

భర్తలు ఎంత స్థానాన్ని అలంకరించారో అంతటి ఉత్తమస్థానాన్ని చరిత్రలో వీరు సంపాదించుకున్నారు.

'లాడాల్స్ విటా' అనే సంస్థ ఫాషన్, సంఘం, కళలు అనే వాటికి ప్రపంచంలో అగ్రగణ్యమైనది. అందులో శ్రీమతి కెన్నెడీ కార్యకర్త. ఆమెగారు శ్రీమతి జాన్సన్ 'వైట్ హవుస్' ఆహ్వానాలను త్రోసిపుచ్చి, తక్కిన అధికారయుతమైన ఆహ్వానాల కొన్నిటికి హాజరైవున్నారు. 'హోదా అవధుల్ని దాటి' ఆమె వ్యవహరిస్తున్నారని ఎంతో మంది తీవ్రంగా విమర్శించడం జరిగింది.

కె. శే. కెన్నెడీ పోతూ పోతూ పది మిలియన్ డాలర్ల ఎస్టేటును ఖర్చుకు విడిచిపెట్టి వెళ్లారు. దానిలా వుంచి 'ఫెడరల్ విడోస్ పెన్షన్' రూపములో ఆమెకు నెలకు 833 డాలర్లు లభిస్తూ వుంటాయి. ఈ పెన్షన్‌కోసం కెన్నెడీ హత్య గావింపబడిన వెనువెంటనే ఆమె దరఖాస్తు చేశారు. ఆమె పరిచర్యలకోసం వినియోగించుకొంటున్న ఇద్దరు సేవకురాండ్రు, ఒక వంటవాడు, ఒక ఆంగ్లేయ సంరక్షురాలు— వీరందరూ 'వైట్‌హవుస్' పరివారంలోకే లెక్క! ఆమెను, ఆమె పిల్లల భద్రతను కాపాడడానికి పదిమంది "రహస్య పరిశోధకుల్లోను" ఒకరు అడపాదడపా ఆమె ఆజ్ఞల్ని శిరసావహించడం జరుగుతూనే వుంది.

## డొంకతిరుగుడు సమాధానాలు

శ్రీమతి కెన్నెడీ 'వైట్ హవుస్' ఆహ్వానాలను తాము ఎందుకు అంగీకరించలేక పోయారో చెప్పే సాకులు చాలా బాధాకరంగా వుంటున్నాయి. ఒక వేళ సెనేటర్ రాబర్ట్ కెన్నెడీ అదృష్టం కలిసొచ్చి 'వైట్‌హవుస్'లో వసించడం జరిగితే శ్రీమతికెన్నెడీ అక్కడ ప్రవేశించడానికి ఎటువంటి అవరోధమూ వుండదు! ఎంతో సంతోషంతో ఆమె ఆయన్ను అనుసరిస్తారు.

ప్రపంచ ఖ్యాతి గాంచిన వ్యక్తిత్వం ఆమె మళ్లీ పెళ్లి చేసుకుంటే ఆవిరై పూరుకుంటుంది. కాని ఆమె ఆ హోదానుంచి తొలగేందుకు ఎటువంటి అవకాశాన్ని కలిగించని మాట నిజం. ఆమె అంతరంగికురాలు శ్రీమతి పమేలా టిమ్మిన్స్. ఈమె 'శ్రీమతికెన్నెడీ సర్వకాల సర్వావస్థల్లోను పిల్లల్నే ప్రాణంగా ప్రేమిస్తూ వారికి సేవ చేయడంతోనే కాలాన్ని వెళ్లబుచ్చేస్తున్నార'నే సాక్ష్యం ఇచ్చారు. ఆమె ఇరవైనాలుగ్గంటలు పిల్లలతోనే ఎందుకు కాలం వెళ్లబుచ్చాలిట? అడ్డాలమీద బిడ్డలు ఆమెకెవరూ లేరుగా?

బ్రాడ్వేలో పేరుతెచ్చుకున్న ప్రతి నాటకాన్ని ఆమె చూస్తారు. సంగీత కచేరీలకు వెళ్తారు. సినిమాలు చూస్తారు, 'బాలే' లాంటి నాట్యప్రదర్శనాలకు వెళ్తారు. అధునాతన దిగంబరత్వమంటే ఆమెకు సరదా! ఒక షోకైన రెస్టారెంటు దగ్గర ఇటీవల ఆమె 'మినిస్కర్ట్'తో కనిపించారు. 'పామ్ బీచ్', వర్జీనియా ఆమెకు ఆట పట్టులు. అనేక చోట్ల ఆమె 'స్కయ్' చేశారు. మిలియనియర్ చార్లెస్ రైట్స్‌మాన్, ఆయన భార్యతో కలిసి 'రేడియంట్' విహారస్థలంలో విహరించారు.

ఆమె చెల్లెలు 'లీ' తో కొంతకాలం వున్నారు. డచ్ రాయల్ ఫామిలీతో ఆరగించారు. ఎలిజబెత్ రాణితో తేనీటిని సేవించారు. స్పెయిన్‌లో స్వారీ చేశారు. మహత్తరమైన 'అర్జెంటైనా రాంచ్'లో బోబూచు లాడారు. కరోలిన్, జాన్‌లతో కలిసి హవాయ్‌లో కావలసినంత విశ్రాంతి ననుభవించారు. —ఇంత నిర్విరామంగా వున్నారామె!

జాన్ యఫ్. కెన్నెడీ హత్యానంతరం ప్రపంచమంతా శోకసముద్రంలో మునిగిపోయింది. పాఠశాలలు, విమానాశ్రయాలు, రోడ్లు— రాజమార్గాలు, ఒకటేమిటి అంతరిక్ష సాధనాలతో సహా అన్నీ పేర్లు మార్చేసుకున్నాయ్. ఆ మహావ్యక్తికి శ్రద్ధాంజలులు ఘటించాయి. ఇవన్నీ ఎవరేని పనులు! ప్రభుత్వము, దేశము తన భర్త మీద యింతటి అభిమానం చూపిస్తూ వస్తున్నారే! స్వయం కుటుంబానికి చెందిన ఆయన భార్య అపూర్వగౌరవాన్ని ఏ రూపేణా సంరక్షిస్తున్నట్టు?

ఆమె కార్యాలయంకోసం ప్రభుత్వం ఏటా 50,000 డాలర్లు ఇస్తూవుంది. న్యూయార్కులో 400, పార్కు అవెన్యూలో ఒక గొప్ప భవంతిని ఏర్పరచింది. అక్కడ ఇతరులకి ప్రవేశార్హతలేదు! (తమకిచ్చే భత్యంలో 20,000 తగ్గించవచ్చునని క్రిందటి ఏప్రిల్‌లో ఆమె అన్నారు.) జీవితాంతం వరకూ వూరికే ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుకునే అవకాశాన్ని ఆమెకు కల్పించారు. ఆమె సంప్రదింపుల్నీ కెన్నెడీ మెమోరియల్ లైబ్రరీని గురించి, ప్రదర్శనా చిత్రాల కేంద్రం గురించే ఎక్కువగా వుంటాయి.

జరుగుతున్న విషయాలను ఆధారంగా చేసుకుని యదార్థాలను వివరించిన చరిత్రను 'సెన్సార్' చేయడంలో ఆమె 'రాణి' హోదా మరింత అధికమైంది! 'ఒక అధ్యక్షుని మరణం (Death of a President) అనే శీర్షికలో 'లుక్' మాగజైన్ ఎడిటర్ విలియమ్ అట్‌వుడ్ కెన్నెడీపై తప్పుడురాతలు రాయవచ్చునని, కొందరు అభిప్రాయపడుతున్న మాట నిజమెలా అవుతుంది? ఆయినా కెన్నెడీ పరివారంలో వారే. 1960 లో తన మాగజైన్‌ను విడిచిపెట్టి కెన్నెడీఉపన్యాస రచయితగాను, న హోదాలుగాను కుదురుకున్నారు కదా! శ్రీ కెన్నెడీ ప్రతిఫలంగా గినీ, కెన్యాలకు ఈ ఎడిటర్‌గారిని ఎంబాసెడర్‌గావేసే కృతజ్ఞత తెలుపుకున్నారాయె. కె. శే. కెన్నెడీని సమర్థిస్తూ 'లుక్' మాగజైన్ ఎన్నో సంపుటాలు వెలువరించింది.

ఒకసారి శ్రీ అట్‌వుడ్ స్వయంగా— "ఈ రచనను అమెరికా ప్రజల కందించని పక్షంలో చరిత్రనే 'సెన్సార్' చేసినట్టవుతుంది" అని అన్నారు. అందుచేత ప్రచురణపై ప్రజలు దురభిప్రాయ పడడానికి ఆస్కారం వుంది.

అనవసరమైన కష్టాలు తమ పిల్లలకు కలగకుండా సంరక్షించడమే తమధ్యేయమని శ్రీమతి జాకీ అన్నారు. అదే ఆమె చేయలే పోతున్నారని విచారించవలసి వస్తోంది. పుస్తకాలు, లైబ్రరీలు, సినిమాలు, చరిత్రలు— ఇవన్నీ ఆమెకు గుర్తు చేస్తూనే వున్నాయి. మెళుకువగా వుండమనే అంటున్నాయి. పటిష్టమైన పరిపాలనలో కెన్నెడీ అగ్రగణ్యుడని రచించడానికి అడ్డదారుల్ని సరిచేయలేక చరిత్రకారులు యమయాతన పడతారు. థియొడోర్ సోరెన్సెన్ రాసిన 'కెన్నెడీ' అనేగ్రంథం, ఆర్థర్ ష్లెసింగర్ జూ. రాసిన 'వేయి రోజులు' (The Thousand Days) అనే గ్రంథం— ఇందుకు నిదర్శనాలు, ఈ రెండు పుస్తకాలు కెన్నెడీ 'వంశం'చేత చదవ బడ్డాయి, సరిదిద్ద బడ్డాయి, అంతేగాని కత్తిరించబడలేదు!

శ్రీ బిషప్ మరికొందరు రచయితలు ఆధారయుతమైన రచనలు చేయాలని చూశారు. కాని వారితో ఎటువంటి సంభాషణా చేయరాదని, వివరాలు ఇవ్వవద్దని అనుకూలంగా వున్న ఆదర్శాన్ని హెచ్చరించారు జాకీ.

శ్రీ బాబీ కెన్నెడీ, అన్నగారిమీద చెడురచనలు రాస్తున్నారనే నెపంమీద ఆయా రచయితల్ని వేధించడం జరుగుతూ వుంది. అన్నగారికి సంబంధించిన చిత్రాలు, ఫోటోలు అన్నీ స్వంతీకరించుకుని అవి ఎవరికి చెందినాసరే తమ ఆజ్ఞలేనిదే బయటికి రాకూడదని భయపెడుతున్నారు.

## అధిక ప్రయాసతో కూడినపని

వియత్నాంలో సైనికదళాన్ని ఉపయోగించడంలో కెన్నెడీ కీ[illegible] పెట్టారని, ఆయన పరిపాలన బహుళ జనాదరణ పొందింది కాదని, ఆయన అధ్యక్షపదవి అలాంటిదేనని— లోతుగా తరచి చూసిన చరిత్రకారులు తలపోస్తున్నారు. ఆయన కార్యక్రమాలు చాలవరకు కాంగ్రెస్‌లో వీగిపోయినవని, మరణించే నాటికి ఆయన పలుకుబడి కూడా క్షీణదశలో వున్నదని భావిస్తున్నారు. కె. శే. కెన్నెడీ మానవత్వాన్ని మహిమాన్వితం చేస్తున్న మనిషిగా కనిపించినా అంత శోభాయమానంగా చరిత్ర రాసేందుకు లేదు అంటున్నారు. దీనికి కారణం చాలవరకు కెన్నెడీ కుటుంబంవారేనట!

శ్రీమతి కెన్నెడీని తీసుకుంటే ఆమె నట ఒక అర్థమవుతూనే వుంది. కెన్నెడీ హత్యానంతరం ఆమె ఇచ్చిన 'ఇంటర్వ్యూ'లో ఎంతో హుందాతనం వుంది. అచ్చం ఒక అధ్యక్షుని భార్యగానే ఆ ప్రసంగాలు చోటు చేసుకున్నాయి. మరి, అవే రాతలు పుస్తకాల్లో నిండబడ్డాయి కదా! ఆమె మాటలే ఆమెకు విన సొంపుగా లేవు, వాటిని బహిష్కరించాలి అన్నప్పుడు నవ్వు వస్తుంది. భర్తను గురించి ఆమెకు ఎటువంటి అభిప్రాయం వున్నదీ అన్న ప్రశ్నమీద ఆమె యిచ్చిన సమాధానాన్ని, ఆ చెప్పే విధానాన్ని ఆమె కంఠస్వరాన్ని, ఆందోళనని, సత్ఫలాన్ని ఎంతో సవివరంగా మనవిచేశారు శ్రీ మాంచెస్టర్. ఆమె అభిప్రాయాన్ని ఎంతో అందముగా వర్ణించి చక్కని పద్ధతిలో కూర్చారు రచయిత. ఇదంతా ఆమెను మెచ్చుకోవడం కాదా?

"నేనొకవిధంగా ఊహిస్తున్నాను. బహుశా, ఆ రచన మానవత్వాన్ని సంతరించుకున్నదిగా వుంది గనుక అది ఆమెకు రుచించి వుండదు. అటువంటి దానికి దూరంగాను, మరింత పూజ్యనీయంగాను వుండి దేవతలా ప్రశంసించాలని ఆమె అభిప్రాయపడి వుంటారు."

శ్రీ వెరాగ్గాసర్

ఇటీవలి వార్తలనుబట్టి, శ్రీమతి కెన్నెడీకి ప్రభుత్వం యిచ్చే 30,000 డాలర్ల భత్యాన్ని కూడా ఉపసంహరించుకున్నారని తెలుస్తుంది. మాజీ అధ్యక్షుని భార్యగా లభించే సాలుసరి 10,000 డాలర్ల పెన్షనుమాత్రం ఆమె వినియోగించుకుంటారు. కెన్నెడీ నాల్గవ సంవత్సరీకం దాటే వరకు 'సీక్రెట్ సర్వీసు' మామూలుగానే రక్షణ భద్రతకోసం ఉపయోగించు కుంటానని ఆమె అన్నారు. సం॥




**జ రి గి న క థ**

**సత్యమూర్తి, ప్రకాశం చిన్ననాటి స్నేహితులు. కాలాకాలానికి అనుకోకుండా కలిశారు సత్యమూర్తి ప్రకాశం షుగర్ ఫ్యాక్టరీలో అకౌంటెంటుగా చేరాడు ఆ చుట్టుప్రక్కల ప్రకాశానికి ఎక్కువ పలుకుబడి వున్నట్టు గ్రహించాడు సత్యమూర్తి ప్రకాశం, రామదాసుకు సంబంధించిన జాడ తెలియని ఒక అమ్మాయికోసం వెదుకుతున్నాడు ఆమెను వశపరచుకుంటే కావలసినంత ఆస్తి దక్కుతుంది ఆ అమ్మాయి భానుమతి దామోదరం భానుమతిని మంచిచేసుకోడానికి ప్రయత్నిస్తున్నాడు సత్యమూర్తి, భానుమతి పరస్పరం ఆకర్షించుకున్నారు సత్యమూర్తిద్వారా దా మో ద రం గురించి తెలుసుకొంటుంది భానుమతి**

# 15

డిపోలో మాలయ్య అని ఒక వాచ్‌మన్ ఉన్నాడు వాడికి సుమారు ఏభై యేళ్ల వయస్సుంటుంది వాడెప్పుడూ త్రాగే వుంటాడు. వాడిని ఉద్యోగం లోంచి తీసెయ్యాలని చాలామంది ఆఫీసర్లు ఆలోచించేవారుకాని మళ్ళీ వాడి బీదరికాన్ని వాడి కుటుంబ పరిస్థితినీ, వాడి అమాయకత్వాన్నీ చూసి జాలిపడి వదిలేసేవారు అక్రితంరోజు రాత్రే మాలయ్య తప్ప త్రాగి డ్యూటీలో నిద్రపోతూంటే కుమారస్వామి పట్టుకొని రిపోర్టు చేస్తానని బెదిరించాడు ఆవిషయమ్మై మాట్లాడడానికి మాలయ్య ప్రొద్దున్నుంచే అవకాశం కోసం ఎదురు చూస్తున్నాడు గోపాలరావుగారు వెళ్లి పోయాక వాడు వెళ్ళి కుమారస్వామిని క్షమాపణ కోరుకుని, రిపోర్టు చెయ్యవద్దని ప్రాధేయపడ్డాడు అదే ఆఖరు వార్నింగనీ మళ్లీ అటువంటి తప్పు చేస్తే సహించనని తీవ్రంగా చెప్పాడు వాడు సరేనని పోయాడు

కొద్దిసేపు కుమారస్వామి మాలయ్య గురించి ఆలోచించాడు వాడిదొక హృదయవిదారకమైన గాథ వాడు తాగుడికి అలవాటు పడడం తన జీవితంలోని దుఃఖాన్ని మర్చి పోవడానికి అంటాడు వాడిమొహం చూస్తే అదినిజమేనేమో నని పిస్తుంది

“ఏమిటి ఆలోచిస్తున్నారు?” అని సూర్యం అడిగేసరికి ఉలిక్కి పడ్డాడు కుమారస్వామి నవ్వుతూ సూర్యాన్నాహ్వానించాడు

“ఏమీలేదు మాలయ్య గురించి ఆలోచిస్తున్నాను ఏమిటి విశేషాలు, నిన్నంతా కన్పించలేదు” అని సూర్యాన్ని కూర్చోమని సైగజేశాడు

“నిన్న చాలా పనిలో వుండిపోయాను పైగా నిన్న సూర్యారావు పేట వెళ్ళాను అక్కడ మధ్యాహ్నమంతా గడిపాను మీకు తెలుసునో లేదో కాని అక్కడి పరిస్థితులన్నీ మారిపోయాయి”

“అంటే? చెడిపొయ్యాయా? బాగుపడ్డాయా?”

“అసలు మొదటినుంచీ చెడిపోయే వున్నాయి. సూర్యారావుపేటలో పట్టపగలు నడిరోడ్డుమీద హత్య జరిగినా పోలీసువాళ్ళు కలుగజేసుకోవడానికి వీల్లేదు అలాటి కౌశ్డీ మూకలున్న వూరు నిత్యం ఎక్కడో అక్కడ దెబ్బలాటలు జరుగుతూనే వుంటాయి వీధికొక లాడ్జింగు ఆ వూరులో సారా దుకాణా లెన్నివున్నాయో చెప్పడానికి వీల్లేదు పోలీసు ఆఫీసర్లు ఎవరొచ్చినా అక్కడి పరిస్థితులకు తలవంచి, వాళ్ళిచ్చే మామూళ్ళు పుచ్చుకొని, జరుగుతున్నవాటిలో కలుగజేసుకోకుండా వూరుకోవలసిందే”

“అంత ఘోరమైన వూరా?”

“ఆ అందుకు సందేహం లేదు కాని ఇప్పుడదంతా తలక్రిందైంది వూరిలో దెబ్బలాటలు మచ్చుకైనా లేకుండా పోయాయి లాడ్జింగ్ లన్నీ ఖాళీ మునుపు రోడ్డుమీద ట్రాఫిక్ అడ్డదిడ్డంగా వుండేది అలాటిది ఇప్పుడెంతో పద్ధతిగా వుంది దొంగతనాలు పూర్తిగా తగ్గిపోయాయి”

“ఏమిటీ మార్పుకు కారణం?”

“ఏముందీ? కొత్తగా ఒక సర్కిల్ ఇన్‌స్పెక్టరు వచ్చాడు ఇదంతా ఆయన మహిమ అతను చాలా ‘కరెక్టు’ మనిషి ఆయనపేరు శ్రీరామ్ సూర్యారావుపేట పరిస్థితులు గమనించి, కొందరుపెద్దలు మినిస్టరుతో మాట్లాడి ప్రత్యేకంగా ఆ వూరికి శ్రీరామ్‌ని సర్కిల్ ఇనెస్పెక్టరుగా వేయించారుట అతను వచ్చిందగ్గర్నించీ, రాను రాను, పోలీసులు కేవలం పోలీసుల్లా పని చేస్తున్నారు ఇక అవు ళ్లో ఎవరినోట విన్నా శ్రీరామ్ పేరే?”

“అయితే అంతకు ముందున్న సర్కిలు అసమర్థుడా?”

“ఆయన దృష్టి ఎంతసేపూ లంచాల మీదే వుండేదిగాని, వూళ్ళో ‘లా అండ్ ఆర్డరు’ అమలు జరుపడం మీద వుండేదికాదు పాపం ఆయన ఉన్నన్నాళ్ళు ఆయన క్రింద పని చేసే ఆఫీసర్లు బాగా లంచాలు తినడానికి అలవాటుపడిపోయారేమో, శ్రీరామ్ వచ్చిన దగ్గర్నుంచీ ఒకటేగోల. అంతకుముందు ఒక డజను లాడ్జింగులు వుండేవి. ముఖంగా ప్రజలలో రోగాలను వ్యాపింపజేస్తూ డబ్బు సంపాదించే ఆ లడ్జింగులన్నీ, ఇప్పుడు పాడుబడ్డ ఇళ్లయి పోయాయి ఆవూళ్లో ఎవడికైనా చెడుపని చెయ్యాలంటే, శ్రీరామ్ పేరుసింహస్వప్నం రాజకీయ నాయకుల దగ్గర్నుంచి అతనంటే గౌరవిస్తారు తన ప్రాణాలకైనా లెక్కచెయ్యకుండా, విధి నిర్వహణకోసం ఎటువంటి కష్టాలకైనా ఎదుర్కొంటాడు ఎంతమంది దొంగల్ని పట్టుకున్నాడో లెక్క లేదు. పోలీసు ఆఫీసరంటే అలావుండాలి”

“అటువంటి ఆఫీసరు రామవరానికి కూడా అవసరం అనుకుంటాను చూశారా రైల్వేస్టేషను దగ్గర సాయంకాలం అయ్యే సరికి ఒక అరడజను మంది వ్యభిచారిణులు చేరతారు వూళ్ళో క్లబ్బుల్లోనే కాక ప్రతి కాఫీహోటలు వెనుకా, పేకాట జోరుగ సాగుతోంది సారా అంగళ్లకు లెక్కలేదు. దొంగల హడావుడి ఎక్కువగానే వుంది”

“ఆమాట నిజమే. కాని ఈవూరు వచ్చిన పోలీసు ఆఫీసర్లంతా ప్రకాశానికి భయపడుతున్నారు ప్రస్తుతం వున్న సబ్ ఇన్‌స్పెక్టరు గురుమూర్తి ఈ వూరికి వచ్చిన మొదటిరోజులలో ఎంతో కఠినంగా వుండేవాడు కాని రాను రాను అతను గ్రహించిన దేమంటే చాలావిషయాలు చూసీ చూడనట్లు వూరుకోడమే మంచిదని ఎందుకంటే ఎవరి మీద చర్యతీసుకున్నా, ప్రకాశం దగ్గరనుండి ఆ వ్యక్తి తమకు సంబంధించిన వాడనీ, అతని నేమీ చెయ్యవద్దని కబురు వచ్చేది సారా దుకాణాల వాళ్లనీ, పేకాడేవాళ్లనీ, అల్లరి చిల్లరిగా తిరిగే వాళ్లనీ, ఆఖరుకి బజార్లవెంట తిరిగే వ్యభిచారిణుల్నీ, ఎవర్ని పట్టుకున్నాసరే, వాళ్ల తాలూకు వాళ్లెవరో వెళ్లి ప్రకాశం కాళ్ల మీద పడడం జరుగుతోంది కొన్నాళ్లిలా జరిగాక గురుమూర్తి ప్రాణం విసిగి అసలు ఎవరి మీదా చర్య తీసుకోవడం మానేశాడు”

కుమారస్వామి నవ్వాడు “అయితే అన్ని అనర్థాలకూ మూలం ప్రకాశం అన్నమాట అయితే అతని మీదే చర్య తీసుకుంటే సరి” అన్నాడు

“నిజమే” అని కొంచెం బల్లమీదకి వంగి సూర్యం, “మీకు తెలుసో లేదో ప్రకాశం మీద ఇంక్వయిరీ జరుగబోతోంది” అన్నాడు

“ఆ!” అని ఆశ్చర్యం ప్రకటించి కుమారస్వామి, “అలాగనుక జరిగితే ఈ వూరు బాగుపడుతుంది ఇంతకీ దేనిగురించి?”

“దామోదరం, ప్రకాశం కలిసి గవర్నమెంటు వద్దకొన్ని పర్మిట్లు సంపాదించి, అవి బాగా లాభానికి అమ్ముకుని డబ్బు చేసుకున్నారు ఆవిషయం ప్రభుత్వం వారికి తెలిసి ఒక ఇంక్వయిరీ ఆఫీసర్ని నియమించింది అతనొక చండ శాసనుడుట. కొద్దిరోజులలో వచ్చి ఇక్కడ విచారణ జరిపి, ఆపర్మిట్లకు సంబంధించిన వ్యాపారం వీళ్ళు జరుపలేదనీ ఆపర్మిట్లను వేరొకరికి అమ్ముకున్నారనీ ఋజువు చెయ్యగానే వీళ్లకు బేడీలు వేస్తారు”

“అది వాళ్లకు అంత కష్టమైన విషయం అనుకోను వాళ్ళు వ్యాపారం చేసినట్లు ఆధారాలూ, సాక్ష్యాలూ, వాళ్లకున్న పలుకుబడి ద్వారా సులభంగా సంపాదించ గలరు”

“అవుననుకోండి కాని వూళ్లో చాలామంది ఈ అవకాశం కోసం ఎదురు చూస్తున్నారు. ఏం జరుగు తుందో చెప్పలేం”

“అయితే అవకాశం వస్తే అతనిమీద వ్యతిరేక సాక్ష్యం ఇచ్చేవారున్నారంటారా ? ఈ వూళ్లో అంత దమ్ములున్నవాళ్లున్నారా?” అని అడిగాడు

“అదేమిటండోయ్ అలా అంటున్నారు చాలా మంది హేమా హేమీలు న్నారు అసలు వాళ్ళు తల్చుకోవాలేగాని ప్రకాశాన్ని మూడు నిముషాల్లో క్రిందకు దింపగలరు మాకెందుకని వూరుకుంటున్నారు”

“అదే నేననేది వాళ్లలా వూరుకోవడం వల్లనే ప్రకాశం లాంటి వాళ్ళు విజృంభిస్తున్నారు చెడ్డకి లభించినంత ప్రోత్సాహం మంచికి లభించదు ఈ ప్రపంచంలో అదే నా కర్థంకాదు”

కుమారస్వామి మాటలకు కొంచెంసేపు ఆలోచించి, “అవును” అన్నాడు సూర్యం మరికొద్దిసేపు అవీ అవీ మాట్లాడి సూర్యం వెళ్లిపోయాక కుమారస్వామి తన పనిలో మునిగిపోయాడు.

'ప్రకాశం మీద ఎంక్వయిరీ'—అన్న విషయమే ఆ రోజుల్లా కుమారస్వామి మనసులో మెదులుతూ వుంది. నిజంగా 'ఎంక్వయిరీ' జరిగితే, అతని అత్యాచారాలు ఎన్నో బయట పడతాయి. కానీ చట్టం అతని దురన్యాయాలను నిరూపించడం ఎంతో కష్టం. నమ్మిన వాణ్ణి ద్రోహంతో పడగొట్టడమంత సులభకార్యం మరొకటి లేదు. దానిని ఏ చట్టమూ నిరూపించలేదు. ఒకరిమీద ఒకరికి నమ్మకం లేని వ్యక్తులిద్దరి మధ్యా జరిగేపనికి ఎన్నో నిదర్శనాలుంటాయి, కాగితాల మీద రాతకోతలుంటాయి. స్టాంపులున్న దస్తావేజుల మీద సాక్షి సంతకాల మధ్య జరిగే ఒప్పందాలుంటాయి కాబట్టి, చట్టం వారిని కాపాడుతుంది. కాని కేవలం నైతిక బలంమీదా, ధర్మం మీదా నమ్మి దైనందిన జీవితం గడిపే వారికి అన్యాయం జరిగితే, దానికి రుజువులు కూడా దొరకవు.

అప్పటికి కొద్దిరోజులనుండి, పూచావాచా ప్రకాశంమీద ఎంక్వయిరీ జరుగుతుందని అందరికీ తెలియసాగింది. ముఖ్యంగా అతని శత్రువులు కొంతమందికి, అతని మీద దెబ్బ కొట్టడానికి సరియైన అదను ఇదే ననిపించింది. వాళ్ళు ఇంటింటికీ వెళ్ళి రహస్య ప్రచారం ప్రారంభించారు. వాళ్ళకు నాయకుడు పశుపతి అని ఒక కమ్యూనిస్టు యువకుడు. అతను ప్రకాశానికి దూరపు బంధువు. పాతికేళ్ళుంటాయి. నల్లగా, సన్నగా, గిరజాల జుట్టుతో నవ్వు మొహంతో, తెల్లని బట్టలతో ఆకర్షణీయమైన, విగ్రహం గలవాడు. అతనికి ఉద్రేకం రానంతవరకూ చాలా సాత్వికుడు. కాని ఉద్రేకం వచ్చిందంటే, అక్కడ దగ్గరలో వున్న ఎత్తయిన వస్తువు నెక్కి ఉపన్యసిస్తాడు, అది రోడ్డు మధ్య బండైనా సరే, గదిలో టేబులైనా సరే.

దేశం యొక్క భవిష్యత్తు గురించీ, దేశంలో వున్న ప్రస్తుత పరిస్థితులలో ప్రజలకు జరుగుతున్న అన్యాయం గురించీ పశుపతి ఎప్పుడూ ఆలోచిస్తూ వుంటాడు. అతను చదువు పూర్తయ్యాక కమ్యూనిస్టు పార్టీలో చేరాడు. అతను కాలేజీలో చదువుకుంటున్నప్పుడే నాగమణి అనే తోటి విద్యార్థిని అతనూ ప్రేమించుకున్నారు. నాగమణి తండ్రి ఇన్‌కంటాక్సు ఆఫీసరుగా పనిచేసి, లంచాలద్వారా బోలెడంత డబ్బు సంపాదించి దానితో రామవరం వద్ద కొంత పొలం కొన్నాడు. బి. ఏ. చదువుకుంటున్న ఒక్కకూతురూ, పశుపతి కాలేజీలో సోషలిజం గురించి ఇచ్చిన లెక్చర్లకు ముగ్ధురాలై ప్రేమించేసరికి, పశుపతికి తన తన కూతుర్నిచ్చి పెళ్లిచేసి వాళ్లిద్దర్నీ హాయిగా ఆస్తి ననుభవించమని రామవరంలో కాపురం పెట్టించాడు.

భార్యాభర్తలిద్దరికీ సంఘసేవంటే చాలాయిష్టం. ఇద్దరూ కార్మికులకూ 'కర్షకులకూ బోధచేసి వారి మధ్యరిద్దామని కమ్యూనిస్టు ప్రచార కార్యక్రమంలోకి దిగారు. పశుపతి, మిల్లు లన్నిటిలోనూ పని చేసే కార్మికులను సంఘంగా ఏర్పడమని ఉద్బోధించేవాడు. అతని బోధ అందరికీ నచ్చినా, కమ్యూనిస్టు పార్టీ అంటే ఎందుచేతనో అందరికీ కొంత భయంగా వుండేది. పశుపతి చుట్టూ కొంతమంది యువకులూ, కొంతమంది కార్మికులూ చేరారు. వాళ్లకోసం అతను ఏం చెయ్యమన్నా చేస్తాడు. ముఖ్యంగా వాళ్ళ ఆపదలో వున్నారంటే తన స్వంత డబ్బు ఖర్చుపెట్టి వాళ్ళ నాదరించే వాడు. రాను రాను అతని యందు నమ్మకం వున్నా లేక పోయినా, కమ్యూనిజం అంటే ఇష్టం వున్నా లేక పోయినా, అతనితో సన్నిహితంగా తిరిగితే, ఆర్థిక సహాయం చేస్తాడని చాలామంది అతని చుట్టూ తిరగ సాగారు.

వీరంతా తన ఆశయాలను అనుసరించేవారని పశుపతి నమ్ముతూండేవాడు. అతని పలుకుబడి




గ్రామంలో వృద్ధవతున్న సమయంలోనే పంచాయతీ ఎన్నికలు వచ్చాయి.

ప్రతిసారీ పంచాయతీ ఎన్నికలకు ప్రకాశం తన అనుచరులలో ఒకడిని నిలబెట్టడం, అతనిని చివరకు పంచాయతీ బోర్డు అధ్యక్షుడిని చేయడం మామూలు. ఈసారి రంగారావును తన ప్రతినిధిగా నిలబెట్టాడు, తను వార్డునుండి. పశుపతి ఈ ఎన్నికలలో ప్రకాశానికి దెబ్బతియ్యాలనుకున్నాడు. రంగారావు నిలబడ్డ వార్డునుండే తనూ నిలబడ్డాడు. ఆవార్డులో ఎక్కువ మంది కార్మికులున్నారు.

కార్మికులంతా తన పక్షమనీ వోట్లన్నీ తనకే పడతాయని పశుపతి నమ్మాడు. వాళ్లకు ఇంతవరకూ ఎన్నో ఉపకారాలు చేశాడు తను. ఎన్నో అవసరాలలో ఆదుకున్నాడు. వాళ్ల పిల్లలకు చదువు చెప్పించడానికి సాయం చేశాడు. పంచాయితీ ఎన్నికలలో తను నెగ్గగానే, ఈసారి ప్రకాశం తాలూకు మనిషి పంచాయతీ అధ్యక్షుడు కాకుండా చూసి, తనే అధ్యక్షపదవికి పోటీ చెయ్యాలనుకున్నాడు. వూరిలో ఎన్నోమార్పులు తేవాలని ఆలోచించాడు.

మర్నాడు ఎన్నికలనగా, రాత్రి పన్నెండు గంటల దాకా పశుపతి అతని అనుచరులూ వారు అంతా తిరిగి అందరి ఇళ్లకూవెళ్లి, వోట్లు పశుపతికి వెయ్యమని చెప్పి వచ్చారు. జనం అంతా పశుపతి నెంతో మర్యాదచేసి, తప్పకుండా అతనికే వోట్లు వేస్తామన్నారు.

అంతా తనపక్షమే వోట్లు వేస్తారనుకున్న పశుపతికి,

రాత్రిపన్నెండు గంటలు దాటాకా కల్లుకుండలూ, సారా బుడ్లీలు వార్డంతా విచ్చలవిడిగా సరఫరా అయ్యాయనీ, వోటుకి పదిరూపాయలు ఆశ చూప బడిందనీ తెలియదు.

మర్నాడు వోట్ల లెక్కింపు దాకా పశుపతి తను ఎన్నిక అవుతానని అనుకుంటూనే వున్నాడు. రంగా రావుకి తనకన్నా చాలా ఎక్కువ వోట్లువచ్చాయని తెలియగానే పశుపతి క్రుంగి పోయాడు. తనువోట్లు వేస్తారని నమ్మినవారిని చాలామందిని అడిగాడు. కొందరు అతనికే వేసామని అబద్ధమాడారు. మరి కొందరు ప్రకాశంమాట కొట్టెయ్యలేక అతనికే వోటు వేశామని ఒప్పుకున్నారు.

రాజకీయాల్లో, ముఖ్యంగా ఎన్నికలలో, ఎలాటి యుక్తులు పని చేస్తాయో, పశుపతికి తెలియదు. ప్రజలలో ఉద్రేకాల్ని ఎలా రెచ్చగొట్టాలో దాహా దానికీ, ప్రకాశానికి తెలిసినట్లు మరెవరికీ తెలియదు. పశుపతి తనకు బలమైన ప్రతిస్పర్ధి అవుతాడేమో నని ఒకప్పుడు ప్రకాశం భయపడ్డాడు. కానీ పంచాయితీ ఎన్నికలలో పశుపతి పోటీ చేస్తున్నాడనగానే, అందులోనే అతనిపై దెబ్బతీస్తే,అంతకుమించి పైకి రాలేడని, నిశ్చయించాడు. తత్ఫలితంగా ప్రకాశం ఈ ఎన్నికలకు చాలా డబ్బు ఖర్చు పెట్టడం, రంగారావుని గెలిపించడం జరిగింది.

ఎన్నికలలో వోడిపోయాడనగానే పశుపతికి గ్రామస్థుల దృష్టిలో కొంత విలువ తగ్గింది. ప్రకాశం అంటే భయభక్తులు కూడా హెచ్చాయి. పశుపతికి ప్రజల తత్వంబోధపడలేదు. తనతో మాట్లాడి నప్పుడు ప్రకాశాన్ని తిట్టినవాళ్లే, ఎన్నికల సమయంలో అతనికి వోట్లెలా వేసారో అర్థంకాలేదు.

# సుప్రభాతం

ఏమైనా తను ఏనాటికైనా ప్రకాశం మీద పగ సాధించాలను కున్నాడు. ప్రకాశం, గవర్నమెంటు దగ్గరనుండి పర్మిట్లు సంపాదించి, వాటిని వేరే వ్యాపారస్థులకు అమ్ముకుని డబ్బు సంపాదించుతున్నా డని పదేపదే రిపోర్టులూ, ఆకాశరామన్న అర్జీలూ ప్రభుత్వానికి అందేటట్లు పశుపతి సర్వవిధాలా ప్రయత్నించాడు.

చివరకు ప్రభుత్వం ఈవిషయంలో విచారణ చెయ్యమని ఒకపెద్ద ఆఫీసరును నియమించింది. మిరపకాయల్ని విదేశాలకు ఎగుమతి చెయ్యటానికి పర్మిటు సంపాదించి, దానినిమద్రాసులోనే, కొంత లాభానికి ఒకమార్వాడికి అమ్ముకున్నాడనే ఆరోపణ యొక్క నిజాన్ని విచారించమని అతనిని కోరారు. ఆ ఆఫీసరు చాలా నిష్పక్షపాతి. కచ్చితమైన మనిషి.

అతను విచారణకోసం రామవరం వచ్చాడు. మిరపకాయల్ని పండించి అమ్మిన రైతుల్ని పిలవమన్నాడు. ఆ రైతులువచ్చి తమ దగ్గర ప్రకాశం మిరపకాయలు తీసుకున్నమాట నిజమే నన్నారు. అవి వాళ్లదగ్గర్నుంచి గిడ్డంగికి తీసుకు వచ్చిన బళ్లవాళ్లువచ్చి తమ ప్రకాశంకోసం బళ్లు తోలినమాట నిజమేనని సాక్ష్యమిచ్చారు. గిడ్డంగుల నుండి మద్రాసు పోర్టు వరకు సరుకు జేరవేసిన లారీల డ్రైవర్లను పిలిపించారు. వాళ్లువచ్చి తాము లారీలలో సరుకు మద్రాసుకు తీసికెళ్లినది నిజమేనన్నారు.

ఇందులో ఎవరిమాటనూ రుజువు చేసే 'రికార్డు' లు లేవు. కాని ఆమాటలు నిజంకాదనే ఆధారం కూడ లేదు. ఏ ఆధారాలైనా ప్రకాశం చూపించే ఆధారాలే నమ్మాలి. రైల్వే వేగన్ల ద్వారా సరుకు పంపబడితే రైల్వే 'రికార్డు'లను పట్టుకోవచ్చు. కాని లారీల రికార్డులనేం పట్టుకోగలరు? వాళ్ల సాక్ష్యాలు నిజం కాదనడానికి ఏ ఆధారంలేదు. అందు వల్ల విచారణ ప్రకాశానికి అనుకూలంగా ముగిసింది.

ఈసంగతి తెలిసి రామవరంలో చాలామంది ప్రకాశానికి ఏ విషయంలోనూ వ్యతిరేకంగా వుండడం ప్రమాదకరమని నిశ్చయించుకున్నారు. పశుపతి మాటకు విలువ తగ్గింది. ఈవిచారణలో ప్రకాశం దొరికిపోతాడని,అతను అందరివద్దా ప్రచారం చేశాడు. కాని విచారణలో ఏమాత్రం నేరారోపణకు సందివ్వకుండా రుజువులూ, ఆధారాలు సృష్టించి, మనుషుల చేత అబద్ధపు సాక్ష్యం ఇప్పించాడని తెలిసి అతను ఏమీ మాట్లాడలేక పోయాడు. కొందరు పశుపతిని బాహాటంగా, "ఇప్పుడేమంటావయ్యా?"అని అడిగారు. "ఇదంతా మీలోవున్న బలహీనత. ఇలాంటి విచారణలు వచ్చినప్పుడుమీరంతా సరియైన విషయం అధికార్లకు తెలియజెయ్యాలి. ప్రకాశం అంటే మీకందరకూ భయమెందుకో నాకర్థం కాదు." అన్నాడు. కాని పశుపతికే ప్రకాశాన్నెదురించడం సాధ్యంకాదనే అనుమానంతోబాటు, తనమీద కసితో ప్రకాశం ఎప్పుడైనా దెబ్బతీస్తాడేమోననే భయం కలుగక పోలేదు.

విచారణలు జరుగుతూనే వున్నాయి. సుగర్ ఫాక్టరీ విషయంలో అనేకసార్లు విచారణలు జరిగాయి. కాని అన్నిటిలోనూ ప్రకాశం దొరకకుండా తప్పించుకుంటూనే వున్నాడు. ప్రజలకు ఈవిచారణల వల్ల లాభంలేదని తెలిసిపోయింది.

పశుపతి గురించి ప్రకాశం ఏమీ చెయ్యదలుకోలేదు. తనకు వ్యతిరేకంగా ప్రవర్తించేవారి నెవరినైనా పశుపతిలాగే నలుగురిముందూ తెలివితక్కువ వాడిక్రింద రుజువుచేస్తేచాలు. వాళ్ల గొంతుక అలాగే అణగారి పోతుందనుకున్నాడు.

చివరకు రామవరంలో తనువుండి ప్రయోజనం లేదని పశుపతి ఆవూరినుండి మకాం ఎత్తేశాడు. అదిచూసి ప్రకాశం అనుయాయులంతా నవ్వారు.

* * *

"హలో! సిస్టర్, డియర్ ఎవరికోసం ఎదురు చూస్తున్నావు?" అనిబెనర్జీ, తనచెల్లెలైన మాలతిని ప్రశ్నించాడు.

"ఎవరికోసమో నీకెందుకు?" అని కటువుగా అంది మాలతి.

"నువ్వెవరికోసం ఎదురుచూస్తున్నావో నాకు తెలుసు. ఎందుకంటే నేనూ వారికోసమే ఎదురు చూస్తున్నాను" అని బెనర్జీ, తనచెల్లెలు కూర్చున్న సోఫా కెదురుగావున్న కుర్చీలో కూర్చున్నాడు. అతనికి వయస్సు సుమారు పాతిక సంవత్సరాలుంటుంది.మంచి బలిష్టమైన, అయిదడుగుల ఆరంగుళాల విగ్రహం. ఎప్పుడూ ఖరీదైన దుస్తులలో, నీటుగా, మెరిసే బోళ్లతో, ఇంగ్లీషు సినిమా స్టారులకు వలె దువ్వబడిన జుట్టుతో, మనిషి దర్జాగావుంటాడు. శరీర ఆకారంతో పోలిస్తే మొహం కొద్దిగా చిన్నది. ఆమొహంలో చిరునవ్వు ఎప్పుడూ తాండవిస్తున్నా అది సహజమైనదిలా కన్పించదు. కళ్లూ, నుదురూ చిన్నవి. ముక్కుపెద్దది. మొత్తం మీద అతనిని చూసినవారికి, మనిషియొక్క దుస్తులూ,



# సైంటిస్టులు
## నొప్పిని అతి శీఘ్రంగా తొలగించునట్టి విధానమును
# కనుగొన్నారు




# మైక్రొఫైనడ్ 'ఆస్ప్రో'

ఇప్పుడు, మొదటిసారిగా భారతదేశంలో ప్రవేశపెట్టబడినది

**బాధ మా సమస్య:** "ఆస్ప్రో" యొక్క పరిశోధన సంస్థలో, బాధ యొక్క సమస్య మీద పని చేస్తున్న సైంటిస్టులు ఇప్పుడు, క్రొత్త మైక్రోఫైన్డ్ ఆస్ప్రోను కనుగొన్నారు — ఇది బాధను అతి శీఘ్రంగా పోగొట్టే సాధనము.

**మైక్రోఫైన్డ్ అంటే ఏమిటి?** మైక్రోఫైన్డ్ అంటే, ఆస్ప్రోలోని నొప్పిని పోగొట్టే పదార్థము ముప్పది రెట్లు సన్నగా క్రొత్త ప్రత్యేకమైన పద్ధతిలో చెయ్యబడినది. ప్రతి మాత్రలోను ఇప్పుడు ఇంచుమించు 15 కోట్లు అతి సూక్ష్మమైన అణువులు వుంటాయి. అందువలన, రెండింతల కన్నా ఎక్కువగా నొప్పిని పోగొట్టే శక్తి అతి శీఘ్రంగా పని చేసి, మూడు రెట్లు శీఘ్రంగా నొప్పిని తొలగించును.

**అతి శీఘ్రంగా పని చేస్తుంది-చాలా సేపు వుంటుంది:** క్రొత్త మైక్రోఫైన్డ్ ఆస్ప్రోలోని చురుకైన, పదార్థము సునాయాసంగా, అతి త్వరగా ఇమిడి శరీరమందు 5 నుండి 7 గంటల దాకా వుంటుంది. ఇందువలనే, మైక్రోఫైన్డ్ ఆస్ప్రో అతి శీఘ్రంగా నొప్పిని తొలగిస్తుంది, మరియు చాలా సేపు వుంటుంది.

**తీసుకోవడం చాలా సులభము:** క్రొత్త మైక్రోఫైన్డ్ ఆస్ప్రోను మీకు ఇష్టమైనట్లు తీసుకోవచ్చును. అలాగే కాని, నీళ్లలో కలిపి కాని, ఒక గ్లాసుడు నీళ్లతో కాని, లేక వేడి పానీయముతో కాని తీసుకోవచ్చును.

**వీటికోసం క్రొత్త మైక్రోఫైన్డ్ 'ఆస్ప్రో'ను వాడండి:** నొప్పి, తల నొప్పి, ఒళ్లు నొప్పి, పంటి పోటు, కీళ్ల నొప్పి, జ్వరముతో కూడిన జలుబు, ఫ్లూ, కీళ్ల నొప్పులతో కూడిన జ్వరము, గొంతుకనొప్పి.

**మోతాదు:** పెద్దవారికి: రెండు బిళ్లలు, అవసరమైతే మళ్లీ వేసుకోండి. పిల్లలకు: ఒక బిళ్ల, లేక డాక్టర్ సలహా ప్రకారము వేసుకోవలెను.

క్రొత్త మైక్రోఫైన్డ్ 'ఆస్ప్రో' ఈ విధంగా పనిచేస్తుంది




బిళ్లలోని అణువు ఎంత పెద్దదిగా వుంటే అంత నెమ్మదిగాను అది ఇముడుతుంది— అందువల్ల మీరు, నొప్పి తగ్గడానికి చాలా సేపు ఆగాలి.




ఇది మైక్రోఫైన్డ్ చెయ్యబడుట వలన, ప్రతి, క్రొత్త మైక్రోఫైన్డ్ ఆస్ప్రో బిళ్లలోను ఇంచుమించు 15 కోట్లు అతి సూక్ష్మమైన అణువులు వుంటాయి. ఇందువలన, ఇది అతి త్వరగా ఇమిడి, అతి శీఘ్రంగా నివారణ నిచ్చును

క్రొత్త మైక్రోఫైన్డ్ 'ఆస్ప్రో', నొప్పిని నివారించుటకు, ఇప్పుడు మీకు లభించే వాటిలో అతి ఆధునికమైన సాధనము.






క్రొత్త

మైక్రోఫైన్డ్

ఆస్ప్రో

అతి శీఘ్రంగా నొప్పిని తొలగించును.

నికొలస్ (N) ఉత్పత్తి

(ASAO 72)

[illegible] ఆకర్షణీయంగా, ముఖవర్చస్సు [illegible] లేకు ఆకర్షణీయంగా కనిపిస్తుంది. బెనర్జీ మంచి టెన్నిసు ఆటగాడు. బి. ఎ. పాసు కాలేక, చదువుకోవడానికి స్వస్తిచెప్పి, తండ్రి బాగా ఆస్తిపరుడవడం వలన, ఏదైనా బిజినెస్ పెట్టాలని ఆలోచిస్తూ ప్రస్తుతానికి స్వేచ్ఛగా తిరుగుతున్న యువకుడు.

“నేను ఎదురుచూసే వ్యక్తితో నీకేం అవసరం?” అంది మాలతి కోపంగా. ఆమెకు ఇరవై ఏళ్ళుంటాయి. సన్నగా అర్భకంగా వుంటుంది. ఎర్రని టెరిలిన్ చీర, ఎర్రని జాకెట్టులో ఆమె చామన చాయరూపం అంత ఆకర్షణీయంగా లేనప్పటికీ, మేకప్ చేసుకున్న మొహం కాబట్టి, మన్నగా మెరుస్తోంది. ఆమె కాలేజీలో బి. యే. చదువుతోంది.

“అందమైన అమ్మాయిలతో, వాలాటి యువకులకు ఏం అవసరముంటుందో తెలిసే వయస్సుకింకా రాలేదనుకోమంటావా? అలా అనుకోమంటే, అనుకోడానికి నాకేమీ అభ్యంతరం లేదు.”

“ఇదిగో అన్నయ్యా, నువ్వు నా ఫ్రెండుని అనవసరంగా బెదర కొట్టద్దని నీకు చాలాసార్లు చెప్పాను. ఈ అమ్మాయి విషయంలో నువ్వేమాత్రం కలుగ జేసుకున్నా, నేను డాడీతో చెప్పవలసి వస్తుందని, నీకు వార్నింగ్ యిస్తున్నాను” అందిమాలతి మొహం చిట్లించుకుంటూ.

“అనవసరంగా కోపం తెచ్చుకోకు చెల్లాయి. ఆ అమ్మాయికిష్టమైతేనే నేను వుంటాను. లేకపోతే నాదారిని నేను చక్కా పోతాను. ఆ అమ్మాయి అభ్యంతరం పెట్టనవాడు నేను నీకేమాత్రం శ్రమ కలిగించను.” అని నిదానంగా బెనర్జీ మనవిచేసుకుంటే, అతని ప్రతిపాదను కాదనలేక పోయింది మాలతి. ఆమె అంగీకారాన్ని గ్రహించి సంతోషించాడతను.

# సుప్రభాతం

విశాఖపట్టణంలో ప్రముఖవ్యక్తి అని చెప్పుకోదగిన జగ్గారావుగారి సంతానం వీరిద్దరూ. జగ్గారావుగారు ప్రస్తుతం చేస్తున్న పనులలో ఒకటి వ్యాపారం. ఆయనకొక నూనెమిల్లు వుంది. కాని ఆయన డబ్బు గణిస్తున్నది అందులోనేకాదు. 'అమ్మోనియా'బ్లాకు మార్కెటులో అమ్మడంవల్ల లక్షలు గణించారు. అంతకుముందు సిమెంటు బ్లాకు మార్కెటులో అమ్మేవారు. ఇన్‌కం టాక్సు దెబ్బకు దొరకకుండా తప్పించుకోవడంలో ఆయనకు ఆయనేసాటి. ఒక్కసారి మట్టుకు తొంభైవేలు ఇన్‌కమ్‌టాక్సు పడింది, ఒక కచ్చితమైన ఆఫీసరు హయాంలో. అది కట్టకుండా చెయ్యవలసిన బందోబస్తు అన్నీచేసి, ఆ ఆఫీసరు బదిలీ అయేదాకా అజ్ఞాత వాసంలోకి వెళ్ళిపోయారు. తరువాత మరొక ఆఫీసరువచ్చాక, ఆయన భార్యకు కారుమోజువుందని తెలుసుకుని పోతేపోయిందని ఒక అంబాసిడర్ కారు కొనిచ్చేశాడు. ఇహ అంతే! తొంభైవేలల్లా, తొమ్మిదివేలల్లోకి దిగింది టాక్సు. మళ్ళీ జగ్గారావు బాహటంగా తిరగ నారంభించాడు. మునిసిపల్ ఎలక్షన్‌లో నిలబడ్డాడు. లక్ష ఖర్చయితే అయిందిగాని, కౌన్సిలర్‌గా ఎన్నిక అయ్యాడు. తరువాత కాంగ్రెసు టిక్కట్టు కూడా దొరికింది. ఛైర్మన్ సులభంగా అవగల్గాడు. కాంగ్రెసులో చేరినదగ్గర్నుంచి వేషం మార్చవలసివచ్చింది. ఖద్దరు బట్టలు విధిగా కట్టవలసి వచ్చింది. ఏభై ఏళ్ల వయసుగల జగ్గారావు పొట్టిగా, నల్లగావుంటాడు. పొట్ట పెద్దది. బట్టతలతో, పెద్దగుడ్లతో మొహం వికారంగా వుంటుంది. ఒకప్పుడు అతను జస్టిస్ పార్టీలో వ్యవహరించిన ప్రముఖ వ్యక్తి బ్రిటిషువారి హయాంలో, దొరలనందరినీ మంచి చేసుకుని, తన వ్యాపారం నిర్విఘ్నంగా కొనసాగించుకోవడంలో దిట్టయని పేరు పొందాడు. అప్పుడు కాంగ్రెసు నాయకులంటే అతనికి పరమ అసహ్యం. వాళ్ళనందరినీ 'షూట్' చెయ్యాలనేవాడు. ఇప్పుడు గాంధీగారు భగవదవతారమని, అడిగినవారికీ, అడగని వారికీ, ఎంతోనమ్మకంగా చెప్తాడు. అతను రోజుకొక విస్కీబుడ్డి ఖాళీచేస్తాడనీ, విదేశీ సరుకుఏదైనా, వాచీలుగాని, ట్రాన్సిస్టరురేడియోలుగాని, టేప్ రికార్డర్లుగాని, మరేదైనాగానీ అతనివద్ద దొరుకుతాయనీ, కొన్ని లాడ్జింగ్‌లు అందమైన అమ్మాయిలతోసహా అతని చేతిలో వున్నాయని చాలామందికి తెలుసు.

తనచరిత్ర లోకానికి తెలియదనే అపోహ ఆయనకేంతమాత్రం లేదు. కాని ఆయనకు డబ్బుయందు గొప్ప నమ్మకంవుంది. తను డబ్బును ఆరాధిస్తున్నాడు. అధికారంవల్ల కొందరికి డబ్బొస్తే, డబ్బువల్ల కొందరికి అధికారం లభిస్తుంది. ఈరెండింటికీ అవినాభావ సంబంధం వుంది. ప్రపంచంలో గమనించ వచ్చేవి ఆ రెండే. అందువల్ల తన జీవితం ధన్యమైందని ఆయన భావన. ఆయన తన పిల్లల్నికూడా అదే భావంతో పెంచాడు. కొడుకుకి సురేంద్రనాథ్ బెనర్జీ పేరుపెట్టాడు, చదువులో అంతగొప్పవాడు కావాలని. కాని ఎప్పుడైతే చదువుకి కొడుక్కి పడదని తెలిసిందో, కొడుకుని కూడా వ్యాపారంలోకి దింపాలని ఆలోచిస్తున్నాడు. ఈలోపల బెనర్జీ, తనకాలాన్ని చాలావరకూ పేకాట క్లబ్బుల్లోనూ, అందమైన అమ్మాయిల వేటలోనూ, కొంతమంది స్నేహితుల్ని పోగుజేసుకుని, గడుపుతున్నాడు. ఈ మధ్య కొన్ని సాంఘిక సినిమాలలో, హీరోలు, హీరోయిన్లనివెంటబడి తరమడంతప్ప మరేపనీ చేస్తున్నట్లు కనిపించక పోవడం, కొంత కథయ్యాక, తనో ఇంజినీరుననో, సి. ఐ. డీ ననో అని దబాయించడం పరిపాటయి పోయింది కాబట్టి, ఆసినిమాల ప్రభావంవల్ల కూడా, ఆడపిల్లల్ని వేటాడ్డం ఎక్కువైంది. అసలే రోడ్డుపైడు రోమియోలు, పట్టణంలో మురికి నీటిమీది దోమల్లా, ఎక్కువైపోతున్న ఈరోజుల్లో సినిమాల్లోకూడా హీరోలచేత అదేపని చేయించడం మరింత ప్రమాదకరంగా పరిణమిస్తోంది. బెనర్జీలాంటి ధనిక నవయువకులకు జీవితాదర్శం, పరమార్థం అదే అయిపోయింది. అంతేకాక మాలతిలాంటి యువతులలో కూడా కొంత, సందిగ్ధావస్థ కలిగించింది. ఒకవైపు నైతిక విలువల్ని గురించి ఘోషిస్తున్న పాతకాలపు ఆడవాళ్ళమాటల్ని పట్టుకుని, వాటికి ప్రాధాన్యత నివ్వడమా? లేక లోకం, సంఘం, అభ్యుదయపథం అంటూ చూపించే ఈ ఆనందానుభవమార్గాన్ని అనుసరించడమా? ఏది ఎలాగున్నా, ఈమార్గంలో ఓ ప్రమాదం వుందని, లోకజ్ఞానం గల ఆడపిల్లలందరికీ తెలుసు. ఎంతసేపూ తన ఆకర్షణకు లొంగి, పూవు చుట్టూ తిరిగే తేనెటీగ లాగ మగవాడు తిరిగితే బాగానే వుంటుంది. అదితన ఆత్మతృప్తికీ, విశ్వాసానికీ తోడుపడుతుంది. కాని పూవులోని మధువును గ్రోలనిచ్చిననాడు మాత్రం, ఆతేనెటీగ సంతోషంగా ఎగిరి పోతుంది, తనకుమాత్రం మిగిలేది అవమానం, విచారమూ, మాత్రమే. అప్పుడు తనగతి, చాలా హేయమవుతుంది. ఆ ప్రమాదం రాకుండా తను వ్యవహరించాలి.

(సశేషం)



వైజ్ఞానిక గాథావళి-9
డాక్టర్...



# ఇంటి కొక పువ్వా

1740 సంవత్సరంలో నొల్లెట్ అనే పరాసు క్రైస్తవ సన్యాసి గాలి తీసేసిన గాజు గొట్టంలో నుంచి విద్యుత్ స్ఫులింగము పంపితే దృశ్యము ఎలాగుంటుందో అని సోదా చూశాడు. లేడెన్ జాడీని ఘర్షణ విద్యుద్యంత్రాలనూ ఉపయోగించి మెరుపులు పుట్టించడము అప్పటి వారెరుగుదురు. తెల్లని తీగవలె మెరుపు ఈ కొసనుండి ఆ కొసకు గాలిలో దాటడము అందరూ చూచారు. ఆ గాలిని పలచన చేస్తేనో? అన్న ప్రశ్న తట్టింది నొల్లెట్‌కి. అందు కని గాజు గొట్టములో రెండు లోహపు తీగలను దూరదూరంగా బిగించి, గాలిని పంపులతో తోడేస్తూ విద్యుత్ స్ఫులింగాలు పంపేడు. గాలిలోనైతే ఉండీ ఉడిగీ దాటే స్ఫులింగాలు, గాలి పల్చన కావడంతో ప్రవాహముగా మారేయి. కరకరమనే మెరుపు కర్కశ ధ్వని తగ్గి డిప్ డిప్ మంటూ విద్యుత్తు గెంతి, క్రమంగా శబ్దము మాయమై మెరుపు తీగయ్యే తిబ్బనై కుచ్చు అయి గొట్టమంతా నింపే టట్లు లావైంది.

ఫారడే ఇంగ్లండులో ఈ ప్రయోగమును చేసి, గొట్టంలోని గాలిని ఇంకా తోడేసి చూశాడు. గొట్టాం నిండా వెలుగు పలాధగా నిండింది, వెలుతురు తూష్ణీలు కనబడింది, బిళ్ళలు బిళ్ళలుగా తెగి నట్లు గోచరించింది. గొట్టాములో బిగించిన విద్యుత్ధ్రువాలు ఒకటి ధనమూ (Positive) మరొకటి ఋణమూ (Negative) కదా? ఋణధ్రువము మీద వెలుగు కూడినట్లు కన పడింది ఫారడేకి. విద్యుద్వాహములో నుంచి విద్యుత్ప్రవాహమును పంపినప్పుడు విద్యుత్పీడనానికీ, ప్రవాహానికీ గల నిష్పత్తిని విద్యున్నిరోధము అన్నారు. గాలియొక్క విద్యున్నిరోధము గాలిని పల్చన చేసిన కొద్దీ ఎక్కువవుతుందా అని సోదా చూడడానికి ఫారడే ఈ ప్రయోగమును చేశాడు. మెరుపు రావడంతో మామూలు ప్రవాహ నియమాలు ఎగిరి పోయాయి. విద్యున్నిరోధము ఎక్కువకాలేదు సరికదా, వడిపోయి విద్యుత్తు ధారాళంగా ప్రవహిస్తున్నట్లు అనిపించింది. పల్చనచేస్తే గాలి విద్యుద్వాహక మయింది. ఫారడే తానుపయోగించిన పంపులు గొట్టాములోని గాలిని ఎంతవరకూ తోడెయ్య గలవో అంతవరకూ పని చేయించాడు. గొట్టాములోని వెలుగు ధనధ్రువము వైపు కుంచించుకుంది, ఋణధ్రువము మీద వెలుగు బిళ్ల కూర్చున్నట్లు కనిపించింది, దీనికీ ధనధ్రువపు వెలుగుకీ నడుమ చీకటి వ్యాపించింది. దీనిని ఫారడే చీకటి అన్నారు.

క్రూక్సు ఫారడే వాడుతుగిన పంపులకంటె శక్తివంతమైన పంపులు వాడేడూ, గాలిని ఇంకా తోడేశాడు. ఋణధ్రువపు వెలుగు బిళ్ల ఆ ధ్రువాన్ని విడిచి దూరంగా వచ్చింది, దాని వెనుక ఇంకొక చీకటి— క్రూక్సు చీకటి— పుట్టి పెరిగి, వెలుగుని ధనధ్రువంలోకి కుక్కిపెట్టిందా అనేటట్టుగా గొట్టామంతటా వ్యాపించింది. ధనధ్రువము వెనుక గొట్టపు గోడ ఏదో అదృశ్యదీప్తి పడి నట్టుగా హరితప్రభతో దీపించింది. సూర్యరశ్మిలో పెట్టినప్పుడు ఆ దీప్తిని గ్రహించుకుని, తమ స్వంత దీప్తిని— ఎరుపో, నీలమో, పసుపో, దేనినో దానిని వెలువరించే పదార్థాలు చాలా తెలుసు ఆనాటికి. ఇక్కడ కంటి కగుపడే వెల్తురేదీ గాజు గొట్టము మీద పడుతూ లేకపోయినా వెలుగుతోంది గాజు. కనుక ఋణధ్రువము నుంచి ఏవో కిరణాలు— ఋణధ్రువ కిరణాలు— బయలుదేరి ఎదురుగా వున్న గాజు గొట్టము మీద పడుతున్నాయన్నాడు క్రూక్సు. ఈ కేథోడు— అంటే ఋణధ్రువ— కిరణాలు కణములేనటూ, వాటికి ఋణావేశము ఉన్నదటా (అందుకే అవి ఋణధ్రువము నుంచి వికర్షించబడి వచ్చేశాయిటా), నీళ్ళు పైనుంచి పడుతూ నీటి చక్రాన్ని తిప్పినట్లు ఈ కేథోడు కణాలు, తేలికైన చక్రాన్ని గాజు గొట్టములో అమరిస్తే ఆ చక్రపు ఆకులకు తగిలి త్రిప్పేయుటా, గాలియొక్క విద్యున్నిరోధాన్ని గురించిన ప్రయోగము. కేథోడు కణాల కథకు వచ్చిపడింది! గొట్టములో గాలిని కాక ఏ వాయువుని నింపి ఈ ప్రయోగాన్ని ప్రారంభించినా, అవే గుణాలున్న కేథోడు కణాలు వచ్చాయట.

లెనార్డు అనే జర్మన్ విజ్ఞాని గాజు గొట్టానికి కేథోడు కణాలు తగిలేచోట కన్నము పెట్టి, ఆ కన్నాన్ని పలచని లోహపు రేకుతో మూసి అతికేడు. కేథోడు కణాలకు గొట్టపు ఖైదేల? "బయటికి తెప్పించి చూతాము" అని అతని కోరిక. బయటికి వచ్చిన కేథోడు కణాల తాకిడి ఫలము, గాలి కొద్దిగా దీపించడము. గొట్టానికి కన్నము చిన్నదైనా, లోహపురేకులోంచి చొచ్చుకుని వచ్చిన కేథోడు కణాలు విస్తరించాయిట విసనకర్ర విస్తరించి నట్టు. గాలి కణాలలో ధన—, ఋణ—, కణాలు చేరి జంటకూడి వున్నాయి. కేథోడు కణాలు ఋణ (విద్యుత్) ఆవేశితములు కనుక గాలికణములలోని ఋణావేశిత భాగములచేత వికర్షించబడి విస్తరించాయి అన్నాడు లెనార్డు. అనుకూలమైన పూతపెట్టిన కాగితపు తెరమీద పడి కేథోడు కణాలు ఆ పూతను జిగజిగమనిపించాయిట. ఈ గుణాలన్నిటినీ కనుక్కున్న లెనార్డుకు నోబెలు బహుమాన మిచ్చారు.

వైజ్ఞానిక పరిశోధనల నైజమే ఇంత. 'ఇంటి కొకపూవు'. చివరకు అద్భుతమైన ఫలము ఏదో ఒక వైజ్ఞానికుడి వంతు అవుతుంది. అతని పరిశోధనా ఫలితాలు ఆధారంగా మళ్లీ కొత్త పరిశోధనలు సాగుతాయి. మళ్లీ 'ఇంటి కొకపూవూ—'!

అచ్చే. వాడిని ఎవరూ కొట్టలేరండి—
మా ఆఫీసులో అమ్మాయి కోసం తగిలింది— గ్రంథ
పైన టీ పుస్తకాలున్నాన్న జ్ఞానం లేకుండా
సంతోషపడ్డాడంటాడు



# మీ మొదటి మూడు ఉచిత పుస్తకాలూ ఈ క్రింది వాటినుండి ఎన్నుకోండి!



**F 58**
విరిగిన కలలు
జనమంచి రామకృష్ణ
ఒక కుటుంబం కోరి కన్న వాటిలో విరిగిన కొన్ని కలలను వివరించే విశిష్ట నవల.




**F 59**
విడీవిడని చిక్కులు
వీరాజీ
సంసారంలో పొటమరించి, ఆటుపోటులకు అగ్గలమై, విడీవిడని చిక్కులను చిత్రించే వీరాజీ మరొక నవల.



**F 60**
హుసేన్ సాగర్
శేవనూరి శమంత
హృదయాన్ని కరిగించే శక్తినీ, కరుణను విస్తృతి చేసే ప్రభావాన్నీ హుందాగా, హుషారుగా ప్రదర్శించే ఇంచక్కని కథలు.




**F 61**
రాగంలో రంగులు
అల్లిందల
సరస్వతీదేవి
గృహజీవితంలో వివిధ మట్టాల్లో వ్యక్తమయ్యే స్త్రీల మనఃప్రవృత్తులను వివిధ దృక్పథాల్లో ప్రదర్శించే పన్నెండు పాఠ్యనాటికలు.



**F 62**
అక్షరాల గవాక్షాలు
డా॥
సి. నారాయణరెడ్డి
అకాడమీ అవార్డు అందుకొన్న ఆంధ్రమహాకవి విశ్వవిలోకనాన్ని, విశ్వవిజ్ఞానాన్ని విశదపరిచే అభినవ కవితాసంపుటి.




**F 63**
అర్ధాంగి
ఉన్నవ విజయలక్ష్మి
ఆంధ్ర సచిత్ర వారపత్రికలో అమర్త్య ధారావాహికంగా వెలువడి, విశాలాంధ్రుల శేషాంధ్రులన్ను అలరించిన అద్భుత నవల.

## ఫిబ్రవరి కల్లా చేరితే ప్రత్యేక ఉచిత బహుమతి




బాపూ చిత్రాలంకరణ
సాహిత్య అకాడమీ అవార్డు అందుకొని, రెండో ముద్రణకూ ఎక్కి, అందరినీ ఉబ్బితబ్బిబ్బు చేసి, తరువాయి ముద్రణకూ ఎదురుచూస్తున్న 'అత్తగారి కథలు' నంబర్ వన్‌కు తదనంతర కథలు.

## చందా కట్టే విధానం

1. పైన ఇచ్చిన ఆరు ఉచిత పుస్తకాల జాబితానుంచి మీకు నచ్చిన 3 పుస్తకాలు ఎంచుకొని క్రిందికూపనులో ఆ నంబరు గుర్తుపెట్టండి.
2. పూర్తిచేసిన కూపనూ, మొదటి నెల చందా రూ. 5 లకు మనియార్డరు—రెండూ దిగువ అడ్రసుకు పంపండి.

"ఇంటింటా స్వంతగ్రంథాలయం" ప్రణాళిక,
ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు,
రాష్ట్రపతిరోడ్డు, సికిందరాబాదు.

3. తరువాత నెల నెలా రూ. 5 వంతున ఆయానెల ఆఖరులోగా, చందా మొత్తం రూ. 60 పూర్తి అయేదాకా పై అడ్రసుకు పంపుతూ ఉండాలి.

ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు, రాష్ట్రపతిరోడ్డు, సికిందరాబాదు

అయ్యా, మీ 'ఇంటింటా స్వంతగ్రంథాలయం' ప్రణాళికకు నన్ను ఒక చందాదారుగా చేర్చుకొనగోరుతున్నాను. మొదటి నెల చందా రూ. 5 లూ మనియార్డరు ద్వారా పంపినాను. తొలివిడత ఉచిత పుస్తకాలు మూడూ ఈ క్రింద గుర్తించిన (✓) నంబర్లవి పంపగోరుతున్నాను. మీ నిబంధనలకు బద్ధుణ్ణి. (అక్కరలేని నంబర్లు కొట్టివేయండి.)

నం॥

F 58 F 59 F 60 F 61 F 62 F 63

ఇట్లు

______________

పేరు ........................ తేదీ ____________
చిరునామా ____________________
ఊరు ........................




ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు, రాష్ట్రపతిరోడ్డు, సికిందరాబాదు

“నా హృదయం [illegible] కాదా, మాస్టారూ”

“………………”

“మీరింకా పెళ్లి చేసుకోలేదా మాస్టారూ?”

“………………”

“అయితే నామీద మీకు ఇంకా కోపం తీరలేదన్నమాట……?”

“నువ్వు ప్రవహించిన రక్తం పోయి కొత్త రక్తం వచ్చినా ఎందుకో నేను పెళ్లి చేసుకోలేకపోతున్నాను. బహుశా నేను మనిషి నైనందుకేమో!”

కాంతకిది ఎదురు చూడని సమాధానమేమీ కాదు. రాజు మనసెరిగిన కాంత కావాలని ప్రశ్నించింది కాని, అతన్నుంచి వచ్చే సమాధానం తెలియకనా? ఒకప్పుడైతే అతని మాటలకి తగిన సమాధానం చెప్పి నవ్వించేదే. నేనే గెలిచాను చూడండి మాస్టారు, అని చిరు దరహాసం వలకబోసేదే! అవి పాతరోజులు. ఇప్పుడతని మాటల బరువును మోయలేక కృంగిపోయింది. పెనుగాలిలో చిగురాకులా వణికింది. ఆ తొట్రుపాటు బాహ్యంగా ప్రదర్శించకపోయినా, అద్దంలాంటి ముఖంమీద ప్రతిబింబితమై వుంది. — కంపించే పెదవుల్ని బిగించి, రాజు ముఖంలోకి చూడలేక మొహాన్ని చాటు చేసుకుంది.

రాజు అవకాశాన్ని జారవిడవ దలచలేదు—

“అవును కాంతా, చిరిగిన చొక్కాకు, ఎన్ని మాసికలు వేసినా కొత్తదికాదు. ‘కొత్త చొక్కా’ అని అందిమీద రాసి పెట్టినా కొత్త చొక్కా, కాలేదు.”

కాంత జలనేత్రాలు తళుక్కుమన్నాయి. రాజుకు కనిపించకుండా కన్నీళ్లు తుడుచుకుందామని ప్రయత్నించింది. రాజు ఆమె కళ్లల్లోకే గుచ్చి చూస్తున్నందుకా ప్రయత్నం విఫలమైంది.

“అన్నయ్యా……, రైలు బయలుదేరబోతుంది, ఆయన పిలుస్తున్నారు.”

చెల్లాచెదరైన మనస్సును కూడగట్టుకొని భారతికి సమాధాన మిచ్చాడు రాజు—

“ఆ……, అవును. మరే, రైలు టైము యిందికదూ. ……, వస్తున్నానమ్మా……”

అన్నాడే కాని, అక్కడనుంచి అడుగు కదపలేకపోయాడు.

“అన్నయ్యా……” భారతి తొందర చేసింది.

“చూడు భారతీ……, ఈమె నాకు బొంబాయిలో స్నేహితురాలు……”

“పేరు కాంత. అవునా……?” రాజు వదిలిన వాక్యాన్ని పూరించింది భారతి.

“మా అన్నయ్య మీపేరు ఎప్పుడూ చెప్పకపోయినా మీ ముఖం చూడగానే అలా అనిపించింది, పొరపాటయితే క్షమించండి.” అంది కాంతతో పైగా.

‘ఎంత అసాధ్యురాలు?’ అనుకున్న కాంత—

“మీగురించి నాకు బాగా తెలుసు. మీ అన్నయ్య నాతో చెబుతూ వుండేవారు.” అంది.

“ఆ అన్నయ్య ఎప్పుడో చచ్చిపోయాడు.” అంటూ రాజును చేయిపట్టుకుని గబగబా లాక్కుపోయింది భారతి.

“ఫస్ట్‌క్లాస్ రిజర్వేషన్ లేదండమ్మగారూ….” అని ఎవరో కాంతతో చెబుతున్న మాటలు రాజుకు దూరమైపోయాయి.

చెల్లెలిచేయి విడిపించుకునేందుకు ప్రయ

# తప్పిపోయిన రైలు

## ‘ఆకాశరాజు’



త్నించాడు. కాని, అప్పుడే బయలుదేరబోతున్న రైలు ఆ ప్రయత్నానికి ప్రోత్సాహం ఇవ్వలేక పోయింది.

వాడిపోయిన రాజా మొహాన్ని చూసి అతని బావ అడిగాడు. రాజా మాట్లాడ్లేదు. నిర్జీవంగా అలా చూస్తున్నాడు.

"నన్ను క్షమించన్నయ్యా....."

చెల్లెల్ని క్షమించానన్నట్టుగా రాజా కనురెప్పలు బరువుగా మూశాడు. టపటపా రాలిన కన్నీటిబొట్లు భారతి తలమీద మెరిశాయి.

బావ ఏదో అడగాలనుకున్నాడు. భారతి ముఖంలోని భావాల్ని పసిగట్టి వూరుకున్నాడు.

రైలు పరుగెత్తుతున్నకొద్దీ పట్నవాసపు ఛాయలు అంతకంతకు దూరమై పోతున్నాయి. బరువు బ్రతుకును మోసుకుని రైలు పాతాళంలోకి వెళ్ళిపోతున్నట్టుగా వుంది రాజాకు.

* * *

"మిమ్మల్ని ప్రేమించాను మాస్టారు..... నేనిలా చెప్పడంతో అర్థంలేదు నేనెంతగా ప్రేమించానో మీకూ తెలుసు. కాని........ కాని...... పెళ్ళి చేసుకోలేను.........."

కాంత అన్న ప్రతి అక్షరం రాజాకు గుర్తుంది. ఎన్నటికీ మరచిపోలేని అక్షరాలవి. స్వర్ణాక్షరాలు కాకపోయినా, గుండెల్లో చెక్కిన శిలాక్షరాలు.

"నన్నేంచేద్దామనుకుంటున్నావు?"

"మంచి సంబంధం చూసుకుని మీరు పెళ్ళి చేసుకోండి. నన్ను మరచి పోవద్దు."

"నిన్ను మరచిపోకుండా నన్నెలా పెళ్ళి చేసుకోమంటావు?"

"నన్ను క్షమించండి మాస్టారూ.... నేను అశక్తురాల్ని, నన్ను మన్నించండి ప్లీజ్..."

రాజా గుండెల్ని తడిపిన కన్నీళ్ళు అతని గుండెల్లో శిలాక్షరాలని చెరపేందుకు వృధా యత్నం చేశాయి.

గుండెను పిండిన మాటలు రాజా కళ్ళల్లో రక్తం స్రవింపజేశాయి.

"ప్లీజ్.... మీరలా కన్నీరు పెట్టకండిమాస్టారూ మీనాన్నగారు పోయినప్పుడు కూడా మీరు ఏడవలేదు. అటువంటిది........ ఇప్పుడు......"

"ఆమాత్రం గ్రహించుకుంటే ధన్యుడినే కాంతా! వెళ్ళు. నువ్వైనా సుఖంగా వుండు."

"వెళ్ళమంటారా?"

"అవును."

"నన్నుండమనే వాళ్ళెవరూ లేనేలేరు." భోరుమని ఏడ్చింది కాంత.

ఆ ఏడుపు రాజా హృదయాన్ని కరిగించినా ప్రయోజనం లేదు.

"నన్నేడవద్దని నువ్వెందుకలా అయిపోవాలి? వెళ్ళు కాంతా, ఒక్కటి మాత్రం గుర్తుంచుకో. నేను నీకూడానే వస్తాను ....... నేను నీకూడానే వస్తాను."

చివరివాక్యం కాంతకు అర్థమైందో లేదోగాని పరీక్షగా చూసింది.

ఇది, సంవత్సరకాలంపాటు అత్యంత సన్నిహితమైన స్నేహం తర్వాత విడిపడే రోజున జరిగిన ఆఖరి సంభాషణ.

కాంత తన నుంచి దూరమవుతుందని తలచుకున్నప్పుడు హృదయం స్పందించడం మానేసింది. కళ్ళు నీళ్ళతోనిండి దృష్టిని కనిపించనివ్వలేదు. రక్తం వేడెక్కి చెవులకు తన్ని బిరడా కొట్టేసింది. సర్వేంద్రియాలు చలన రహితమై పోయాయి.

'కాంతకు తెలుసు. తెలిసే ఇంతటి సాహసానికి తలపడుతుందంటే, ఎక్కడో ఏదో లోపం జరిగింది. ఏదో పెద్ద విపత్తు సృష్టించబడివుంది. లేకపోతే కాంత నానుంచి వేరుకాదు. కారణం ఎందుకు చెప్పలేకపోయింది? ఎందుకంత అసమర్థురాలై పోయింది కాంత? నన్ను రెచ్చగొట్టింది ఎందుకు? నాలో ఆశలు రేపిందెందుకు? నట్టేట ముంచి నానుంచి దూరంగా ఎందుకు తప్పుకుంటూ వుంది? ఎందుకిలా చేసింది?'

రాజా, తెలిసీ ఎవరికీ ద్రోహం చేయలేదు. అయినా ఇదో కుట్ర అనుకున్నాడు. అందరూ కలిసి తన్ను వ్యూహంలో యిరికించినట్టనిపించింది. మహత్తర శక్తి ప్రమేయమేదో కాంత ఎడబాటులో కనిపించింది. కాంత తనకు అన్యాయం చేసింది, క్షమించరాని తప్పిదం చేసింది. ఇది భరించరాని నేరం...........

'నానుంచి ఒక్క క్షణం ఎడబాటును సహించలేని నా కాంత ఇలా చేస్తుందా?' అని కుమిలిపోయాడు.

అతనికి సమాధానం లేదు. దేనికీ సమాధానం లేదు. కాంత పెళ్ళయిపోయింది అత్తవారింటికి వెళ్ళిపోయింది. ఆమె వెళ్ళినరోజే మాట నిలబెట్టుకుందామనుకున్నాడు రాజా. 'నేను నీకూడా వస్తానని' మాటిచ్చాడు. అంచేత అంతర్థానమై ఆమెను వెంటాడాలనుకున్నాడు.

పాడు ప్రపంచం దేనికీ స్వతంత్రం లేదు. చద్దామనుకున్నా చావనివ్వదు. మీ ప్రాణ స్నేహితులమోయ్...... నిన్నెలా చావనిస్తాము? అంటూ నడుంకట్టుకు వచ్చారు, ఎప్పుడూ రాని ప్రాణ రక్షకులు! వాళ్ళ చేతుల్లో తన ప్రాణాలు లేచి నుంచున్నాయి.

వంచితుడుగా మిగిలిపోయాడు రాజా. సర్వ విధాలా మోసగింపబడ్డవాడుగా మిగిలిపోయాడు. మృత్యువు కూడా అతన్ని అసహ్యించుకుంది. స్వీకరించలేక పోయింది. బ్రతుకుమీద ఆశవున్నవాళ్ళంతా ఆత్మహత్య మహా పాతకమనే అంటారు. మళ్లీ బ్రతికిం తర్వాత బరువు వాళ్ళకేం తెలుస్తుంది? ఎవళ్ళ మట్టుకు వాళ్ళు 'హమ్మయ్య' అనుకొని చేతులు దులుపుకుపోయారు. అక్కడితో వాళ్ళ పనై పోయింది.

"మమ్మల్నందర్నీ ఏం చేద్దామనుకున్నావు? మాకంటే 'అది' ముఖ్యమై పోయిందా?" అంది భారతి కళ్ళల్లో నీళ్ళు నింపుకుని.

భారతికి ఏ ఒక్కనాడూ సమాధాన మివ్వలేదు రాజా. భారతి ఒక్కగానొక్క చెల్లెలు. ఆమెకు తెలుసు అన్నయ్య ఆంతర్యం. మనుషుల్ని చూడగానే వాళ్ల వాళ్ల గోత్రాలు యిట్టె చదివేసే శక్తి ఆమెకుంది. అంత తెలివితేటలు భారతి కెలా వచ్చాయో రాజాకే కాదు, వాళ్ళమ్మకూ తెలియదు.

నీ కోసమే బ్రతికాను కాబోలు అనుకున్నాడు రాజా ఆనాడు. బ్రతికిన్నాడు.

ఆతర్వాత పరిసరాలన్నీ కాంతను గుర్తు చేసేవిగా కనిపించాయి. చచ్చి బ్రతికేప్పుడు కూడా అంత బాధనిపించలేదు. కోలుకున్న తర్వాత స్మృతులు గుండెల్లో సూదులుచ్చుకొని పొడిచాయి.

"నువ్విక్కడుండొద్దన్నయ్యా, మనూరు పోదాం. అక్కడే ఏదో ఉద్యోగం చూసుకోవచ్చు."

భారతి యదార్థరహితమైన బోధన చేయదు. ఒక స్థిరనిర్ణయానికి, అంగీకారానికి వచ్చేనేగాని అలాంటి ప్రస్తావన లేదు.

రాజా మౌనం రాజమండ్రికి తీసుకొచ్చింది.

అక్కడికి చేరిన కొన్నాళ్ళకే ఒక వుత్తరమొచ్చింది. దాన్ని భారతి రాజాకందించింది. రాజా ఉత్తరాన్ని చదువుతున్నపుడు, భారతి అతని భావాల్ని చదువుతున్నది. రాజా మూడురోజుల దాకా ఆహారం ముట్టలేదు. అది లగాయతు అలాంటి వుత్తరం మరేదీ రాజాకు అందలేదు.

ఒకరోజు చెల్లెల్ని పిలుస్తూ, ఆమె గదిలోకి వెళ్ళాడు. భారతి అక్కడలేదు. ఏదో పనిలో నిమగ్నమైపోయి వుండి వుంటుంది. పెట్టె ఒకటి తెరిచి పెట్టి వుంది. కొన్ని బట్టలు, నగలు ప్రక్కనే వున్నాయి. 'బొత్తిగా అజాగ్రత్త మనుషులు' అనుకుంటూ వాటిని పెట్టెలో పెట్టాడు. క్రింద కొన్ని ఉత్తరాలు కనిపించాయి. చేతులోకి తీసుకుచూశాడు. అవి తనవే. కాంత రాసినవి. ఒక్కో వుత్తరం చదువుకున్నాడు.

"మీరంత ఘోరానికి తలపెట్టారని తెలిసి, పెళ్ళినాటి రాత్రి నూతిలో దూకుదామనుకున్నాను..."

"కేవలం నా అసమర్థతే మన వేర్పాటుకు కారణం. అన్నీ వున్న నా జీవితానికి శాంతి, సుఖం లేదు."

"..కులాంతర వివాహం తర్వాతి మన భవిష్యత్తునూహించుకునే తల్లిదండ్రులకి తలొగ్గాను. కాని..."

"తల్లిదండ్రుల్ని ఎదిరించలేక పోయాను.మిమ్మల్ని దూరం చేసుకున్నాను. ఫలితాన్ని అనుభవిస్తున్నా లెండి ."

"మా శ్రీవారితో పాటు నేనూ మద్రాసు మకాం మారుస్తున్నాను..."

"బ్రతుకునిండా ముళ్ళడొంకలు, తప్పించుకుందామన్నా గుచ్చుకుంటున్నాయి."

"ఈమధ్య శ్రీవారు ఏదో పసిగట్టారు. సాధింపుతో చచ్చిపోతున్నాను.."

"ఆత్మవంచన చేసుకొని మీకు అన్యాయం తలపెట్టాను. దేవుడు కూడా నన్ను క్షమించడు."

"బ్రతుకు నరకంగా తయారవుతూ వుంది. చేసుకున్న దానికి విచారిస్తున్నాను. నాకీ శిక్ష సరిపోదు."

"మీరు నన్ను క్షమించలేదు. అందుకే నాకు జవాబివ్వాలని అనుకోవడంలేదు. నేను మాత్రం రాయడం మానను."

కాంత ఒక్కో ఉత్తరంలోను, ఒక్కో జీవితం కనిపించింది. వాటిని జేబులో పెట్టుకున్నాడు.

ఎప్పుడూ లేని అన్నయ్య కోపాన్ని ఎదుర్కొన్నది భారతి. భారతిని క్షమించలేకపోయాడు రాజా.

ఉద్యోగం కోసం ఎన్నో ప్రయత్నాలు చేశాడేగాని లాభం కనిపించలేదు. పత్రికలో ఒక ప్రకటన చూశాడు. అందుకు కావలసిన యోగ్యతలన్నీ అతనికున్నాయి. అచ్చం తన కోసమే ఆ ప్రకటన వేయబడిందన్నట్టు సంతోషించాడు. దానికో దరఖాస్తు పారేస్తే, అనుకున్నట్టుగానే మూడోనాటికి, ఉద్యోగముంది రమ్మంటూ జాబొచ్చింది.

అదృష్టానికి మురిసిపోయాడు.

# తప్పిపోయిన రైలు

రాజా మద్రాసు వెళ్ళడం భారతికి ఇష్టంలేదు. ఒక యింటివాడిని చేయాలని ఆమె ఆరాటపడుతున్నది. ఇప్పుడు రాజా భారతిని లక్ష్యపెట్టే వైఖరి కనిపించడంలేదు. అందుకే ఆమె మౌనం వహించింది.

చెల్లెలి మౌనం కోసమే ఎదురు చూశాడు రాజా. అసరా దొరగ్గానే మద్రాసు వచ్చేసి ఉద్యోగంలో చేరాడు. చక్కని ఉద్యోగం. పనితనం చూపించి అభివృద్ధిలోకి రాగల అవకాశమున్న ఉద్యోగం. అందులోను, అతని అభిరుచికి తగిన దవడంతో కొద్ది కాలంలోనే ప్రమోషన్ వచ్చింది.

కీడు జరిగితే, తెలియక చేసిందానికి శిక్ష అనుకునేవాడు. మేలు జరిగితే, ఎవరో అసరాగా నిలబడి తనను గట్టెక్కిస్తున్నాడు అనుకుంటూ వుండేవాడు రాజా. స్వయం కృషితో పైకి వచ్చినా, వాదంలేదు అదంతా ఎవరో శ్రేయోభిలాషులు చేస్తున్నారు అనుకునేవాడు. అతనికి స్వయం ప్రతిభ మీద నమ్మకం సడలిపోయింది. అలాగని ఒకళ్ళ మీద ఆధారపడడమూ లేదు. తనకు తానుగానే వుంటూ ఇతరుల్ని చూసి నేర్చుకునే విద్యార్థిగా వుంటున్నాడు. అతని దిప్పుడు సరికొత్త జీవితం.

మద్రాసు వచ్చినప్పటి నుంచి కాంత ఉత్తరాలు కట్టడిపోయినయ్. బంగారు భవిష్యత్తు నూహించుకున్న కాంత సిమెంటు రోడ్డు విడిచి, కాకే తారు రోడ్డు మీద నడిచి, కత్తుల్లాంటి కంకర మీద నుంచి ముళ్ళ పొదల్లోకి అడుగెడుతున్నట్లు ఆమె ఉత్తరాలు చెప్పాయి. ఇప్పుడెలా వుందో ఏమిటో? అనుకునేవాడు.

మద్రాసు వచ్చిన కొత్తల్లో ఆమె కోసం చాలా వాకబు చేశాడు. ఫలితం శూన్యం. ఎక్కడైనా కనిపిస్తుందేమోననే ఆశ మాత్రం పోలేదు. కళ్ళు ఇంతింతలు చేసుకుని గొప్పెట్టేవరకూ వెదికాడు. ఈ అన్వేషణలో అతనికి ఒక వింత అనుభూతి కూడా లభిస్తూ వుండేది. ఒక్కోసారి అతను తనకు పిచ్చి పట్టిందేమో అనుకునేవాడు. భయం వేసేది. పిచ్చివాళ్ళకు విరివిగా దానం చేయడం మొదలెట్టాడు. మళ్ళీ లోతుగా నవ్వుకునేవాడు. కర్తవ్యం గుర్తు చేస్తున్నపుడు ఆఫీసులో అన్నీ మరచిపోతూ వుండేవాడు. ఆ తర్వాత మళ్ళీ యధాకార్యక్రమమైన అన్వేషణ. ఉదయం లేస్తూనే ఇవాళ కాంత కనిపిస్తుందని ఆశగా లేచేవాడు. రాత్రి పడుకుంటూ ఇంకా రేపుందిగా, అనే దురాశతో నిద్రించేవాడు. అందులో విసుగూ విరామమూ లేదు. దినచర్య అయిపోయింది.

కంపెనీ అధికారుల వ్యక్తిగతమైన చర్చ సహా ఉద్యోగుల్లో చాలసార్లు వచ్చింది. యజమాన్లు పనివాళ్ళ నిశిత విమర్శకు తీవ్రంగా గురవుతూ వుండేవారు. నిత్యమూ వినలేకపోయాడు రాజా. 'మనకు బ్రతుకు కావాలి, యజమాన్లకు పని కావాలి. అనవసరమైన చర్చ నాగరికత అనిపించుకోదు' అన్నాడొకసారి. ఆ మందలింపుకు అందరూ అతని వైపు బుస్సుమని చూశారు. కాని, వాళ్ళకంటే కొంచెం పై హోదాలో వున్నాడు గనక ఉబికిన ఉక్రోషాన్ని యిమిడ్చుకొని గుటకలుగా మింగారు. ఆపిమ్మట రాజెదురుగా అటువంటి ప్రస్తావన రాలేదు.

"ఫలితం విషయంలో అన్ని తలనొప్పి బిళ్లలూ ఒకటే"
అని విచారనుకొంటుంటే



వాడి చూడండి!




స్క్విబ్ తయారీ

# అవెదన్®

అద్భుతమగు 'ఎపెప్'తో కూడిన బిళ్లలు! శీఘ్రమైన, నిరపాయమైన, నిశ్చయమైన బాధా నివారణకు!




'ఎపెప్'తో కూడిన అవెదన్ నిమిషాలలో పనిచేయును....విశ్రాంతి గంటలకొలది వుంచును!

తల నొప్పి, పంటి నొప్పి, నడ్డి నొప్పి, కండరముల నొప్పి, జలుబు, ఫ్లూ, [illegible] బాధగానుండు రోజులలో వాడుటకు [illegible] అస్వస్థతలకు—అవెదన్

SQUIBB® సారాభాయి కెమికల్స్

® ఇ. ఆర్. స్క్విబ్ అండ్ సన్స్ ఇన్‌కార్పొరేటెడ్ వారి రిజిస్టర్డ్ ట్రేడ్ మార్కు చిహ్నం; దీని లైసెన్సు ఉపయోగదారులు [illegible] ప్రయివేట్ లిమిటెడ్.

Shilpi SC 33A-Tel

యజమానిగా వ్యవహరించడం మాత్రం అతని చేత కాలేదు.

'యజమాని, భార్యకు విడాకులిచ్చి పంపేసి ఆమె చెల్లెల్ని (ప్రాణ స్నేహితురాల్ని) కట్టుకున్నాడు.'

ఇవి వాళ్ళ వర్గాల్లో సిద్ధాంతం.

ఎక్కడిలా పోతే వీళ్ళ కెందుకు తమ పనేదో తాము చేసుకుపోక? అనుకునేవాడు రాజా. అతను వాళ్ళకు

# తప్పిపోయిన రైలు

గుణపాఠం చెప్పలేదు కదా! అందుకే తనుని తాను చేసుకుపోతూ వుండేవాడు.

భారతి మద్రాసు వస్తున్నదని రాసినప్పుడు రాజా ఎంతో సంతోషించాడు. సెలవు పెట్టి తనతో





ఇంటికి రమ్మన్నప్పుడు ఆశ్చర్యపోయాడు. ఇప్పటిది ఒకవంతం చేసినప్పుడు బాధపడ్డాడు. చెల్లెలికీ ఏ కష్టం కలిగించకూడదని ఎప్పుడో నిశ్చయించుకున్నాడు. ఆమె వెంట తనుండేటందుకని సెలవు పెట్టాడు. ఆవేశం వెంటనే లభించలేదు. కారణం 'స్పెసిఫిక్'గా రాయాలని యజమాని ఉత్తరువు. తనకో బంధువుగా చూస్తున్న, వారికి తను రాశాడు. 'తల్లికి జబ్బుగా వుంది, చెల్లెలు తను కెళ్ళడానికి వచ్చిందని' భారతి చెప్పినట్టుగానే, వ్యక్తిగతంగా కొంచెం వివరంగా రాశాడు. అందులో అబద్ధం లేదు. తల్లికి ఎప్పుడూ ఏదో ఒక జబ్బు వుంటూనే వుంటుంది. ఆ వేసంతో సెలవు తీసుకోవడం ఇష్టం లేకపోయినా, సెలవు వెంటనే మంజూరు కావడంచేత తన క్రింద ఉద్యోగికి బరువు బాధ్యతలప్పగించి బయలుదేరాడు.

స్టేషన్లో కాంతను అకస్మాత్తుగా చూసినప్పుడు అపస్మారకం కల్గుతుందేమోనను కున్నాడు. చూసి ప్రత్యక్షమైనంత అవాస్తవిక స్థితిని అతననుభవించాడు. నిలదొక్కుకున్నాడు. దూరంగా నిలబడి తనవేపే కళ్ళార్పకుండా సజల నేత్రాల్తో చూస్తున్న కాంత దగ్గరకి వెళ్ళాడు. తనూ అదే రైలుకో వస్తున్నానంది కాంత. 'టిక్కెట్ రిజర్వేషన్ కోసం పంపాను' అంది. కాని..

స్టేషన్లో జరిగిన సంభాషణ చెవుల్లో గింగుర్లు పెడుతుంది.

"మీరింకా పెళ్ళి చేసుకోలేదా మాస్టారూ?"
ఎంత ఆశన?

ఎక్కడికి వెళ్తుందో అడగలేదు. వాళ్ళాయన కూడా వస్తున్నాడా అని అడగలేదు. ఎక్కడుంటున్నారో అడగలేదు. వాళ్ళాయన ఏం చేస్తున్నారో అడగలేదు. ఉత్తరాలు ఇంకా రాస్తున్నావా అని అడగలేదు. జీవితం ఎలా సాగుతుందో తెలుసుకోలేదు. ఇంకా ఇంకా ఎన్నెన్నో అడగాలని ఎన్నాళ్ళనుంచో అనుకుంటున్నాడు. అన్నీ ప్రశ్నలుగానే వుండిపోయాయి. తన చుట్టూ సాలెగూడల్లె వేలవట్టే చేసినయ్. అవకాశం చిక్కినప్పుడు సమయం అడ్డొచ్చింది. మళ్ళీ ఎప్పుడో?

మొహాన్ని చేతులో కప్పుకున్న రాజాను చూసి భారతి బెంగటిల్లిపోయింది. అతనికి ఎన్నోవిధాలుగా నచ్చచెప్పజూసింది. వూరడించలేకపోయింది. ఆమె భర్త, రాజాలో కాగిత విపరీత పరిణామానికి విస్తుపోతున్నాడు. కాని ఏమీ అడగలేకపోతున్నాడు. మాట్లాడకుండా పేపరు అడ్డు పెట్టుకుని ఆలోచిస్తూ కూర్చున్నాడు.

"అన్నయ్యా... ఆమెకు పెళ్ళయిపోయింది. ఇప్పుడామె ఒకరి పెళ్ళాం.."

ఈ మాటలు రాజాలో బాగా పని చేశాయి. కాంత ఇప్పుడు మరొకరిది. తన నుంచి ఎప్పుడో వెళ్ళిపోయింది. ఆమె గురించి ఆలోచించడం జ్ఞానరహితమైన పని. పరాయి స్త్రీ గురించి వూహించుకుంటున్నాననుకున్నప్పుడు అతని మనస్సు రెక్కలు తెగిన పక్షిలా విలవిల్లాడింది. కాంత పరాయి స్త్రీలా కనిపించలేదు అతనికి. పూర్వం ఎలా వుండో అలాగే కనిపించింది. పూర్వం తన కోసం ఎంతగా పలవరించేదో, అంత

తోసిన ఆమెతో ఇప్పుడూ కనిపించింది. ఆమె పేరాయిది కాదు. ఆమె ఎప్పుడూ తనదే అనుకుని, చింతించాడు.

మనసు నిగ్రహించుకోలేని అశక్తతకు తనను తానే నిందించుకుని, మనసును మళ్లించుకుందామని వృథాప్రయత్నం చేశాడు.

అన్నయ్య అంతరంగ మెరిగిన భారతికి అతన్ని మామూలుగా చేసేందుకు, ఇప్పుడు కొంచెం ఎక్కువ శ్రమ కలిగినా, కృతకృత్యురాలవగల్గింది.

ఇంటికి వచ్చినదాదిగా వెళ్ళిపోతానంటూ మొదలు పెట్టాడు రాజా.

"వచ్చి రెండురోజులన్నా కాలేదు, పదిరోజులు కదా సెలవుపెట్టింది, వెళ్ళడానికి వీల్లేద"ని బంధువర్గమంతా పట్టుబట్టారు. మరో రెండురోజులు ముళ్ళ మీద నుంచున్నాడు రాజా.

ఆ ముళ్ళ మీద నిలబడ్డ రోజుల్లో, వూళ్లో అమ్మాయి లందరూ అతనికి చూపించబడ్డారు. పరాయి వూళ్లోవాళ్ళు కూడా రావింపబడ్డారు. ఈ 'ఫేషన్ షో' అతనికి సుతరామూ యిష్టంలేదు. భారతి ఇదంతా చేస్తూ వుంది.

ఎప్పుడెళ్ళి మద్రాసులో పడిపోదునా అనుకుంటున్న రాజాకు అక్కడి వాళ్ళ పనులేమీ రుచించడంలేదు. ఘోనుతో మంచి బయట పడేందుకు తపిస్తున్నాడు.

భారతిది పట్టువిడిచే తత్వంకాదు. 'ఎలాగైనా సరే పెళ్లి చేసుకుతీరాల్సిందే' అంది. తల్లి సరేసరి, ప్రాణత్యాగం చేసుకుంటానంటూ కూర్చుంది.

కాంత కూడా తన్ను పెళ్లి చేసుకోమనే అన్నది. 'మంచి సంబంధం చూసుకుని మీరు పెళ్ళి చేసుకోండి మాస్టారూ...' అంది. 'నన్ను మరిచిపోవద్దు మాస్టారూ' అనికూడా అన్నది.

"నువ్వు చచ్చిపోతానన్నా 'అది' లెక్కచేయలేదు, ఆడదైతే అలా చేయదు. అదో రాయి" పాటి స్త్రీగా చెల్లెలి ఉపదేశం అతన్ని చలనరహితుణ్ని చేసింది. మొండి ధైర్యం అవహింపజేసింది. బంధుపాశంతో బ్రతుకు వోడిపోయింది.

అతని ప్రమేయం లేకుండానే, ఒక అందగత్తెను చూసి ముహూర్తం పెట్టేయించింది భారతి. ఘనంగా పెళ్ళి జరిపించేసింది.

రాజా బండ తగిలించుకోవడంతో బంధువర్గమంతా గుండెల మీద చేయి వేసుకున్నారు. ఈనాటికి కొడుకు ఒక యింటివాడైనాడని అతని గళాన్ని తలుచుకున్న తల్లి ఆనందభాష్పాలు రాల్చింది. ఇప్పుడతను ఎక్కడ ఎలా వున్నా ఆమెకు ఫరవాలేదు. అతన్ని కంటికి రెప్పలా చూసుకోడానికి భార్య వున్నది, అనుకుని ఆనందించింది.

అక్కడ ఇల్లు చూసుకొని, మళ్లీ వచ్చి భార్యను తీసుకువెడతానన్నాడు రాజా. భారతి నసే మిరా కూడాబెట్టు కెళ్లాల్సిందే అంది. అతనెన్ని చెప్పినా విన్లేదు.

సెలవు పూర్తవగానే ఆఫీసులో అడుగెట్టి పిడుగు లాంటి వార్తను విన్నాడు రాజా.

'కంపెనీ యజమానురాలు యాక్సిడెంట్‌లో చచ్చిపోయారని.'

"మీరు శుభలేఖలు పంపించారు చూడండి, బహుశా మీ పెళ్లి అదే రోజ ననుకుంటా..."

వార్త వినిపించిన వాడి వ్యంగ్యానికి మనసులోనే తిట్టుకున్నాడు. ఆమె చచ్చిపోతే చచ్చిపోయింది, ఆ చావులో తన పెళ్ళిని కలపడమెందుకని విసుక్కున్నాడు. అస్వస్థతగా కాలు గాలిన పిల్లిలా తిరుగాడాడు.

ఆమె గురించి ఇదివరలో విన్న దానికన్నా, ఆరోజు వింత వింత కథలు తెలిశాయి. వాటిలో ఎంతవరకూ నిజానిజాలో భగవంతుడికే తెలియాలి. 'చచ్చిపోయినామె ఆత్మశాంతి కోసమైనా వీళ్ళు నోరు మూసుకుంటే బావుణ్ణు' అనుకున్నాడు.

కంపెనీ వ్యవహారాలు చూస్తున్న వారిలో ప్రథముడు రాజే గనక, లాయరుగారి ఆహ్వానాన్ని మన్నించి ఆయన ఇంటికి వెళ్ళాడు.

"మీ నడవడి, పనితనము అమ్మగార్ని బాగా మెప్పించాయి. అందుకే మీరు వృద్ధిలోకి వచ్చారు. మీ గురించి అప్పుడపుడు నాతో చెప్పేవారు కూడాను.' అన్నాడు లాయరు.

ఆమె అభిమానానికి రాజా కళ్లల్లో నీళ్ళు నిండాయి. అంత మంచి తల్లిని చూడలేకపోయానే అని చింతించాడు.

"చూడండి, ఈ కాయితాలు మీ చేతుల్లో పెట్టడం నా విధి." కొన్ని కాయితాలు రాజా చేతుల్లో పెట్టాడు.

"ఇవి చాలాకాలమై వ్రాయబడ్డాయి. ఇవే ఈమధ్యన రాయబడి వుంటే చాలా గొడవ వచ్చి వుండేది." అని సంభాషణ పొడిగించాడు లాయరు.

"ఆ.. మరచిపోయాను, వారు చచ్చిపోయే ముందు మీకీ కవర్ని రహస్యంగా అందజేయమని అమ్మగారి సెలవు." అని అంటూ అతనికో కవరు అందించాడు.

యాంత్రికంగా, అనిమిత్తంగా దస్తావేజుల్ని తిరగేసిన రాజాకు మతిపోయింది. వాస్తవమేదో అవాస్తవమేదో అతనికి తెలియడంలేదు. కని గుడ్డి, విని చెవుడుగా అయింది అతని పరిస్థితి.

"నేనిది నమ్మను..." అని గట్టిగా అరిచాడు.

"నేను అమ్మగారి లాయర్ని. ప్రత్యక్ష సాక్ష్యాన్ని. నమ్మించడం నా వంతు." అన్నాడు లాయరు అతని పరిస్థితి నవలోకించి.

ఇంతటి మహోదార్యమైన ఆ దేవతని చూడాలని పరితపించాడు.

"నాకామెను చూపించండి, ఆమెను చూపించండి" అని అర్థించాడు.

"ఆమె చచ్చిపోయి చాల రోజులైంది."

"అవును.. ఆమె చచ్చిపోయింది.. చాల రోజులైంది.." గొణుక్కున్నాడు రాజా.

"పోనీ ఆమెదేదైనా ఫోటో చూపించండి, ఆ అమ్మకు నేను మొక్కుకోవాలి... ప్లీజ్..."

"అటువంటివి ఇక్కడేమి ఉన్నట్టు లేదు. ఆమెకు ఫోటోలు దాచుకోవడం లాంటి అభిలాష ఏంలేదు. నా అశక్తతకు మన్నించండి."

జుట్టు పీక్కున్నాడు రాజా. పిచ్చెత్తినట్టుగా చేతులో కాయితాల్ని విసిరి కొట్టేశాడు.

రాజా నా పరిస్థితిలో వుంచి లాయరు బయటికి నడిచాడు. బహుశా డాక్టర్ని తీసుకురావడానికై వుంటుంది!

ప్రక్కనే బల్ల మీద వడ్డ కవరు ఫేన్ గాలికి రెపరెపలాడింది. తిరిగి రాజా వళ్లోపడింది.

ఏదో స్ఫురించినట్టుగా దాన్ని చటుక్కున చేతులోకి తీసుకున్నాడు. పర్రున చించి చదవడం మొదలెట్టాడు—

"మాస్టారూ...

మన విషయం తెలిసిన నా ఆయన నాకు విడాకులిచ్చారు. స్వార్థంతోనే మిమ్మల్ని మద్రాసుకు రప్పించాను. నేను చేస్తున్న కంపెనీ నాదని తెలిసినప్పుడు మీరు నాకెక్కడ దూరమైపోతారోనని భయపడ్డాను. నేనెన్ని వుత్తరాలు రాసినా సమాధానమివ్వని మీరు నన్ను క్షమించరని తెలుసు. మీ కోసమే నేను స్టేషనుకు వచ్చాను. నేనూ మీతో వచ్చేదాన్నే.. రైలు తప్పిపోయింది. మీ శుభలేఖ నా జీవితానికి మంగళ గీతం పాడుతుందనుకున్నాను మాస్టారూ...? ఈ ఆస్తిని స్వీకరించి నాకు శాంతిని ప్రసాదించండి. నేనెక్కడున్నా మీ దానినే. నన్ను క్షమించరూ.. ?

మీకు కాని మీ

'కాంత'

"కాంతా.." అన్న రాజా పిచ్చి కేకకు ఇల్లంతా అదిరింది. ●

---





# సరసమైన ధరకు స్థాపితమైన రకపు ఉక్కు

టాటా స్టాక్ యార్డ్ నుండి మీకు కావలసిన కంట్రోల్డ్ మరియు డీ కంట్రోల్డ్ ఉక్కు సరకు కొనునప్పుడు సరసమైన ధరకు మీ పనికి కచ్చితముగా సరిపోవు స్థాపితమైన రకపు ఉక్కు లభించును. ప్రతి అవస్థయందు శాస్త్రీయ పద్ధతులలో నిపుణులచేత పరిశీలించబడి ఉత్పత్తి చేయబడునది యీ ఉక్కు.

అంతేకాక మీకు లభించునది మరికొంత....ఉక్కును వుపయోగించినప్పుడు మీకు కలుగు సమస్యలను పరిష్కరించుటకు టెక్నికల్ విషయాలలో (మీకు అవసరమైనప్పుడు) వుచితముగా సలహాలు, సహాయము ఇవ్వబడును.

టాటా స్టీల్ వారి సరకొందు బ్రాంచ్ ఆఫీసుల వర్గము, యీ పరిశ్రమలోనున్న అన్ని వర్గములకంటెను విస్తారమైనది. సర్వ సమానముగా ఖాతాదారులకు మర్యాదగా సేవచేయుటకు తోడ్పడుచున్నది. ఈ మర్యాద, నిష్పక్షపాతములతో కూడిన సేవ మొదటినుండి, అనగా గత అర్ధ శతాబ్దమునుండి, కంపెనీవారు అనుసరించు నీతి సూత్రము.

*మీకు కావలసిన ఉక్కు సరకులకు మీ సమీపమందున్న మా బ్రాంచ్‌కి దయచేయుడు*

## ది టాటా ఐరన్ అండ్ స్టీల్ కంపెని లిమిటెడ్

హెడ్ సేల్స్ ఆఫీసు : [illegible], నేతాజీ సుభాష్ రోడ్డు, కలకత్తా 1

(బ్రాంచిలు)

1/88 ఆర్మేనియన్ స్ట్రీట్
మద్రాసు

133 సరోజినీదేవి రోడ్డు
సికందరాబాద్

20-J మహాత్మా గాంధీ రోడ్డు
బెంగళూరు

ఆంధ్రా బ్యాంకు బిల్డింగ్స్ (3rd ఫ్లోర్)
రాజా రంగయ్యప్పారావు స్ట్రీట్
విజయవాడ

మినర్వా బిల్డింగ్
మహాత్మా గాంధీ రోడ్డు
ఎర్నాకులం.

TN 3519

గండుతుమ్మెద......

(క) ఢిల్లీనుంచి ఆగ్రాకి 120 మైళ్ల దూరం వుంది. వీటి మధ్య జంట రైలు మార్గం వేశారు. ఒకరోజున ఏక సమయంలో రెండు రైళ్ళు— ఢిల్లీలో ఒకటి, ఆగ్రాలో ఒకటి— ఎదురెదురుగా బయలుదేరేయి. అవి గంటకి 40 మైళ్ళ వేగంతో ప్రయాణం చేస్తున్నాయి.

ఇది ఇల్లా ఉండగా ముకుళితపద్మంలో చిక్కుకు పోయిన ప్రియురాలి వియోగంతో పిచ్చి ఎక్కిన గండు తుమ్మెద ఒకటి ఆగ్రాలో ఉంది. అది దారీ తెన్నూ గానక రైల్వేస్టేషనుకి వచ్చింది. స్టేషనులో అప్పుడే బయలుదేరి ఢిల్లీ వెడుతూ పెద్దగా గీ పెట్టిన రైలు ఇంజను మోతకి భయపడి, ఆ




గండు తుమ్మెద ఢిల్లీవైపుగా గంటకు 60 మైళ్ల వేగంతో ఎగురసాగింది. కొంతదూరం వెళ్లేసరికి ఢిల్లీనుంచి ఆగ్రా వెడుతున్న రైలుకి తగిలి, భయపడి, వెనుదిరిగి, మళ్లీ ఆగ్రా వైపుగా ఎగిరింది. కొంతదూరం వెళ్లేసరికి ఆగ్రా రైలుకి తగిలి భయపడి, వెనుదిరిగి, ఢిల్లీవైపు ఎగిరింది. ఈవిధంగా అంతకంతకు దగ్గరగా వచ్చేస్తున్న ఆ రైలు ఇంజనుల మధ్య అటూ ఇటూ గంటకు 60 మైళ్ల వేగంతో ఎగురసాగింది. ఆఖరికి ఆ రైళ్ల మధ్యలో కలుసుకున్నాయి. దగ్గరగా వచ్చేసిన ఆ రెండురైళ్లను చూసి, భయంవల్ల గుండె ఆగి, గండుతుమ్మెద నేల రాలిపోయింది.

మొత్తంమీద ఆ తుమ్మెద ఎంత దూరం ఎగిరింది?




సరాసరివేగం, కాలం, దూరం లెక్కలు చేయుడంలో చాలామంది పప్పులో కాలువేస్తూ ఉంటారు. చూడడానికి ఈ లెక్కలు చాలా సులభం అనుకుంటారు. లెక్క నోటిని కట్టవచ్చు ననుకుంటారు. కాని, తీరా చూడబోతే ముళ్ల దొంకలా తయారవుతుంది. ఉదాహరణకి ఒక సమస్య చూద్దాం.

అన్నవరం, కూనవరం అనే రెండు వూళ్ల మధ్య ఒక చిన్న కొండ వుంది. ఒక వూరి నుంచి రెండో వూరికి వెళ్లాలంటే, ఆ కొండ ఎక్కి, దిగి వెళ్లాలి. చక్కని సిమెంటు రోడ్డు వుంది పైకీ, క్రిందకీ. రోడ్డు వెంట దూరం కొలిస్తే సరిగ్గా

# మెదడుకి మేత



డాక్టర్ మహీధర నళినీ మోహన్

అటు ఒక మైలు, ఇటు ఒక మైలూనూ. (అన్నవరం పక్కని కూనవరం అనే వూరులేదనీ, వాటి మధ్య కొండ అనేదేలేదనీ, కొండమీదికి సిమెంటు రోడ్డు వేయడం అనే ఆనవాయితి ఆంధ్రలో అసలే లేదనీ మీలో ఎవరైనా ఈ సమస్యని పూర్వపక్షం చేయబోతారేమో, ఈ పేర్లూ, కథా, కమామీషూ...... అంతా కేవలం కల్పితం అని విన్నవించుకుంటున్నాను.)

కారుమీద ఒక ఆసామీ అన్నవరం దగ్గర బయలుదేరి కొండపైకి గంటకు 15 మైళ్ల వేగంతో వెళ్లేడు. కొండ శిఖరం మీదికి చేరుకున్నాక అతడికో ఆలోచన తట్టింది. కిందికి వెళ్లేటప్పుడు వేగం హెచ్చించి, మొత్తం ఆ రెండు మైళ్ల ప్రయాణంలోనూ సరాసరి వేగం 30




మైళ్లు అయేలా చేయాలనుకున్నాడు. అయితే దిగువ ప్రయాణంలో ఏ వేగంతో కారునడుపుతే సరాసరివేగం 30 మైళ్ళు అవుతుందో అతనికి సరిగ్గా తెలియలేదు. మీరేమైనా సలహా ఇవ్వగలరేమో ప్రయత్నించండి.

(జవాబులు 64వ పేజీలో)



స్వాతంత్ర్యం వచ్చాక—మన ప్రభుత్వం సాధించిందేమిటో బాగా ఆలోచించండి— ఓ. అర్థంకాకపోతే ఫర్వాలేదు — తర్వాత మాట్లాడుతా!

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

## పాఠకులకు మనవి

రూపాయి విలువతగ్గింపు ఫలితంగా విదేశాలనుండి దిగుమతియగు న్యూస్ ప్రింటుతోపాటు ఇతర యంత్రసామగ్రి వెలలు కూడా విపరీతముగా పెరిగాయి. ఈ కారణంగా భారతదేశంలోని వార్తాపత్రికలన్నీ అనేక సమస్యల నెదుర్కొంటూ పత్రికా ప్రచురణ సాగించవలసి వస్తుందనే విషయం మా పాఠకులందరకు తెలిసినదే.

"ఇండియన్ అండ్ ఈస్టరన్ న్యూస్‌పేపర్ సొసైటీ" వారి సలహా ననుసరించి ఆంధ్రసచిత్ర వారపత్రిక వెలను ఈ (10—2—67తేదీ)సంచిక నుండి 35 పైసలనుండి 40 పైసలకు పెంచడమైనది.

పత్రికా సంస్థయొక్క పరిస్థితులను మా పాఠకులు, న్యూస్ఏజంట్లు గుర్తించి ఎప్పటివలె మాతో సహకరించవలసిందిగా కోరుచున్నాము.

గమనిక : ప్రస్తుత చందా మొత్తములు కొత్తరేట్ల కనుగుణంగా సవరించబడుతాయి.

### చందా వివరాలు

| | పోస్టుద్వారా | ఏజంటుద్వారా |
|---|---|---|
| | రూ. పై. | రూ. పై. |
| సంవత్సర చందా | 22-40 | 20-80 |
| అర్ధ సంవత్సరం ,, | 11-20 | 10-40 |
| మూడు మాసములు ,, | 5-60 | 5-20 |

మేనేజరు

ఆంధ్రపత్రిక

# వీడ్కోలు

జి. వెంకట్రామరెడ్డి



పార్వతి మనస్సు ఈవేళ సోంబాగా వుంది. అపుడే వచ్చిన దినపత్రికను తిరగవేస్తోంది. చూస్తూ చూస్తూ ఒకచోట టక్కున ఆగిపోయింది "కన బడుట లేదు" ఒక మూలన చిన్న హెడ్డింగ్ పెట్టి వుంది. దాని క్రింద తప్పిపోయిన అమ్మాయి ఫోటో కూడా వేశారు

"కుమారి సరోజ వయస్సు 8 సం ఎర్రగా బొద్దుగా వుంటుంది రెండునెలల నుండి కనిపిం చడం లేదు జాడ తెలిసినవారు ఈ క్రింది అడ్రసుకు తెలియజేయండి తగిన బహుమతి కూడా యివ్వబడును." అని వుంది.

ఆ సరోజ, తన సరోజ, ఒకరేనా? ఫోటోను తీక్షణంగా చూసి ఒక నిర్ధారణకు వచ్చింది

తన సరోజ ఫోటోయే అది అందులో సందేహం లేదు.

"అమ్మా సరోజ" అని పిలిచింది

ఇంట్లో కూర్చొని చదువుకుంటున్న సరోజ పరుగెత్తుకుని వచ్చింది.

"ఏమిటమ్మా అంత గట్టిగా పిలిచావ్? నాకు భయమేసింది." అంది పార్వతి దగ్గరగా కూర్చొని

"ఈ ఫోటో నీదికదూ!" అని పత్రిక చేతి కిచ్చింది పార్వతి

"నాదేనమ్మా పోయిన సంవత్సరం మా వూరు ఫోటోలు తీసే మనిషి వస్తే తీయించుకున్నాను అపుడు మా అమ్మానాన్న కూడా తీయించుకున్నారు. అందరూ కలసి ఒకటి, నేను ఒక్కతెను ఒకటి తీయించుకున్నాం. అయితే ఈ పత్రికకు యెలా వచ్చింది? వీళ్ళదగ్గ రేమన్నా మంత్రాలుంటాయా?" అన్నది ఆశ్చర్యంగా

పార్వతి చిరునవ్వు నవ్వి—

"నువ్వు కనిపించడం లేదని మీనాన్న పేపరులో ఎడ్వర్టైజుమెంటు యిచ్చాడు" అన్నది

"అయితే నువ్వు తెలియజెయ్యకమ్మా. ఇక్కడ నాకు యెంత హాయిగానో వుంది." అన్నది

"నువ్వు వద్దంటుంటే నేను మాత్రం ఎందుకు తెలియజేస్తాను?"

"అమ్మా నిజంగా రాయకు నిన్ను విడిచి వెళ్ళ బుద్ధి కావడంలేదు నాన్న వస్తే లాక్కెడతాడు అయినా ఎక్కడయితేం నేను సుఖంగా వుండడమేగా కావలసింది వాళ్ళకు" అమాయకంగా అడిగింది.

ఆ మాతృ హృదయం ఎంత తల్లడిల్లుతుందో ఈ పసికూనకేం తెలుసు? నిజంగా సరోజ హృద యంలో తను మాతృస్థానం సంపాదించుకుంది తను ఎంత అదృష్టవంతురాలు! ఇంతకంటె ఎవరు యెక్కువ కోరుకుంటారు?

"పిచ్చితల్లి" ఆప్యాయంగా తల నిమురుతూ అన్నది నువ్వు వద్దంటూంటే నేనెందుకు తెలియ జేస్తాను? వెళ్ళి చదువుకో" అన్నది.

"రాయబోకమ్మా' అని లోనికెళ్ళింది సరోజ.

ఇలాంటి అందాల అమ్మాయిని బిడ్డగా కన్న ఆ మాతృశ్రీ ఎంత అదృష్టవంతురాలు!

తెలియజేయడం తన ధర్మం, కర్తవ్యం కూడాను కాగితం కలం తీసుకోక తప్పింది కాదు

"మీ సరోజ సురక్షితంగా వుంది" అని తన అడ్రెసు యిచ్చింది పనిమనిషి చేతికిచ్చి పోస్టు చే యమ్మని బరువుగా నిట్టూర్చింది

సరోజతో పరిచయమయిన ఆ విచిత్ర సంఘ టన గుర్తుకు రాసాగింది

తను ఆ స్కూలుకు సెకండరీగ్రేడ్ టీచరుగా వచ్చిన కొత్తరోజులు ప్రతి అమ్మాయిని ఆత్మీయు రాలిగా చూసుకోవడం వలన తనంటే స్కూల్లో పిల్లలందరికీ యిష్టమే

ఆరోజు ఆదివారం. సాయంత్రం స్కూలుకి సరదాగా వెళ్ళింది

మాసిన బట్టలతో వరండాపై పడుకొని వుంది సరోజ స్కూలు అమ్మాయి గాబోలు, ఆడుకొని అలసిపోయి, యిక్కడ పడుకొంది గాబోలు, సరదాగ నాలుగు కబుర్లు చెప్పి వద్దాం అని దగ్గర కెళ్ళింది.

తను వెళ్ళేసరికి బెదురు బెదురుగా లేచి నిల్చుంది.

"ఏమిటమ్మా యిక్కడ పడుకున్నావ్?" అని ఆప్యాయంగా అడిగింది దగ్గర కెళ్ళి సరోజ బెదురు బెదురుగా తనకేసి చూస్తుందేగాని ఒక్కమాట కూడా మాట్లాడటం లేద.

"ఏమిటమ్మా, అలా చూస్తావ్? యిక్కడ పడుకున్నావేం?" అని ఒడిలోకి తీసుకొని అప్యా

ముఖంగా అడిగింది.

“మరండీ.” అని యేదో చెప్పబోయి మధ్యలోనే ఆగిపోయింది.

“భయంలేదు చెప్పమ్మా. నిన్ను యేమీ అనను గా” అన్నది తను.

“అమ్మా—నాన్నా— మావూరు.” ప్రయత్న పూర్వకంగా మాట పెగల్చుకొని అన్నది. కళ్ళ వెంబడి నీళ్ళు కారుతున్నాయ్. ఆ మట్టి చేతుల్తోనే కళ్ళు తుడుచుకుంటుంది.

“తప్పు ఆమట్టి చేతుల్తో కళ్ళు తుడుచు కోకు.” అని తన పమిట చెంగుతో తుడిచింది. తన వూహ నిజమే అయింది.

“మాయింటి కెడదాంరా. మీ అమ్మా నాన్నను అక్కడ చూపిస్తాను” అన్నది తను. ఇంత ఆప్యా యంగా అన్నా కూడా యింకా బెరుకు బెరుకుగానే చూస్తోంది.

“నేను కొట్టనమ్మా. మీ అమ్మని చూపిస్తాను.” అని యింటికి తీసుకువచ్చింది.

ఒకగంట సేపాగిన తర్వాత

“అమ్మని చూపిస్తా నన్నారుగా. ఎక్కడుంది?” అన్నది. ఇపుడు సరోజ ముఖంలో దైన్యం కొట్ట వచ్చినట్లు కనబడతోంది. తను యేం మాట్లాడక పోవడంతో—

బిగ్గరగా యేడ్చి

“నన్ను చంపుతారు. అమ్మో” అని పారిపో బోయింది. తను గట్టిగా చేయి పట్టుకొని బావి దగ్గరకు తీసికెళ్ళి స్నానం చేయించి తన చెల్లెలుకు కుట్టించిన క్రొత్తబట్టలు యిచ్చింది.

అన్నం తిన్నంతసేపు దగ్గర కూర్చొని మంచి కబుర్లు చెప్పింది. అయినా సరోజ భయం తగ్గలేదు. ఆరాత్రి తన దగ్గరే పడుకోబెట్టుకుంది.

మరునాడు అంత భయం కనిపించలేదు.

సరోజ పడుకున్న మంచం దగ్గర కెళ్ళి—

“అసలేం జరిగిందో చెప్పమ్మా. ఎవరన్నా నిన్ను కొట్టారా? అమ్మ యేమన్నా అన్నదా?” అని అడి గింది. ఆప్యాయంగా.

“మరండీ—మరండీ” అని ఆగిపోయింది.

“చెప్పమ్మా.” అన్నది తను మళ్ళీ.

“మొన్న మా అమ్మానాన్నా, నేను శివరాత్రి స్నానానికి వచ్చామండీ. చాలమంది జనం వచ్చారు. అందరూ నీళ్ళల్లో మునుగుతున్నారు. నేను ముని గాను. నా ప్రక్కనే నల్గురు పిల్లలుంటే వాళ్ళతో కలిసి కాసేపు ఆడుకున్నాను. కాసేపాగి చూసేసరికి మా అమ్మానాన్నా కనిపించలేదు. అమ్మా, అమ్మా అని పెద్దగా కేకవేశాను. కాని, యెక్కడా కనిపించ లేదు. మధ్యాహ్నం వరకు అలానే తిరిగాను. నేను యేడుస్తూ అమ్మా,- అమ్మా, అనడం ఒకాయన చూసి, నా దగ్గరకు వచ్చాడు. చాల భయపడ్డాను.

మెలాగానే “ఎందుకమ్మా యేడుస్తావ్?” అన్నాడు.

“మా అమ్మా, నాన్నా తప్పిపోయారు. కనిపిం చడంలేదు.” అన్నాను.

అతడు నన్ను బుజ్జగించి...

“అందుకేనా యింతగా యేడ్చేది? నేను చూపి స్తాను రా. మీ అమ్మ నాకు బాగా తెలుసు. నిన్ను తీసుకురమ్మన్నారు.” అన్నాడు నాకు సంతోషం వచ్చి

“మీరు చాల మంచివారు.” అన్నాను. నన్ను యింటికి తీసికెళ్ళి—

“మీ అమ్మా, నాన్నా బజారు కెళ్ళారు వస్తారు.” అన్నాడు మళ్ళా నాకు భయమేసింది. గదిలో కూర్చొని చాల చీకటి పడేవరకు అలా చూస్తూనే వున్నాను. కాని వాళ్ళు యెవరూ రాలేదు. భయమేసి,

“మా అమ్మా, నాన్న యెక్కడ?’ అన్నాను యేడుస్తూ. “వస్తారులే అన్నం తిందువుగానిరా.” నన్ను యింట్లోకి తీసికెళ్ళాడు. అన్నం తినేసరికి నాకు నిద్ర ముంచుకు వచ్చింది.

మరునాడు వుదయం నిద్ర లేచి చూసేసరికి మీ స్కూలు వరండాపై పడుకొని వున్నాను. మెళ్లో చూసుకుంటే నా నెక్లెస్ లేదు. బాగా ఆకలి అవు తుంది. ప్రతిరోజు మా యింటి దగ్గర వుదయాన్నే కాఫీ త్రాగే అలవాటు. నెక్లెస్ పోయిందని అమ్మ కొడుతుందేమోనని యేడుస్తూ వరండాలోనే కూర్చుండిపోయాను. అంతలో మామిడి పండ్లు అమ్ముతూ ఓ అవ్వ వచ్చింది. నా సంగతంతా విని రెండు పండ్లు యిచ్చింది. అవి తిని మీ స్కూల్లో వున్న పంపు దగ్గర నీళ్ళు త్రాగాను. కొంచెం కళ్ళు తిరగడం ఆగింది. అమ్మా నాన్నను వెతుకుతూ రోడ్లన్నీ తిరిగాను. కాని వాళ్ళు యెక్కడా కనిపించ లేదు. తిరిగితిరిగి కాళ్ళునొప్పులు పుడుతుంటే మళ్ళా వచ్చి వరండాలో పడుకున్నాను. ఈరాత్రి ఒక్కదాన్నీ యెలాగ వుండాలా? అని భయమేసింది. ప్రొద్దు కూకుతున్న కొద్దీ భయమెక్కువయింది. ఒక అమ్మలాగా మీరు కలిశారు.” అని తన వొడిలో తల దూర్చి వెక్కివెక్కి యేడ్వడం మొదలెట్టింది.

“ఏడ్వకు సరోజా, నేను కలిశాగా.” అన్నది తను.

“ఆ నెక్లెస్ మా తాతయ్య పెట్టాడు.”

“పోతే పోయిందిలే వెధవ నెక్లెస్. ఇంకొకటి చేయించుకోవచ్చు. విచారం పెట్టుకోకు.” అని బుజ్జగించింది.

మండిపోతున్న ఆ పసి హృదయంలో తన మాటలు అమృతం పోసినట్లున్నాయ్.

“అంతేలెండి.” అన్నది చిరునవ్వుతో. పైమన్న యేదో బరువు దించినట్లుగా వుంది తనకు.

అప్పటి నుండి భయం తగ్గి రోజురోజుకి తన దగ్గిరవుతోంది. తనతోపాటు స్కూలుకు తీసు కెడుతూ వుండేది.

ఉన్నట్లుండి ఒకరోజు అకస్మాత్తుగా జ్వరం వచ్చింది.

అబ్బ! అపుడు తను ఎంత కంగారుపడింది! ఉండి వుండి—

“అమ్మా, నా గొలుసు. ఆయన తీసుకున్నాడు.” అని పలవరిస్తోంది. ఆ మూడురోజులు సెలవు పెట్టి సరోజ మంచం దగ్గరే కళ్ళల్లో వత్తులు వేసుకొని మరీ మేల్కొని వుంది. రోజుకు రెండుసార్లు డాక్టరును తీసుకువచ్చి చూయించేది.

అదృష్టవశాత్తు ఆ జ్వరం త్వరలోనే తగ్గి పోయింది. తమ మధ్య అనురాగాన్ని యింకొంచెం పెంచింది ఆ జ్వరం. అప్పటినుంచి, తను యెటు వెళ్ళినా కొంగు పట్టుకొని మరీ తిరుగుతూ వుండేది.

ఓ చక్కటి అమ్మాయి తనతో తిరుగుతుంది అని ఎంత మురిసిపోయేది తను! తను ఆ అమ్మాయికి తల్లి అయినట్లే గర్వపడేది!

ఆరోజు తొలిసారిగా.. నిజంగా జీవితంలో మరువు

లాని రోజు.

“అమ్మా ఈ పువ్వులు జడలో పెట్టు. నువ్వు చాల అందంగా పూలు పెట్టుకుంటావమ్మా” అన్నది. ఆరోజు...తనకొక మహత్తరమయిన పండుగరోజు! ఒక అమ్మాయి నోటి వెంట తను అమ్మా అనిపించు కుంది.

“సరోజా.” అని గట్టిగా కౌగిలించుకుంది. తన కనుకొలకుల్లో నీటి బిందువులు నాట్యం చేశాయ్ మరుక్షణాన్నే.

“ఎందుకమ్మా, యేడుస్తావ్? మీ అమ్మా, నాన్న గుర్తుకు వచ్చారా?” అంది వసంత ఆప్యాయంగా.

“అదేం కాదమ్మా.” అని మాట మార్చాలనే వుద్దేశ్యంతో “పూలు పెడతాను వుండు.” అని పూలు పెట్టింది.

ఆ రోజంతా సరోజ అందాన్ని చూస్తూనే, గడిపింది. ఇలాంటి తీయటి బంధం పెనవేసుకుంది తనకు, సరోజకు మధ్య—

పార్వతి ఆలోచనలను భగ్నం చేస్తూ.

“అమ్మా ఏమిటలా ఆలోచిస్తున్నావ్? వుత్తరం సంగతేనా! ఇపుడొద్దులే నేను సుఖంగానే వున్నాగా” అన్నది దగ్గరగా వచ్చి.

“నిజంగా నీకు వెళ్ళ బుద్ధి కావడంలేదా సరూ!” అన్నది పార్వతి ఆతృతగా.

“నిజం అమ్మా. కావాలంటే యింకో పదిరోజుల తర్వాత వెడతాను.” అన్నది.

“సరేలే నేనెందుకు తెలియజేస్తా?” అనక తప్పిందికాదు పార్వతికి.

“నువ్వు చాల మంచిదానవమ్మా. మా అమ్మ కూడా నన్నింత ఆప్యాయంగా పెంచేదికాదు.” అన్నది మెడ చుట్టూ చేతులు వేస్తూ—

‘ఆ పసి హృదయంలో యెంత అనురాగం! కోపా లకు, తాపాలకు, దూషణాలకు భూషణాలకు ఆ పసి హృదయం ఎంత దూరంలో వుంది. నిజంగా యిలాంటి అమ్మాయి తనను అమ్మగా భావించడం పూర్వజన్మ సుకృతమే.’ అనుకుంటుంది పార్వతి.

“వెళ్ళి బట్టలు మార్చుకుని స్కూలు కెడదాం.” అన్నది మరీ మాట్లాడకూడదనే వుద్దేశ్యంతో.

“ ఓ నిముషంలో నేనుకుంటాను.” అని పరు గెత్తుకుని వెళ్ళింది యింట్లోకి. గుమ్మం కేసి చూస్తూ అలానే కూర్చుండిపోయింది పార్వతి.

* * *

పార్వతి అనుకున్న విధంగానే ఆరోజు సరోజ నాన్న వచ్చాడు.

“అమ్మా! పార్వతమ్మగారట! స్కూలు టీచరు, యిల్లు యిదేనా?” అన్నాడు.

“ఇదే రండి. ఎవరు కావాలి?” అన్నది పార్వతి.

“మా సరోజ మీ దగ్గరనేనా అమ్మా వుండేది?” అన్నాడు.

“అవునండి. ఇక్కడే వుంది. లోనికిరండి.” అని ఛైర్ వేసింది. మర్యాదపూర్వకంగా.

“మంచినీళ్ళు త్రాగుతారా?” అన్నది. కాని అవన్నీ యేం పట్టించుకునేటట్లు లేడు ఆ మహాను భావుడు.

“ముందు అమ్మాయిని చూపించమ్మా. దాన్ని చూస్తే దప్పిక దానంతటకదే తీరుతుంది. రెన్నెళ్లై యింది మాతల్లిని చూడక.” అన్నాడు.

పార్వతి వెళ్లేసరికి బావి దగ్గర గన్నేరు పూలు

కోస్తోంది సరోజ.

"సరూ! నీకో మాంచి ప్రజంటేషను. చెప్పుకో చూద్దాం" అన్నది.

పూలు కోయడం ఆపుచేసి—

"నాకు తెలుసులే ఇవ్వాళ నా కోసం మిఠాయిలు చేశావు గదా!" అన్నది.

"లేదు మీ నాన్నగారు వచ్చారు. ఇంటి ముందు వున్నారు వెళ్ళు." అన్నదేకాని, హృదయంలో యేదో మూగ బాధ ఆవరించింది.

'నాన్న వచ్చారు' అని చెవిన బడడమే ఆలస్యం— రివ్వున దూసుకెళ్ళి తండ్రిని కౌగిలించుకుంది.

"బావున్నావా తల్లీ? మళ్ళా ఈ జన్మలో నిన్ను చూస్తామని అనుకోలేదు. అంతా భగవంతుడి దయ" అన్నాడు తల నిమురుతూ.

"భగవంతుడి దయకాదునాన్నా. అమ్మ దయ. పార్వతిగారు చాలా మంచివారునాన్నా." అంది.

పార్వతి కూడా గుమ్మందగ్గరగా వచ్చింది.

"నీ ఋణం ఎన్ని జన్మలకయినా తీర్చుకో లేము తల్లీ. ఒక్కతేపిల్ల. అల్లారు ముద్దుగా పెంచాము. శివరాత్రి స్నానానికి వచ్చినపుడు తప్పి పోయింది. అప్పటినుంచి ఒకటే దిగులుతో మంచం యెక్కింది తల్లి." అన్నాడు.

పార్వతి చిరునవ్వుతో సరి పెట్టుకుని లోని కెళ్ళింది కాఫీ తయారుచేయడానికి.

పార్వతికి పొంగి వస్తోంది దుఃఖం. ఏదో అనిర్వచ నీయముగ బాధ చిత్రహింస చేస్తోంది. వెలుపల తండ్రీ బిడ్డా మాట్లాడుకునే సంభాషణ స్పష్టంగా వినవస్తోంది:

"అమ్మా, ఆ రోజు యెంతగా యేడ్చావ్ తల్లీ? నీకోసం పట్నమంతా గాలించాం మూడురోజులు. మీ అమ్మయితే ఒకటే శోకాలు."

"ఏమో నాన్నా— అవన్నీ చెప్పకు. భయ మేస్తోంది." అంటోంది సరోజ.

అపుడు చూశాడు ఆయన సరోజమెడకేసి.

# వీడ్కోలు

బోసి కొడుతోంది.

"నీ నెక్లెస్ యేది? పార్వతమ్మ దాచిపెట్టిందా?" అన్నాడు కంగారుగా.

"లేదునాన్నా. పోయింది. ఎవరో దొంగకొట్టే శాడు." అంది సరోజ బిక్కముఖంవేసి.

"నీకు తెలియదా? అయినా ఈ పంతులమ్మ లాంటి వాళ్లను నమ్మగూడదమ్మా— పిల్లలను అమ్ముకుంటారట. ఆవిడగనక తీసుకొని అమ్ము కుందా? చెప్పు. పోలీసులను పిలుస్తాను." అన్నాడు.

"అబద్ధంనాన్నా. అమ్మను అలా అంటే కళ్ళు పోతాయ్. అమ్మ చాలమంచిది." అంది సరోజ.

ఈ మాటలన్నీ వంటగదిలో వున్న పార్వతికి స్పష్టంగా వినిపిస్తున్నాయ్. కాళ్ళక్రింద భూమి గిర్రున తిరిగినట్లయింది. ఇన్నాళ్ళు కంటిలో పాపగా కాపాడినందుకు అతడు యిచ్చే ప్రతిఫల మిదా? సుళ్ళు సుళ్ళుగా తిరిగివస్తున్న కన్నీటి నాపుకొని కాఫీ కలిపింది.

తండ్రీ బిడ్డా యింకా మాట్లాడుతూనేవున్నారు. "ఏమో అమ్మా— ఏ పుట్టలో యే పాముందో— నమ్మడం యెలాతల్లీ? ఈ పంతులమ్మ తియ్య లేదని నీకు ఖచ్చితంగా తెలుసా?" అన్నాడు.

"నాన్నా." కొంచెం గట్టిగా అన్నది సరోజ. "అమ్మను అలా అనకు. చాల మంచిది!"

"అడ్డమయిన వాళ్ళందర్నీ అమ్మ అంటావేం తల్లీ? నా అనుమానం ఈ పంతులమ్మే కొట్టేసి వుంటుందని." అన్నాడు.

కాఫీ పట్టుకువస్తున్న పార్వతి చేతిలోని కప్పు జారి క్రిందబడి ఫెల్‌మని పగిలిపోయింది. కాఫీ చీరెమీద పడ్డాయ్. ఈ శబ్దం వినిపించి సరోజ పరుగెత్తుకుని వచ్చింది.

"ఏమిటమ్మా? కప్పు యెలా జారిపోయింది? కన్నీళ్ళు పెట్టుకుంటా వెందుకమ్మా? ప్లీజ్ చెప్పవా అమ్మా. ప్రాణం బావుండలేదా?" ఆ పసిహృదయం తల్లడిల్లిపోతోంది పార్వతి దీనావస్థ చూసి.

"నిన్ను ఈ రెండు నెలలు కంటిలో పాపగా చూసుకోబట్టే నాకీ కన్నీళ్ళు. మీరంతా మోస గాళ్ళు." అనాలనిపించింది పార్వతికి కాని! అభం శుభం తెలియని పసికందును అంటే యేమొస్తుంది?

"లేదమ్మా. కళ్ళు తిరిగాయ్. ప్రాణం బాగానే వుంది. కాఫీ చేసుకువస్తాను. మీ నాన్నగారి దగ్గర కెళ్ళు." అన్నది.

ఎలాగో కాఫీ తయారుచేసి యివ్వక తప్పింది కాదు. చూస్తూనే సాయంత్రం అయింది. జీవి తంలో యేనాడూ యెరగని బాధ అనుభవిస్తోంది పార్వతి. గన్నేరు చెట్టు క్రింద వున్న సిమెంటు బెంచీపై కూర్చుంది.

ప్రాణప్రదంగా, కన్నబిడ్డకంటే మిన్నగా పెంచి నందుకు అతడుయిలామాటలతోచిత్రహింసచేస్తాడా?

సరోజ వెడితే యింక రేపటినుంచి తనను అమ్మా అని పిలిచేదెవరు?

జీవితంలో యేదో లోటు పూర్తి అయిందనుకొని సంతోషపడింది. కానీ— రెణ్నెల్లల్లోనే యిలా జరుగుతుందనుకోలేదు. అవును— సరోజ యేనాటి కయినా పుట్టింటి కెళ్ళక తప్పుతుందా? అసలు సరోజమీద అనురాగం పెంచుకోవడం తనదేతప్పు. ఈ పరిచయం కలగకపోతే యే దిగులూ వుండేది కాదు కదా!

అన్నిటికీ మించి ఆయన నోటి వెంట వినరాని మాటలు— భగవాన్! పార్వతి హృదయం తల్ల డిల్లుతోంది.

వెళ్ళడానికి తయారయి పార్వతి దగ్గరకు వచ్చింది సరోజ

"ఏమిటమ్మా యిక్కడ కూర్చున్నావ్? ఇంటి ముందుకి రావమ్మా." అన్నది చేయిపట్టుకొని.

విహారంగా సరోజ ముఖంలోకి చూసింది. "ఏమిటమ్మా అలా చూస్తావ్? రా." అంది.

మొన్న సరోజ మాటలకు, యిపుడు మాటలకు యెంతతేడా? తను అనవసరంగా ఆత్మీయత పెంచు కుని యిపుడు తల్లడిల్లితే మాత్రం యేంలాభం?

సరోజతోపాటు, ముందు వరండాలోనికొచ్చింది. సరోజనాన్న రిక్షా పిలవడానికి వెళ్లాడు.

"నన్ను మర్చిపోవుగదూ సరూ!" హృదయానికి గాఢంగా హత్తుకుని కన్నీళ్ళు పెట్టింది.

మర్చిపోనన్నట్లు తల ఆడించింది సరోజ.

"రా, సరూ! బండి రెడీ అయింది." రోడ్డుపై నుండి పిలిచాడు తండ్రి.

"వస్తాను అమ్మా." అని నవ్వుతూ రిక్షా దగ్గర కెళ్ళింది. పొరబాటునయినా కన్నీళ్ళు పెట్టలేదు సరోజ. పార్వతికి హృదయంపై యెవరో మోది నట్లయింది.

రిక్షా యెక్కిన సరోజ చేయిఊపింది.

పార్వతి కూడా యాంత్రికంగా చెయ్యూపింది గాలిలో—

అంత బరువయిన రిక్షా పార్వతి గుండెలమీదుగా కదిలింది.

వేగంగా పోతున్న రిక్షాకేసి, రెండు సజలపూరిత నేత్రాలు రెప్పవాల్చకుండా అలా చూస్తూనే వున్నాయ్— ●



# సముద్రం ఇన్ఫైయుటా

మనో

దేవుడా! ఈయనొస్తే ఎందుక్రబతుకు దాచి పెట్టావు—అనుకుంది వసుంధర దూరంగా వని పిస్తున్న కృష్ణానదినీ, కొండల్నీ, ఎలక్ట్రిక్ ల్యాంపుల్నీ చూస్తూ.

ఒంటరి తనపు బాధ తేలు విషంలా మెల్లమెల్లగా ఒళ్ళంతా పాకుతున్నట్టుంది.

ముమ్మతో, పవర్‌హౌస్ పొగగొట్టంలోంచి చిక్కగా గాలికి చిందరవందరగా లేస్తున్న పొగలో ఉక్కిరిబిక్కిరై పోతున్న ఆదివారం సాయంత్రపు సూర్యుడు కొండవెనక ఎర్రటి ఆందోళనని రేపుతున్నాడు.

ఈయనెప్పుడొస్తాడు క్యాంపునుంచి? జీప్‌లో యింటికొస్తూ హొస్తూ లారీకి గుద్దుకుంటే ఎలా వుంటాడు? ఈసూర్యుడి ఎర్రదనం ఆకాశంలో విరిగిపోయినట్టే పోతాడా? మెదడేమవుతుంది? 'నేను స్కూల్లో చదివేటప్పుడు నీది గొప్పబుర్రరా' అనేవాడు మా లెక్కల మాస్టరు అని యింకెప్పుడూ గర్వంగా అనలేడు. 'ఇవాళ సినిమా కొద్దాసుంధరా, చికాగ్గావుంది' అని సిగరెట్‌పొగ వొదుల్తూ అనలేడు. ఖరీదైన సిగరెట్ కాల్చే పెదాలూ, లండన్ నైట్స్ సెంట్ రాసుకునే శరీరమూ, తెలివితప్ప యింకేం లేనితల—ఏమీ వుండవు. వంగచిరి, ఒక తొడ నెత్తుర్లో తడిసి, తలా,పడుందాకాశరీరం,ఒరిగిపోయిన జీపు కప్పుకుపోయి చావులో—నెత్తుర్లో—మృత్యువు గొప్ప ఆర్టిస్ట్—వెయ్యి పికాసోల కంటే గొప్పది.

'చావుకీ, బతుక్కీ అర్థంలేదువసూ." అంటాడు రవి. ప్రపంచంలో దేనికీ అర్థం లేదంటాడేమి టతను? మనుషుల అస్తిత్వాలు అబ్సర్డ్, మీనింగ్ లెస్‌అంటాడే— రవి యివాళ రాత్రికొస్తాడా? రా రవీ! స్వీట్‌రవీ!

"ఏమండీ.... సుదర్శన్రావుగారి జీపు లారీకి గుద్దుకుని......"అని ఆఫీసునుంచి ఫోన్‌వస్తే, సిని మాలో హీరోయిన్‌లాగా 'ఏమండీ!' అని గొంతు ఉలిపిరి కాయితంలా చిరిగిపోయేటట్టు అరవాలా? "ఛీ! ఛీ! అలా అరవడంచూస్తే నాకుచికాకు"అని ఒకసారి చావు ప్రసక్తి వచ్చినప్పుడు రవి అంటే— "అయ్యా! రచయితగారూ! కొన్ని మనుషుల్లో బతకాలిమీరు"— అన్నాడాయన.

"అమ్మా! నే వెళ్తున్నా"— వంటమనిషి.

బతికించింది. రవి వస్తానన్నప్పుడు మొన్న ట్లాగా సాకులు చెప్పి దీన్ని తప్పించాల్సిన గొడవ లేదు.

"ఎక్కడికీ? రాత్రెవరు పడుకుంటారనిక్కడ?"

"మూఅయనివాళ సినిమాకెళ్తున్నాడండీ... మా పెళ్ళై యివాళ్టికి అయిదేళ్ళమ్మా...అందుకని" సిగ్గులు.

దీని మొగుడు దీన్ని సినిమాకు తీసుకు వెళ్తాడు. హాయిగా పక్కన పడుకుని కబుర్లు చెబుతాడు. కావలసినంత తృప్తి, సంతోషం యిస్తాడు..... పో! యూ ఆర్ లక్కీ వుమన్..... లక్కీ.

"సరే! వెళ్ళు."

భోంచేయాలి. ఏ చెత్త యింగ్లీషు నవలో పట్టుకు పడుకోవాలి. దాన్నిండా సెక్స్. జాకెట్లు చిరిగిపోతాయి. శూన్యంలోకి రాకెట్లు పోతాయి... తృప్తి. తృప్తి.... తృప్తి.... నాన్సెన్స్.... నాకెందుకు లేదది?

వసుంధరకి చికాకనిపించింది. చర్మం కింద మని షిలో ఎంత నీచమైన మృగం వుంది— అనుకుంది.

సోఫాలో జార్లబడి కూచుంది. పొద్దుట చూచి మడతపెట్టకుండా పడేసిన పేపరు పొడుగ్గావున్న సోఫాకి ఒక మూలగా అలాగే పడుంది. కళ్ళు గాబరా పడ్డ గండు చీమల్లాగా పేపరులో అక్షరాలమీద పరుగెత్తాయి:

Hanoi Condemns Us move. U. P. Students stone up buses. Indira denies shift in Vietnam policy. 500 arrested in Punjab raids. Power cut relaxed. Customs seized 1000 tolas gold.....

చదవడం ఆపేసి మనసులో ఉత్తరాలు రాసింది వసుంధర.

డియర్ ప్రెసిడెంట్ లిండన్ జాన్సన్.. లీక్ గిన్స్‌బెర్గ్స్ పొయిట్రీ... డ్యాం యువర్ వియత్నాం పాలసీ..... డియర్ ఇందిరాగాంధీ.... యు లుక్డ్ నైస్ వెన్ సా యూ యిన్ విజయవాడ. హౌ ఐరన్స్ యువర్ శ్యారీ? ఇండియా యిజె పూర్ కంట్రీ.... సిక్ కంట్రీ..... ఓ...... యువర్ గవర్నమెంట్..... ఓ! ఓ!....

రాయాలి. రాయాలి. రవిచ్చిన పెన్నుతో రాయాలి. కొత్త శానిటరీ టవల్సున్న బాక్స్‌లోంచి ఆ పెన్నుని తీసి యింకెక్కడైనా దాయాలి.

వాచీ చూసుకుంది వసుంధర. ఆరున్నరవొస్తుంది. పగలంతా ఏమైపోయింది?

లేచి వెళ్ళి లైటువేసేసింది.

అవులిస్తున్న ఎడారిలా వున్నట్టు— గది. కిందికి వేళ్ళాడుతున్న పాముల్లాగా— టేబుల్ కాళ్ళు. ఒంటరితనపు ముళ్ళకంపలకి సమాధిచేసినట్టు— వాళ్ళు. రవి చెప్పినట్టు అస్తిత్వంలో ఎంత బాధ వుంది! గాయాలు చేస్తుంది అస్తిత్వం...... యివాళొస్తానని మొన్న చెప్పాడు రవి. వస్తాడా? వస్తే బావుణ్ణు.

హఠాత్తుగా మళ్ళా 'చావు' సంగతి మనసులోకి వచ్చింది వసుంధరకి. చికాకనిపించింది.

చచ్చిపోతే యీ ప్రపంచంతోవున్న కమిట్ మెంట్ పోతుంది. అంతకంటే ఏంకాదు. కాని ఎంత స్వీట్ కమిట్‌మెంట్ యిది? ఇంకోసారి బతకడానికి అవకాశం వస్తే యీ మనుషులందరూ ఏంచేస్తారు? ఎక్కిన కొండేగదా ఎందుకు లెద్దురూ అంటారా? పూర్ మనుషులు! హద్దులు కనిపించని పెద్ద ఖైదులో తిరుగుతూ స్వేచ్ఛగా వున్నామనుకుంటు న్నారు. ఆందోళననీ, భయాల్నీ, ఆయిల్‌కంపు దుమ్మునీ శ్వాసిస్తూ, సిగరెట్ల మధ్య, సినిమా హాళ్లలో, సింగారాల్లో అస్తిత్వాన్ని మరచిపోతున్నా మనుకుంటూ దాన్ని నిరంతరం జ్ఞాపకం చేసు కుంటున్న వాళ్ళు...... నేను...... నేనూ యింతే.... మీనింగ్లెస్. అబ్సర్డ్.

అర్థంకాని వెగటేదో అనిపించి వసుంధర భోజనం చేయకూడదనుకుంది. కాని తర్వాత ఆకలేస్తుందని భోజనం చేసేసింది.

బయట సన్నగా చినుకులు పడుతున్నాయి. కింది తలుపులకి గడియపెట్టి మేడమీదకి వచ్చేసింది వసుంధర.

రవి రాడేమో! చినుకులు కాస్త వర్షమైతే! హెల్! చినుకులు చినుకులుగానే వుండాలి. 'చలి వేస్తుందండీ' అని చినుకులు పడుతున్నప్పు డంటే 'రగ్గు కప్పుకో వసూ!.... కప్పనా!' అని రగ్గు కప్పా డాయన. పూర్‌ఫెలో! నా కిప్పుడది కావాలి— అని ఆడది నోరుతెరచి అడక్కుండా నటిల్‌గా అంటే అర్థం చేసుకోని మగాడు...... 'మీరు క్యాంపులకెళ్ళి రాత్రులు రాత్రులక్కడే వుండిపోతే భయమేస్తోం దండీ' అంటే 'పనిమనిషుందిగా— పడుకోమంటే పడుకుంటుంది..... మన అల్సేషియన్ కూడా వుంది కదా...... భయమెందుకు?' అంటాడాయన. 'మా అల్సేషియన్‌కి రోజుకి ప్రాయాపాయలు ఖర్చండీ.... ఈ గులాబీ బెంగుళూర్ నుంచి తెప్పించా. లోటరీ సెక్రటరీ అయినప్పుడు పార్టీకి రెండు

# సముద్రం-ఇస్మాయిల్

మంచం దగ్గరకు వెళ్తూ, "వాచీలు బద్దలు చేసేద్దామా!" అన్నాడు రవి.

"నువ్వు మీ రచయితల భాష మాట్లాడుతున్నావ్— చికాకు నాకు."

అతను నవ్వాడు.

"ఆగు... గుక్కెడు మంచినీళ్లు తాగి— దప్పిగా వున్నట్టుంది—" లేచి వెళ్లబోతూ వసుంధర అంటే, "వెటూర్పులాయె మరి!" అన్నాడు రవి.

నవ్వుతూ వెళ్లి గ్లాసులో నీళ్ళు సగానికైనా తాగకుండా వచ్చేసింది వసుంధర— సంతోషం ఉబుకుతుంటే— గుండెలో. గొంతులో.

అతను వసుంధర్ని దగ్గరకు తీసుకోబోతున్నాడు: కాలింగ్‌బెల్ రింగ్‌మంది.

ఇద్దరూ వులిక్కి పడ్డారు. గాబరా పడ్డారు. అర్థంకాని చూపులతో మొగాలు చూసుకున్నారు.

గబగబా మంచందిగి కుర్చీ దగ్గరకుపోయారు. ఆదరాబాదరా బట్టల్ని లాక్కున్నారు.

పాములు— అనుకున్నాడు రవి.

కాలింగ్‌బెల్ అలాగే మోగుతోంది.

వసుంధర చికాగ్గా, కోపంగా, అసంతృప్తిగా రవి వైపు చూసింది. కాలింగ్‌బెల్ మోగుతున్న వైపు చూసింది.

"వస్తున్నా!" అంటూ అరచి, "లవి బట్ట లేసుకో తొరగా.."— లంగా వేసుకుంటూ— "ఆయనగారి కొంపతీసి....." — 'బ్రా' వేసుకుని, జాకెట్ తొడుక్కుని— (రవి ప్యాంట్ తొడిగేసుకున్నాడు— అండర్వేర్‌ని ప్యాంటు జేబులోకి కుక్కేసి)— "ఇదిగో..."— జాకెట్టు గుండీలు పెట్టుకుంటూ— "ఈ గదిలోనే వుండు. —చీర కట్టుకుంటూ— (రవి ప్యాంట్ గుండీలు పెట్టేశాడు బనీను వేసుకుని......)— "తలుపే సేస్తా.... మీరూ ఆయనా....."— కుచ్చిళ్ళు సరి చేస్తూ— "మా గదిలోకి వెళ్లిపోతాం..."— తల సరి చేసుకుంటూ— (రవి స్లాక్‌షర్ట్ వేసేసుకుని—) — "తర్వాత నువ్వు వెళ్లిపోదువు గాని వీల్చూసుకుని...."— కొంగు కప్పుకుంటూ— (స్లాక్ గుండీలు పెట్టుకుంటున్నాడు రవి.)— "వస్తున్నా.."

కిందకు వెళ్లబోతూ రవి పూర్తిగా కాల్చని సిగరెట్‌నీ, తను పూర్తిగా తాగని నీళ్లగ్లాసునీ చూసింది వసుంధర—

విటూర్చి, "లవి సిగరెట్ బయటపారేయ్." అంటూ అతనున్న గది తలుపుకి బయటినుంచి గొళ్లెంవేసేసి, కిందికి పరుగెత్తింది.

తను కిందపడేసిన సిగరెట్‌ని తీసి సిగరెట్‌పెట్టెలో పెట్టేశాడు రవి. సిగరెట్‌ని కాలితో కింద రాసి నప్పుడైన నుసిని పాదంతో తుడిచేశాడు.

గదిలో గోడలు దగ్గరకు జరుగుతూ తనని జీవసమాధి చేస్తున్నట్టనిపించింది అతనికి. రాకపోయినా బావుండేది. వర్షంపడుతున్నా వచ్చా.... ఛా! ఛా! మదర్శ్రావు వచ్చుంటాడు— సినిమాలో హీరోయిన్ తండ్రిలాగా— విలన్‌లాగా— ఇంత రాత్రి ఎవడేడవమన్నాడు వీణ్ణి. (టైం చూసుకున్నాడు.) ఎప్పుడో యింకా రెండు రోజులతర్వాత —మంగళవారం— వస్తానంది వసుంధర.... బ్యాడ్‌లక్.... రెయిన్‌కోటూ, బూట్లూ విప్పేస్తుంది వసుంధర? బూట్ల బురద గుర్తులు తుడిచేసింది— మంచిదే అయింది.

గదిలో ఉక్కపోస్తున్నట్టనిపించింది అతనికి. ఫ్యాన్ వేయాలనుకున్నాడు— భయంవేసి వేయలేదు. కేబిటుమాలతీసి మెడి టన్నీ, మెడనీ తుడుచుకున్నాడు.

గది తలుపు తెరుచుకుంది.

"బతికాం.... ఆయనకాదు.... పెరిగ్రాం..... రేపొస్తున్నారట..... మీ ఫ్రెండ్ క్రిష్ణ కూడా వస్తున్నాట్ట....." గదిలోకి వచ్చి అంది వసుంధర.

రవేం మాట్లాడలేదు. వసుంధరని చూస్తున్నాడు. ఆమె కళ్లలో అసంతృప్తి, మొగంలో ఏదో చికాకూ కనిపించాయి.

"హు ...."— నిటూర్చి— "కబుర్లేవైనా చెప్పు.... అబ్బ.... ఆ రెయిన్కోటూ, బూట్లూ ఎక్కడ దాయాలో తెలియక చచ్చాననుకో— తీసికెళ్లి బొగ్గులడబ్బాలో పారేసా..... రెయిన్‌కోటుకి మసై వుంటుంది. ఏమనుకోకు....." అని మంచం మీద కూచోబోయి— నెరవేరని కోరిక అక్కడ కూచుంటే జ్ఞాపకం వస్తుందని— కూచోకుండా వెళ్లి టేబుల్‌ముందున్న కుర్చీలో కూచుంది వసుంధర.

రవేం మాట్లాడలేదు. అక్కడ నిలబడివుండటం అతనికి వెగటుగా, చికాగ్గా వున్నట్టనిపించింది. "వెళ్లిపోతా వసూ!"— అనాలనుకున్నాడు. అనలేకపోయాడు. మగతనాన్ని కించపరచే మాటది— వసుంధర దృష్టిలో చులకనై పోవాలి. నేనుమగాణ్ణి.

తను పూర్తిగా తాగని గ్లాసులో నీళ్లని చూసి, అంతకుముందు రవి కిందపడేసిన సిగరెట్ అక్కడ వుందేమోనని చూసింది వసుంధర.

"కూచో." అంది.

"నే వెళ్తా. ఒంటి గంటవుతుంది."

"నీ యిష్టం."

"స్వీట్! డార్లింగ్! ఉండవా!" అంటూ తన భుజాలమీద చేతులువేసి మంచం దగ్గరకు లాగుతూ అడుగుతుందేమో అనుకున్నాడు రవి. మళ్లా అతనికి చికాకనిపించింది. కుర్చీలూ, మంచం, గోడలూ— గదిలో వున్నవన్నీ— చచ్చి కుళ్లి కంపుకొడుతున్న కుక్కలాగా అనిపించాయి. వెగటేసుకు వచ్చింది.

"వెళ్తామరి."

"రేపు సాయంత్రంరా! ఆయనా క్రిష్ణా వస్తున్నారు గదా. అంతా కబుర్లు చెప్పుకోవచ్చు."

"సరే."— రవి గదిలోంచి బయటకు నడుస్తుంటే అతని వెనకే నడిచింది వసుంధరకూడా. ఇద్దరూ కిందికొచ్చారు. కింద చిన్న బల్బు మసగ్గా వెలుగుతోంది.

"నీ రెయిన్కోటూ, బూట్లూ తెస్తానుండు." అని వెళ్లి వాటిని తీసుకొచ్చింది. రెయిన్‌కోటుని అందుకుని చేతిమీద వేసుకుని, బూట్లు వేసుకున్నాడు రవి.

వసుంధర తలుపుతీసింది. బయట చినుకుల్లేవు. ఆకాశం నల్లగావుంది. బయటికి వెళ్లబోతూ రవి వసుంధరని ముద్దు పెట్టుకోబోయాడు.

"నో రవీ! ప్లీజ్!" అతని మొగానికి చెయ్యి అడ్డుపెడుతూ అంది.

రవి కొంచమే కాల్చిపారేసిన సిగరెట్టూ, తను

కొంచమే తాగి వదిలేసిన మంచినీళ్లగ్లాసూ వసుంధర కళ్లముందు మెరిశాయి.

"వోకే! వెళ్తామరి." అని రవి అటూయిటూ చూసి పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ వెళ్తుంటే, కొంచెం దూరంగావున్న ఎలక్ట్రిక్‌స్తంభం లైటు వెలుగులో అతని నీడ పొడుగ్గా కనిపిస్తూ అతను వెళ్తున్నకొద్దీ పొట్టిదై పోతుంటే చూసి చిరు నవ్వు నవ్వుకుంది వసుంధర.

తలుపువేసి, వెళ్లి గదిలోవున్న అల్సేషియన్ కుక్కని వదిలింది. మేడ మీద గదిలోకి వెళ్లింది. తలనొప్పిగా వున్నట్టుంటే వెళ్లి మంచంమీద పడు కుంది అసంతృప్తి, నిరాశా గదిలో నిండిపోయా యనిపించింది.... రవి తనూ బట్టల్ని కుప్పగా పడ వేసిన కుర్చీ దగ్గర, కింద, అరచేయంతవున్న చిన్న నోటు బుక్కు కనిపించింది. మంచం దిగి వెళ్లి పుస్తకం తీసి చూసింది. కొత్త నోటు బుక్కు. రవిది. పుస్తకంలో మొదటి పేజీమీద 'రవి' అని వుంది. లోపల ఏవన్నా రాసుందేమోనని తర్వాత పేజీలు తిప్పింది. మూడో పేజీలో—

'యూనీఫ్రెంచ్
స్కూటర్
యార్డ్లీ పౌడర్
పాకోబా చీర
లిబర్టీ బ్రా } కొన్నాను.

ఇవన్నీ— యింకా ఎన్నో వుంటేగాని తనకు అస్తిత్వం వుంటుందనుకుంటుంది ఆడది. మొగాడి మీద ఆడదాని ప్రేమకు యివన్నీ పునాదులు. ఇన్నీ యిచ్చి — ఆడదాని కామం తీరేట్లు చేయాలి మగాడు. లేకపోతే వాడికి అస్తిత్వంలేదు ఆడదాని దృష్టిలో. మీనింగ్లెస్.... కథరాయాలి.'

ఇంకో రెండుపేజీల తర్వాత—

"Marriage is popular because it combines the maximum of temptation with the maximum of opportunity—Shaw"

దాని కిందే—

'విజయవాళ్లో ఎండలు, కొండలు, మండలు—
దాని తర్వాతపేజీలో
"దట్టమైన అడవులలోని నిగూఢరహస్యాలు
దాచుకున్న కన్నులు కలదానా ఆడదానా.......
నాకు తల్లివి చెల్లెలివి చెలివి
నన్ను కౌగలించుకున్న పెద్ద పులివి."
ఎంత బాగా చెప్పాడు తిలక్—'

ఆ తర్వాత పేజీల్లో ఏం రాసి లేదు.

ఆ నోట్‌బుక్కుని బయటకు విసిరి పారేయా లనుకుంది కానీ రవి అడుగుతాడేమోనని దాన్ని దిండుకింద పడేసి— పడుకుంది.

మరునటి రోజు పొద్దుట వస్తారనుకున్న క్రిష్ణా, సుదర్శన్‌రావూ రాలేదు.

సాయంత్రం వస్తాడనుకున్న రవీ రాలేదు.— ఎందుకో— వసుంధరకి అంతుపట్టలేదు.

సాయంత్రం అయిదింటికి క్రిష్ణా, సుదర్శన్‌రావూ వచ్చారు— విచారం కనిపిస్తున్నమొగాల్తో.

"వసూ! మన రవి చచ్చిపోయాడు." మెల్లగా అన్నాడు సుదర్శన్‌రావు.

"రవా? ఎట్లా!" అంది వసుంధర ఆశ్చర్యంగా. 'రాత్రేకదా వచ్చాడు' అనేయాలన్నంత ఆవేశం వచ్చింది వసుంధరకి. 'మన రవి' అనుకుంది— తర్వాత. అతని కళ్లూ, కాళ్లూ, పెదాలూ, తొడలూ — అన్నీ యిప్పుడు మట్టి. వాటికిప్పుడు అర్థం లేదు. మట్టి. మీనింగ్లెస్.

"ఆత్మహత్య చేసుకున్నాట్ట.... ఏదో పుస్తకం పబ్లిష్ చేసే సంగతి వాడితో మాట్లాడాలని బయల్దే రొచ్చాడుకృష్ణ. మధ్యాహ్నం మేంవస్తూ వస్తూ వాణ్ణి పలకరించి వద్దామని వాడింటి దగ్గర జీప్ ఆపాం.... గుంపూ...... ఏడుపులూ......" సుదర్శన్‌రావు చెప్పుకుపోతున్నాడు.

"ఏమొచ్చిందని ఆత్మహత్య చేసుకున్నాడు.... బుద్ధిలేని మనిషి...." శానిటరీటవల్సున్న బాక్స్‌లో వున్న రవిచ్చిన పెన్నూ, దిండుకిందున్న అతని నోటుబుక్కూ మురికి కాలవలో ఎక్కడైనా పారే యాలి— ఈయన లేనప్పుడు చూసి—

"వాడిపెళ్లాం— ఆడదాని అవసరం ఏమిటో తెలీనివాడివని— అందుకని ఇంకో మగాడితో వెళ్లి పోతున్నానని— వీడికో చీటి రాసిపెట్టి లేచిపోయిం దట నిన్నరాత్రి..... గొడవ గొడవగా చెప్పుకుంటున్నా రందరూ.... ."

"నిన్నరాత్రా?" అంది వసుంధర.

కొంచెమే కాల్చిన సిగరెట్టూ, కొంచెమే నీళ్లు తాగి వదిలేసినగ్లాసూ వసుంధరకి మళ్లా జ్ఞాపకం వచ్చాయి. ఇక్కడ మేం యిద్దరం చికాకుగా అసం తృప్తిలో వున్నప్పుడు అవిడెళ్లిపోయుంటుంది. హెల్.

"అవమానమని వాడు వురిపోసుకున్నాడు. వాడి తల్లీ చెల్లీ ఒకటే ఏడుపు.....ప్చ్... మంచి మిత్రుడు పోయాడు" అన్నాడు సుదర్శన్‌రావు— మాట్లాడ వలసింది అంతే అన్నట్టుగా.

క్రిష్ణ తలవంచుకుని కొంచెంసేపూ, తలెత్తి కొంచెంసేపూ ఒక కాలిమీదనుంచి యింకో కాలి మీదికి బరువు మార్చుకుంటూ నిలబడివున్నాడు.

"పద్లెండి.... ఆ సంగతులు తర్వాత మాట్లాడు కోవచ్చుగానీ.... స్నానాలు చేద్దురుగాని పదండి.... పాపం క్రిష్ణగారు షాక్ తినేసినట్టున్నారు— ఏమండీ?" నవ్వుతూ అంది వసుంధర.

"అఁ హఁ ! ఏంలేదండీ!" అన్నాడు క్రిష్ణ.

"ఒరే క్రిష్ణా! మేడమీదకెళ్లు— బాత్రూంది కెళ్లి నిమషంలో వచ్చేస్తాను." అన్నాడు సుదర్శన్‌రావు.

క్రిష్ణ మెల్లగా అడుగులేస్తూ మేడమీదకి వెళ్లాడు.

సుదర్శన్‌రావు బాత్‌రూంలోకి అడుగు పెట్ట బోతుంటే వెనకనుంచి అతని భుజాలు పట్టుకుని బాత్‌రూంలోకి వచ్చింది వసుంధర. ఎడంచేత్తో బాత్‌రూం తలుపు మూసుకునేట్టు తోసింది. సుదర్శన్‌రావుని గట్టిగా కౌగిలించుకుంది. మెడ మీద ముద్దుపెట్టింది.

"మీరు..... మీరు.... ఎంత మంచివారండీ—" అంది.

"ఎందుకట?" నవ్వుతూ అని, వసుంధరవైపు తిరిగాడు సుదర్శన్‌రావు.

ఎందుకో ఎట్లా చెప్పను. నో. ఈయన మనిషి.

"మీరొచ్చేశారుగా." అంది. ఈసారి అతని నుదుటిమీద ముద్దుపెట్టింది.

"అబ్బ! మరీ బాత్రూంలో ఏమిటిది— చికాగ్గా!" అన్నాడు సుదర్శన్‌రావు.

వసుంధరకి ఆ మాటకి చికాకనిపించింది. ఈయనో మళ్లా మామూలే— స్విచ్‌వేసినా వెలగని బల్బు— అనుకుంది—

కాని—

"మీరు మంచి వాళ్లోచ్...." అని సుదర్శన్‌రావు బుగ్గమీద చిటికేసి బాత్‌రూంలోంచి బయటి కొచ్చేసింది.

వెళ్లి టేబుల్‌మీదున్న రేడియో ఆన్చేసింది.



**సీరియల్**




**జరిగిన కథ**

భర్త సారథి ప్రోత్సాహంతో ఇందిర ప్రయివేటుగా చదివి బియ్యే పాసయింది. గిరి, పద్మ ఇద్దరు పిల్లలు కలిగారు. ఒకరోజు సారథి జ్వరంతో హఠాత్తుగా కన్ను మూశాడు. ఇందిర ఉద్యోగం చేయడానికి నిశ్చయించుకుంది. ఇంటిదగ్గర పరిస్థితులు నచ్చక, స్వర్ణ సహాయంతో హైదరాబాద్ వచ్చి స్వశక్తి మీద లెక్చరరు కాగల్గింది. గిరి ఎమ్మెస్సీ పూర్తి చేశాడు. అతను వ్యాపారం చేయడానికి సమ్మతించింది తల్లి. ఇందిరకు టైఫాయిడ్ రావడంతో పిల్లలిద్దరూ ఆందోళన చెందారు. ఇందిర జ్వరం నయమవుతుంది. అను పమ మీద తను అనురాగాన్ని వ్యక్తంచేస్తాడు గిరి.

# 11

వారం క్రితం ఓ చిత్రం జరిగింది. పెద్దత్తయ్య దగ్గర నుంచి ఉత్తరం వచ్చింది. "అను పుట్టినప్పుడే దాన్ని నా కోడలుగా చేసుకోవాలనుకున్నాను. మీ అందరితోటీ ఆ మాటే అన్నాను. ఇప్పటికయినా నా మాట నిలుపుకోవాలనే నా కోరిక. ప్రకాశానికి ఈ సంవత్సరం పెళ్లి చేయాలనుకుంటున్నాం. మరి నీ అభిప్రాయం తెలియజేయి. వాడు చదివిన చదువుకి, పదివేలు కట్నం ఇస్తామంటూ వస్తున్నారు. నువ్వు అంత ఎలాగూ ఇవ్వలేవని తెలుసు. కనీసం అయిదువేలయినా ఇవ్వకపోతే నలుగురిలో వాడికి చిన్నతనంగా వుంటుంది......." ఈ ధోరణిలో సాగిన ఉత్తరం చదువుకుని, "వదిన అన్న దాంట్లో తప్పేంలేదు. ఆ మాత్రం ఇవ్వకపోతే ఎక్కడా కుదరదు. నీ పరీక్షలయిపోగానే ముహూర్తం పెట్టించమని వ్రాస్తాను. నీ గురించిన దిగులు ఇంక నాకేం వుండదు." అంది అమ్మ.

ఆ మాటలు విని తెల్లబోయి. "నీకేం మతి లేదు కదా." అంది అను.

"అంత డబ్బు ఎక్కడనించి తెస్తాననే కదూ నీ భయం— పేపదంతా ఆలోచించాను. ఈ ఇల్లు అమ్మేస్తాను. ఏడు వేలో ఎంతో నీ పెళ్లికి అయిపోతే మిగిలింది బ్యాంకిలో వేస్తాను." అతి మామూలుగా అంటున్న మాటలకి వుడికిపోతూ "అవును ఉంటున్న ఇల్లు అమ్మి నా పెళ్లిచేసి పంపించేసి నువ్వూ తమ్ముడూ నడివీధిలో నిలబడుదురుగాని." అంది తను.

"నడివీధిలో నిలబడటం ఏమిటి? ఇల్లు అద్దెకు తీసుకుంటాను. అందరికీ స్వంత ఇళ్లే వుంటాయా— అప్పటి సంగతి వేరు— ఇప్పుడు బోలెడు ట్యూషన్లు వున్నాయి మాకేం భయంలేదు. ఎలాగో మూడు నాలుగేళ్లు కళ్లు మూసుకుంటే శశి చేతికందుతాడు."

"అదే నేను చెప్పాలనుకుంటున్నది— ఈ నాలుగేళ్లు అయి వాడు ఉద్యోగంలో చేరేక నేను పెళ్లి పెళ్లి చేసుకుంటాను. ఇన్నాళ్లు నువ్వు కష్టపడి మమ్మల్ని ఇంతవాళ్లని చేశావు. ఇంక నుంచి నువ్వు విశ్రాంతి తీసుకో. నేను సంపాదించి వాడిని చదివిస్తాను."

అమ్మ కళ్లల్లో నీళ్లు తిరిగాయి. "నీ అభిమానం నాకు తెలుసు అనూ— అయినా నా బాధ కూడా నువ్వు కొంచెం అర్థంచేసుకో. ఎన్ని కష్టాలు పడినా నాబాధ్యతని తీర్చుకోగలిగాననే తృప్తి నాకు మిగలనీ— మొన్న రెండు రోజులు జ్వరం వచ్చేసరికే హడలిపోయాను. ఈ గుక్కెడు ప్రాణం మీది తీపిచేతకాదు. మీ రిద్దరూ ఇంత ప్రపంచంలో నిరాధారంగా మిగిలిపోతారనే భయంతో— శశి విషయంలో నాకంత బెంగలేదు. ఆడపిల్లవి నీ జీవితానికి ఓ గమ్యం అంటూ ఏర్పరచకపోతే తల్లిగా నా కర్తవ్యం నెరవేరలేదన్నమాటే. ఈ ఒక్క బాధ్యత తీరిపోతే తరువాత ఏం జరిగినా నాకు దిగులు లేదు. శశిని నువ్వు చూసుకుంటావు."

"నీ బాధ్యత తీర్చుకోవాలనే ఆరాటమే కాని, కుటుంబానికి కాస్తయినా సహాయపడ్డాను అనే తృప్తి నాకు కలిగించాలనుకోవు. నేను కృతఘ్నురాలిగానే వుండిపోవాలని నీ కోరిక కాబోలు."

"నువ్వు నాకు చూపించాల్సింది కృతజ్ఞత కాదమ్మా, అభిమానం— పిల్లలకోసం ఎన్ని కష్టాలు పడవలసి వచ్చినా తల్లి బాధపడదు. అయితే వాటి అన్నింటికీ ప్రతిఫలంగా ఒక్కటే కోరుకుంటుంది. అదే పిల్లల శ్రేయస్సు. అది చూడగలిగినవాడు తను పడిన శ్రమ, కష్టం అంతా మరిచిపోతుంది— నామాట విను— ఈ పెళ్లి జరిగిపోతే నా గుండెల మీద కుంపటి దించుకున్నట్లే వుంటుంది— నేను నిశ్చింతగా బతకగలుగుతాను." అంది బతిమాలు కుంటూ.

"సరే అయితే నువ్వుకూడా నాది ఓ మాట వినాలి. నా పెళ్లికోసం బోలెడు డబ్బు ఖర్చుచెయ్యటము నా కిష్టంలేదు. కట్నం లేకుండా అయితే చేసుకుంటాను."

"అదెలా కుదురుతుంది— కట్నం తీసుకోకూడదనడం, ఇవ్వం అనడం అన్నీ ఉపన్యాసాలలో మాటలే. అది ఆచరణలోకి రావటం లేదు— అయినా అంత మంచి సంబంధం అయిదువేలకే కుదరటం మన అదృష్టం అనుకో— ప్రకాశం చదివిన చదువుకి వాళ్లకివున్న ఆస్తికి............"

"అబ్బబ్బ నా కవన్నీ చెప్పకు. ఆ ప్రకాశం కాకపోతే మరో చంద్రం— అయినా అత్తయ్య అంత నిర్మొహమ్మాటంగా, మేం చాలా గొప్పవాళ్లం మా అంతస్తుని మీరెలాగూ అందుకోలేరు, అయినా దయదలచి మీ అమ్మాయిని చేసుకుంటున్నాం అన్న ధోరణిలో వ్రాస్తుంటే, ఎలాగయినా ఆ సంబంధం కలుపుకోవాలని నువ్వు ఆరాటపడటం ఏం బాగుండ లేదు. నాకీ సంబంధం ఇష్టంలేదు." అని. ఒక్క క్షణం ఆగి, గారంగా అమ్మ మెడచుట్టూ రెండు చేతులూవేసి చిలిపిగా ఆమె కళ్లల్లోకి చూస్తూ, "అయినా కొంగ కాళ్లు, గద్ద ముక్కు, పిల్లి కళ్లూ, బావ ఏం బాగుంటాడని— నీ కంతకన్నా ఎంతో మంచి అల్లుడు........" తన చిలిపి తనానికి అమ్మ నవ్వేసింది...

ఆ రోజు హాస్యానికే అన్నా ఈ రోజు........

"అక్కాయ్." —

తమ్ముడి పిలుపు విని వులిక్కిపడి వెనక్కి తిరిగింది, ఆలోచనల ధోరణిలో ఇల్లుదాటి నాలు గడుగులు ముందుకి వెళ్లిపోయిన అనుపమ.

"అయితే అక్కా, పట్టపగలు నడి రోడ్డు మీద నడుస్తూ కలలు కంటున్నావు, రాబోయే బావని గురించేనా?" అమాయకంగా మొహం పెట్టి అడిగాడు శశి, లోపలికి వస్తున్న అక్కగారిని.

"ఏడిశావ్." ముద్దుగా వాడి బుగ్గ గిల్లింది అనుపమ.

వేయి దీపాలకాంతిలో వెలిగిపోతున్న కూతురి మొహం చూసి కారణం ఏమయి వుంటుందో వూహించుకోలేక ఏమిటన్నట్లుగా చూసింది యశోద.

"అమ్మకి ఎలా చెప్పటం? ఛ. సిగ్గేస్తుంది బాబూ." కెంపు రంగుకి తిరిగిన మొహంలో కోపాన్ని అభినయిస్తూ,

"పి. యు. సి. ప్యాసు కాబోతున్న మొగ కుర్రాడివి. నువ్వు ఇంట్లో కూర్చుని నా చేత బజారు పనులు చేయిస్తావు. సిగ్గులేదూ." అంది.

"నేనేం ఇంట్లో కూర్చోలేదు. అది అది అంటి పోయి ఇప్పుడేవచ్చాను." ఓ చేత్తో సేద దీర్చుకుంటూ, మరో చేత్తో ప్యాకెట్టు అందుకున్నాడు గిరి.

* * *

ఇందిరకి పథ్యంపెట్టి నాలుగు రోజు లయింది. ఇంట్లో పనులన్నీ కామేశ్వరమ్మగారు చూసుకుంటోంది— ఉన్న మరొక్క ప్రాక్టికల్‌కి శ్రద్ధగా ప్రిపేర్ అవుతోంది పద్మ. గిరి ఆఫీసుకి వెళ్ళి వస్తున్నాడు. పాపం రోజూ ఎంతో ఆశతో చూస్తున్న అతనికి ఆ నాలుగు రోజులూ నిరాశే మిగిలింది. చివరికి యాదాలాపంగా అడిగినట్లు పద్మని, "అనుపమ రావటంలేదేం." అని అడిగాడు.

"నన్ను అడిగితే నాకేం తెలుస్తుంది. అయినా అస్తమానూ మన యింటి చుట్టూ తిరిగితే ఎలా, తను చదువుకోవద్దూ. పోనీ రేపు చెప్తాలే." అంది ఆ పెంకి పిల్ల.

రాబోతున్న నవ్వుని అణుచుకుని చెల్లెలివంక ఓసారి చురుగ్గా చూసి మొహం తిప్పేసుకున్నాడు గిరి.

అన్నంతిని చెయ్యి కడుక్కుంటూ, "అనుపమ వచ్చి చాలా రోజులయినట్లుంది కదూ." అంది ఇందిర.

అక్కడే కూర్చుని పుస్తకం చదువుకుంటున్న గిరి గుండెలు కొద్దిగా దడదడలాడాయి, ఏదో చెప్పాలని తెరిచిన నోరు ఎదురుగా చెల్లెలువుందన్న సంగతి గుర్తువచ్చి మళ్ళీ మూతపడిపోయింది.

పద్మ ఓరగా అన్నగారివంక చూస్తూ, "మీరు అంతా ఆ అమ్మాయికి పరీక్షలు అనే సంగతి మరిచిపోయినట్లున్నారు. రేపు మధ్యాహ్నంతో ఈ గొడవ వదిలిపోతుంది లెండి. రమ్మని చెప్తాను. ఇందాక అన్నయ్య కూడ.........." చెల్లెలి గొంతులో కొంటెతనానికి ఉలిక్కిపడి, "రావటం లేదేమని వూరికే అడిగాను." అని అక్కడ్నుంచి వెళ్ళిపోయాడు గిరి.

ఇందిర ముసి ముసిగా నవ్వుకుంది.

తల్లి ఎంగిలి కంచం తీసుకు వెళ్ళి బయట పెట్టి వచ్చింది పద్మ. మంచం దగ్గరగా వేసిన టేబిల్ శుభ్రంచేసి పక్కకి జరిపేసింది. ఇంతసేపూ, ఏదో అడగాలని ఇందిర, ఏదో చెప్పాలని పద్మా అనుకున్నా ఇద్దరూ మౌనంగానే వుండిపోయారు.

కాస్సేపటి తరువాత పిల్లిలా అడుగులు వేసుకుంటూ వచ్చిన చెల్లెలు జడ గట్టిగా పట్టిగుంజుతూ "నిన్నెవరు అధిక ప్రసంగం చెయ్యమన్నారు." అన్నాడు గిరి తెచ్చిపెట్టుకున్న కోపంతో.

"ఎవరా? ముందు జడవదులు చెప్తాను." అని బలవంతాన అన్నగారి చేతులు విడిపించుకుని,

"అమ్మతో ఎలా చెప్పాలా అని మువ్వు ఇన్నాళ్ళనుంచీ లోలోపలే బాధ పడుతూంటే జాలేసి నేనే చెప్పాను." అంది.

"ఉద్ధరించావు."

"నిజంగానే. చూస్తూండు రేపు అనుపమ వాళ్ళింటికి కబురుచేసి లగ్నం కూడ పెట్టించేస్తుంది అమ్మ. నీ పని యింత తేలికగా నెరవేర్చినందుకు నువ్వు నాకు జీవితాంతం కృతజ్ఞుడివై వుండాలి." అంది అన్నగారికి ఎదురుగా టేబిల్‌మీద కూర్చుంటూ,

అభిమానంగా చెల్లెలి ముఖంలోకి చూస్తూ "అలాగా?" అన్నాడు గిరి నవ్వుతూ.

"నీతోనువ్వు అలా మురిసిపోతే లాభంలేదు. చెప్పు నాకేమిస్తావ్?"

"నువ్వే అడుగు."

"ఛ. అడిగి తీసుకోటంలో గొప్పేముంది. నువ్వే సంతోషంగా ఇవ్వాలి కాని."

"సరే. ఇస్తాను."

"ఏమిటది?"

"నేను మాటలవాడిని కాదు." సంతోషంగా చెల్లెలి బుగ్గమీద చిటికవేశాడు గిరి.

పద్మ ఏదో అడగబోయింది.

"పథ్యం తినగానే అది పడుకుని నిద్దరపోతుందేమో. కాస్సేపు అక్కడ కూర్చోకుండా ఇక్కడేం చేస్తున్నార్రా?" అంటూ, పొపు ఘాటుకి తెరలు తెరలుగా వస్తున్న దగ్గుని ఆపుకుంటూ గట్టిగా అరిచింది కామేశ్వరమ్మగారు.

పద్మ మొహం చిట్లించి "మనిద్దరం సరదాగా నవ్వుతూ మాట్లాడుకోడం ఈవిడ కెందుకో ఇష ●



# అంతస్తులు - అభిమానాలు

వుండదు." అని విసుక్కుని,

"ఈ ఒక్కరోజుకి నేను కాస్త చదువుకుంటాను నువ్వు వెళ్లి కూర్చో." అంటూ పుస్తకం తెరిచింది.

* * *

తలగడల మీద వాలి కూర్చుని, గుమ్మంలో కూర్చున్న నరసమ్మ చెప్తున్నది వింటోంది ఇందిర.

'దాని మొగుడు దాన్ని ఎన్నిసార్లు వదిలేసి వెళ్లిపోయాడో, చేతిలో వున్న డబ్బు అయిపోగానే తిరిగి వచ్చి, పది మంది ముందు, 'ఇంక బుద్ధిగా వుంటాను' అంటూ ఎలా లెంపలు వాయించుకునే వాడో అన్నీ కథలుగా చెప్తోంది అది.

"ఆడు కుదురుగా వుంటే నాకీ కష్టం అక్కర్లేదమ్మగారు, మారాజులా ఇంట్లోనే కూర్చుందును. ఎప్పుడు వస్తాడో తెలియదు. ఎప్పుడు వెళ్లిపోతాడో తెలియదు. పిల్లల్ని వస్తు పడుకోపెట్టలేను కదా. అందుకే మీలాంటోరివి రెండిళ్లు నమ్ముకుని పని చేసుకుంటున్నాను." అంది అది.

ఇందిర లోలోపలే నిట్టూర్చింది.

"పిల్ల పెళ్లి చెయ్యాలి. డబ్బు కావాలి. అందుకే కదా చీటీ కడుతున్నాను........" చెప్పుకుపోతున్న నరసమ్మ కాలింగ్‌బెల్ మోగగానే లేచి వెళ్లింది.

బిడియంగా ఇటూ అటూ చూసుకుంటూ అనుపమ, ఆమె వెనుక యశోద లోపలికి వచ్చారు.

వీధి తలుపులు దగ్గరగావేసి పెరట్లో పని చూసుకోడానికి వెళ్లిపోయింది నరసమ్మ.

యశోదని పలకరించి కుర్చీ చూపించి, అనుపమని ఆదరంగా చెయ్యి జాపి అందుకుని ప్రక్కనే కూర్చోపెట్టుకుంది ఇందిర.

"ప్రాక్టికల్సు బాగా చేశావా— మీరు సరిగ్గా చదువుకోకుండా మధ్యలో నా జ్వరం ఒకటివచ్చింది. మిమ్మల్నందర్నీ బాగా ఇబ్బంది పెట్టాను." అంది.

"ఇబ్బంది ఏముంది. ఏమీ లేదు." అంది యశోద ఆ మాటలు తనని ఉద్దేశించికూడ అందని గ్రహించి.

"లేకపోతే మాత్రం, మేం రోజంతా కూర్చుని చదివే వాళ్లమా? బోలెడు వ్యవధి కూడ వుందిగా." అని, "పద్మ ఏదీ - నన్ను రమ్మనమని తను ఎక్కడికి వెళ్లింది." అంది అనుపమ.

"అమ్మ వెళ్లిపోతానని తొందర పడుతోంది. నాలుగూ చూపించాలని తీసుకు వెళ్లారు. ఇప్పుడే వచ్చేస్తారు." ఇందిర తన మొహం వంకే చూస్తూ మాట్లాడుతున్న సంగతి హఠాత్తుగా గుర్తు వచ్చినట్లు అనుపమ చటుక్కున తల వంచేసుకుంది. తన కళ్లల్లోకి చిత్రమైన కాంతి వచ్చిందనీ, చెక్కిళ్లు ఎర్ర రంగు పులుముకున్నాయనీ ఆ అమ్మాయికీ తెలుసునురి.

"అప్పుడే వెళ్లిపోతారా. మీరు ఇంకా బాగా లేచి తిరగలేరు కదా. మరికొన్ని రోజులుంటే పద్మకి సాయంగా వుంటుంది. అసలు ఆవిడున్నారంటే మా కందరికీ కూడ ధైర్యంగా వుంది. లేకపోతే ఎలాగో వీలుచేసుకుని వచ్చి చూసి వెళ్లకుండా వుండేదికాదు మా అను." అంది యశోద.

ఇందిర అభిమానంగా అనుపమ వెన్ను నిమురుతూ, "నాకు జ్వరం తగ్గిపోయినా, ఎంతమంది వున్నా అనుపమ రోజూ కనిపిస్తేనే కాని నాకు తోచదు." అంది.

"అలాగే వస్తూంటాను." అంది అనుపమ ఎలాగో అయిపోతూ.

"వస్తూంటాను అంటే కాదు. ఇక్కడే వుండిపోవాలి." ఆమె కళ్లు చిత్రంగా నవ్వుతున్నాయి. అనుపమ కళ్లు లజ్జాభారంతో వాలిపోయాయి.

"ఏమంటారు? అనుపమని మా యింట్లో వుంచేసుకుంటాం." అంది ఇందిర తలతిప్పి యశోదతో.

ఆవిడ చెప్తున్నది పూర్తిగా అర్థం చేసుకోలేక, అసలు అర్థం చేసుకోడానికి మానడానికి తను విన్నది పొరపాటేమో అనే అయోమయంలో పడిపోయిన యశోద,

"అది ఎప్పుడూ నన్ను విడిచి ఎక్కడా వుండలేదు." అంది ఇబ్బందిగా.

తల్లి అమాయకత్వానికి అనుపమ నవ్వుకుంది. ఇందిర కూడ చిన్నగా నవ్వుతూ,

"నిజమే. ఆడపిల్లలు ఇక్కడకీ అక్కడికీ ఎందుకు వెళ్తారు? అత్తవారింటికి వెళ్లటం తప్పదు కదా. అనుపమ అలాగే వస్తుంది మా యింటికి." అంది.

క్షణం సంతోషంతో నోట మాట రాలేదు యశోదకి, అంతలోనే తన బాధ్యత గుర్తు వచ్చినట్లు,

"కట్నం అదీ........" యశోద మాట పూర్తి కాకుండానే,

"ఏమీ వద్దు మీ అమ్మాయి మాకు కట్నం" అంది ఇందిర.

"ఇదంతా మా అదృష్టం ......" అతి సంతోషంతో యశోద గొంతు పెగలలేదు కొద్దిక్షణాలు. తరువాత ఏదో చెప్పబోయేంతలో బయట గేటు దగ్గర హారన్ మోత, తరువాత పద్మ గలగల మాట్లాడేస్తున్న మాటలు వినిపించాయి. అనుపమ గుండె ఝల్లుమంది. మనస్సులో మెదులుతున్న మధుర భావాలు వదనంలో ప్రతిబింబించకుండా దాచుకోవాలని వ్యర్థ ప్రయత్నం చేస్తూ, "ఇంక మేం వెళ్తాం." అంది ఎలాగో లేచి నిలబడి. యశోద కూడ లేచింది.

అనుపమ అవస్థ గ్రహించిన ఇందిర చిన్నగా నవ్వుకుని, "కూర్చో తొందరేం........" అని ఇంకా ఏదో చెప్పబోతుంటే కామేశ్వరమ్మగారు లోపలికి వచ్చింది.

"ఈ అమ్మాయి మన పద్మ స్నేహితురాలు. ఆవిడ వాళ్లమ్మ." అని ఇద్దర్నీ పరిచయం చేసింది ఇందిర.

పద్మ లోపలికి వస్తూ అనుపమ మొహంలోకి చూసి కళ్లతోనే వెక్కిరించింది. అనుపమ మూతి ముడుచుకుంది.

మ్యూజియం అంతా తిరిగివచ్చి కాళ్లనొప్పులతో కుర్చీలో కూలబడిన కామేశ్వరమ్మగారు అది గమనించలేదు కాని యశోద ఇందిర నవ్వుకున్నారు.

గేటుదాకా వచ్చిన అనుపమ అప్రయత్నంగానే వెనక్కి తిరిగి గదికిటికీవేపు ఆశగా చూసింది. మరుక్షణంలోనే సిగ్గుపడుతూ మొఖం తిప్పేసుకుంది.

"ఆ అమ్మాయి ఎలా వుంది." అంది ఇందిర, వాళ్ళు వెళ్ళిపోయాక తల్లితో.

"ఏం? కొడుక్కి చేసుకోవాలనా?" అంది కామేశ్వరమ్మగారు ఇందిర ఉద్దేశ్యం పసిగట్టినట్లు.

"వూఁ. ఎలావుంది?"

"పిల్లకేం లక్షణంగా వుంది— కాని బొత్తిగా లేని వాళ్ళల్లా వున్నారు. తల్లి వంటిమీద, పిల్ల వంటి మీదకూడ ఎక్కడా వో బంగారపు పోచ లేదు." అంది ఆవిడ తన మామూలు ధోరణిలో.

ఇందిర మనస్సు చివుక్కుమంది.

అవతలగదిలో అదే విషయం గురించి సరదాగా కబుర్లు చెప్పుకుంటున్న గిరి, పద్మ, తెల్లబోయారు.

"ఛ. ఈవిడ బుద్ధి ఎప్పుడూ ఇంతే. డబ్బు, బంగారం వీటి మీదే వుంటుంది, ఈవిడ దృష్టి అంతా— ఈవిడ వెళ్ళిపోయిందాకా తనని ఇక్కడికి రావద్దని చెప్పేస్తాను." అన్నాడు గిరి చిన్నబుచ్చుకుని.

"వాళ్ల డబ్బు బంగారం మనకెందుకమ్మా, కావలసింది బంగారంలాంటి పిల్లగాని" అంది ఇందిర చివరికి.

"బాగుంది— ఇచ్చి పుచ్చుకునేటప్పుడు ఎన్ని చూసుకోవాలి ఒక్కగా నొక్కడు వాడి ముద్దు ముచ్చట్లు అన్నీ తీరాలి— పద్మకి లాంఛనాలు అవీ సరదా తీరాలి. అవి ఏవీ లేకుండా, ఎర్రగా బుర్రగా పిల్ల బాగుందని మోజుపడిపోకు".

"కట్నం తీసుకోవాలని మాకెవరికీ లేదు..." ఇందిర మాట పూర్తి కాకుండానే,

"సరే కట్నంవద్దు, లాంఛనాలు వద్దు. మన వాళ్లందరూ సరదాగా పెళ్లికి వస్తే మూడు పూటలు భోజనం అయినా పెట్టాలా? లేకపోతే నీకెంత చిన్నతనమో ఆలోచించు— ఇలాంటి విషయాలేవీ నీకు తెలియవు. నాన్నగారు చూసి చేస్తారులే— అయినా ఇరవై ఏళ్ళ వస్తున్న కూతుర్ని వదిలేసి కొడుకు పెళ్లికి తొందర పడుతున్నావేమిటి? ఇప్పటిదాకా చదివింది చాలు. ముందు దానికి ఏదైనా సంబంధం చూసి ముడి పెట్టు— అయినా ఆడదానివి నువ్వేంచూసుకో గలవు. నే వెళ్లి నాన్నగారికీ అన్నయ్యకీ చెప్తాను."

ఇంక ఆవిడతో ఏం మాట్లాడి లాభంలేదని ఒక్క నిట్టూర్పు విడిచి కళ్ళు మూసుకుని పడుకుంది ఇందిర.

"పొద్దుపోయింది. పడి కట్టుకుంటావు." అంటూ కామేశ్వరమ్మగారు లేచి వెళ్లిపోయింది.

* * *

"ఇంక రేపు తప్పకుండా పంపించేయమ్మా. వాళ్లకి ముందుగా వ్రాసేదేమిటి. తెలిసిన వూరు అయెను. ఇక్కడ ఎక్కించేస్తే అక్కడ దిగి యింటికి వెళ్లిపోతాను." అంది కామేశ్వరమ్మగారు మధ్యాహ్నం భోజనం చేసివచ్చి, చాప వాల్చుకుని పడుకుంటూ.

"తొందరేమిటి?" అంది ఇందిర తన మామూలు ధోరణిలో.

"వచ్చి పదిహేను రోజులు కావస్తోంది. ఇంకా ఎన్నాళ్ళుంటాను.— అక్కడంతా ఎలా వున్నారో ఏమిటో నా ప్రాణాలన్నీ వాళ్లమీదే వున్నాయి. నీకు పథ్యం పెట్టాక మనం వ్రాసిన వుత్తరానికి ఆ గోపిగాడు వ్రాసిన జవాబు తప్పితే వాళ్ల దగ్గర నుంచి అసలు వుత్తరాలే లేవు. మీ నాన్నగారు వాళ్లు వచ్చారో లేదో. పెళ్లి ముహూర్తం ఏమయిందో ఏం తోచటంలేదు. రేపు వెళ్లిపోతాను."

ఆ రోజు అనుపమ విషయంలో అలాంటి ప్రస్తావన జరిగాక మళ్లీ ఆ సంగతి చెప్పనేలేదు. చెప్పకుండా వూరుకోడానికి ఇందిర మనస్సు అంగీకరించటం లేదు. ''అందరూ ఆలోచించినట్లే కట్నాలూ కానుకలూ అంది కాని, మేం నిశ్చయం చేసుకున్నామంటే ఏమీ అనలేదు. చెప్పకపోతే నేనేం పరాయిదాన్నా, మనవడి పెళ్లి అంటే సంతోషించనా, ఇన్నాళ్ళూ వున్నా చెప్పేరు కాదు అని తరువాత బాధపడుతుంది. ఎలాగూ వాళ్లచేతిమీద జరగాల్సిన శుభకార్యమే." అనుకుని,

"ఎల్లుండి గిరి పుట్టిన రోజు. ఎలాగూ వచ్చావుగా అవాళ్టిదాకా వుండు. అవతల ఎల్లుండి వెళ్లి పోదువుగాని." అంది.

"ఎల్లుండే ఏమిటి......." కామేశ్వరమ్మగారు తెల్లబోతుంటే,

"అవును తారీకుల ప్రకారం." అంది ఇందిర.

రాత్రి గిరి యింటికి రాగానే పద్మ పరుగు పరుగున గదిలోకి వెళ్లి, "అన్నయ్యా, నీకో శుభ వార్త." అంది మెల్లిగ.

ఏమిటన్నట్లు చూశాడు గిరి. అతని మనస్సు అరక్షణంలో అనేకం వూహించుకుని ఏ నిర్ణయానికీ రాలేక పోయింది.

"రేపు నువ్వు త్వరగా, అంటే ఆఫీసు నుంచి తిన్నగా యింటికే వచ్చేయాలి."

"వచ్చి—"

"నన్ను తీసుకుని—"

"ఇదేం శుభవార్త......."

"పూర్తిగా చెప్పనీ— మనిద్దరం అనుపమ వాళ్ళింటికి వెళ్లి వాళ్లందర్నీ విందు భోజనానికి ఆహ్వానించాలి."

"ఎందుకూ?" తెల్లబోయాడు గిరి.

"అయ్యోరామ, ఇప్పుడు నీకేం జ్ఞాపకం వుండదులే. నీ పుట్టిన రోజుగా, ఆ శుభ సమయంలో, ఈ శుభవార్త అమ్మమ్మకి వినిపించేస్తుంది అమ్మ."

గిరి మొహం ఉదాసీనంగా మారిపోయింది. "నా కిష్టంలేదు పద్మా. అవాళ్టిలాగే అమ్మమ్మ మాట్లాడితే తను ఎంత బాధపడుతుంది. విందు భోజనానికి పిలిచి అందర్నీ అవమానించినట్లవుతుంది— అమ్మమ్మని వెళ్లిపోనీ, తరువాత ఉత్తరం వ్రాయొచ్చులే."

"నేనూ అలాగే అన్నాను— ఎలా వుంది అని. అడిగితే సలహా యిచ్చింది కాని నిశ్చయం అయిపోయింది అంటే ఏమీ అనదు, చెప్పకపోతేనే బాగుండదు అంటోంది అమ్మ. అయినా అందరి ఎదురుగా ఏమీ అనదులే అంటే మనం అంతా లేమా. తగినట్లు సమాధానం చెప్తాం."

గిరి ఏం మాట్లాడలేదు.

"నిజం అన్నయ్యా. నువ్వు భయపడుతున్నట్లు ఏం జరగదు." మరోసారి భరోసా ఇచ్చింది పద్మ.

క్షణం స్థిరంగా చెల్లెలి కళ్లలోకి చూసి చిన్నగా నవ్వుతూ, "సరే." అన్నాడు.

(సశేషం)





# స్మృతి రేఖలు

కుమారి సరస్వతీరావు

తెల్లవారబోతోంది. బద్ధకంగా కళ్ళునులుపుకొంటూ లేచాను. నెమ్మదిగా కిటికీ తలుపులు తెరిచాను. చలి ఎముకలు కొరికేస్తున్నట్లుగా వుంది. మంచు తెరల మధ్య నుండి ఎదురింటి మేడ అస్పష్టంగా కనిపిస్తోంది. అలాగే ఆ మేడ వైపు చూస్తూ నిలబడ్డాను ఐదునిముషాలలో మేడమీది కిటికీ తెరుచుకుంది. ఆమె అస్పష్టంగా కనిపిస్తోంది. కిటికీ మూసి దుప్పటి కప్పుకుని పడుకొన్నాను.

"ఈవరస నాకేం నచ్చలేదు." అన్నది సుజాత.

"ఏ వరస?" అన్నాను.

"రోజూ గమనిస్తూనే వున్నాను. లేవగానే కిటికీ తీస్తారు. ఎదురింటి పిల్ల కిటికీ తీసేవరకూ అలాగే చూస్తారు. ఆ పిల్ల కిటికీ తీయగానే ఆ పిల్ల ముఖం చూసి కిటికీ మూసేసి పడుకొంటారు. ఎవరైనా చూస్తే ఏమనుకొంటారు? ఆ పిల్ల కూడా రోజూ ప్రొద్దుటే కొంప ముంచుకు పోతున్నట్లూ ఆ కిటికీ దగ్గరే నిలబడుతుందేం ఖర్మ." విసుక్కొంటూ అన్నది సుజాత.

"అనవసరంగా ఆ పిల్లనెందుకు ఆడి పోసుకొంటావు." అన్నాను. శ్రీమతి చుర చురా నావైపు చూసి వెళ్ళిపోయింది.

నేను ఆలోచనలలో మునిగి పోయాను. ఆ రోజులు ఎంతో మధురంగా గడిచిపోయాయి. డిగ్రీ పుచ్చుకొని ఉద్యోగంలో చేరిన కొత్త రోజులు. ఇంకా కుర్రతనం వీడని రోజులు. ఉద్యోగం చేస్తున్నా, స్టూడెంట్స్‌లాగానే ప్రవర్తిస్తూ వుండే వాళ్ళం. ఆఫీస్‌కి దగ్గరగా వుంటుందని మా బంధువుల యింట్లో— అంటే ఈ యిల్లే—అద్దెకు దిగాను. మేడమీద రెండుగదులు. చక్కగా విశాలంగా వున్నాయి. నేను ఈ భాగంలోకి వచ్చిన వారం రోజులకే మా ఫ్రెండ్ రవికూడా ఈ భాగంలోకే వచ్చిచేరాడు. ఇద్దరం చాలా సరదాగా హాయిగా రోజులు గడిపి వేస్తున్నాం.

ఆ రోజు నాకు బాగా గుర్తు, సాధారణంగా అలాంటి రోజులు ఎవరూ మరిచిపోరు. ప్రతి ఆదివారం నేనూ రవీ కలిసి సినిమాకి వెళ్లేవాళ్ళం. ఆ ఆదివారం శ్రీ ఫోర్ట్వెంటీ సినిమాకి వెళ్ళాం. నర్గీస్ ఎంత బాగా యాక్టు చేసిందో, రాజకపూర్ ఆ సినిమాని ఎంత బాగా తీయగలిగాడో, శంకర్ జైకిషన్ ఎంత కష్టపడి అంత మంచి సంగీతాన్ని సమాకూర్చారో?— యివన్నీ మాట్లాడు తున్నాడు రవి సినిమానుండి రాగానే.

నాకు నిద్ర ముంచుకు వచ్చేస్తోంది. కన్నులు మూతలు పడిపోతున్నాయి.

"ఒరేయ్. పాటరా. లేవరా." నన్ను కుదుపుతూ లేపాడు రవి.

ఎదురింట్లో యెవరో హార్మోణి వాయిస్తున్నారు. దానికోసం మా వాడు నన్ను హడావిడిగా తట్టి లేపాడు.

"చార్ సౌ బీస్‌లో పాటరా" వుత్సాహంగా అన్నాడు.

"నన్ను లేపావంటే చంపేస్తాను. నిద్రపోనీ" అంటూ పడుకొన్నాను.

తెల్లవారుతూ వుండగా మెలకువ వచ్చింది. బయట వర్షంపడుతున్న చప్పుడవుతూవుంటే కిటికీ తలుపులు తీసి చూశాను. సరిగ్గా ఆ సమయానికే ఎదురింటి కిటికీ తలుపులుతెరుచుకొన్నాయి. ఆమె కిటికీ దగ్గర నిలబడి వుంది. ఆమె నావైపు చూడటంలేదు. నేను మాత్రం అలాగే ఆమెవైపే చూస్తున్నాను. ఆమె మంచి అందగత్తె. అపురూప సౌందర్యరాసి. అందాలబరిణ. ఆమె అందం ఎంతని చెప్పను? ఏమను చెప్పను? రెప్పవాల్చకుండా అలాగే చాలాసేపు చూశాను.

"ముఖం కడిగేవురా?" అరుస్తున్నాడు రవి.

"వస్తున్నా......" అంటూ కదిలాను.

నేను ముఖం కడుక్కుని వచ్చేసరికి ఎదురింటి కిటికీ తలుపులు మూసివున్నాయి. ఆ రోజుసాయంత్రము ఆఫీస్ నుండి రాగానే ఎదురింటి వైపు చూశాను. కిటికీ తలుపులు మూసేవున్నాయి.

మర్నాడు ప్రొద్దుట లేవగానే ఆ యింటివైపు చూశాను. ఆమె కిటికీ దగ్గర నిలబడివుంది. ఆమె ఒక్కసారైనా నావైపు చూడలేదు. రోజూ ఉదయం అలా చూస్తూనే వున్నాను.

నా విషయం మా రవిగాడికి కూడా తెలిసింది. "గట్టిగా చప్పట్లు కొట్టరా నీ ప్రేయసి యిటు చూస్తుందేమో" అంటూ జోక్స్ విసురుతూ వుండే వాడు. మరో రెండు వారాలు గడిచాయి. అలవాటు ప్రకారం కిటికీ దగ్గర నిలబడి చూస్తున్నాను. ఆమె ముఖం యిటు తిప్పింది. నా వైపే చూస్తోంది. ఆశ్చర్యపోయి అలాగే చూస్తూ వుండిపోయాను. ఎర్రగులాబీ మొగ్గలాగావున్న ఆమె పెదవులు మెల్లగా నవ్వాయి. వాటి మధ్య మల్లెలు వికసించి నట్లయింది. వెంటనే కిటికీ మూసికొంది. షాక్ తగిలినట్లయింది. ఈ విషయం మా రవిగాడితో చెప్పేను. నన్ను అభినందించాడు.

రోజులు సరదాగా గడుస్తున్నాయి. ఆమె ప్రతి రోజూ కాకపోయినా అప్పుడప్పుడూ నన్ను చూసి నవ్వుతోంది.

"మారేజి పార్టీ ఎప్పుడోయ్" అన్నాడు రవి.

"ఆమె అభిప్రాయం కనుక్కోందే......" అంటూ నసిగాను.

ఆ రోజు సాయంత్రం నేను ఆఫీస్ నుండి వచ్చేసరికి మా రవి ఒక చిన్న పిల్లని గదిలో కూర్చోబెట్టుకుని కబుర్లు చెప్తున్నాడు.

"ఎవ్వరాపిల్ల" అన్నాను.

"నీ మరదలు" అన్నాడు.

ముందు తెల్లబోయాను. తర్వాత అర్థంఅయింది. "నీకు ఎంతమంది అక్కయ్య లున్నారు" అన్నాను.

"ఒకే ఒక అక్కయ్య" ముద్దుగా మాట్లాడు తోంది ఆ పిల్ల.

"నీపేరు" బుగ్గమీద చిటికె వేస్తూ అన్నాను.

"అరుణ" అన్నది.

"మీ అక్కయ్య ఎంతవరకూ చదువుకొంది." అన్నాను.

"మా అక్కయ్యకి చదువు రాదు. నాకేవచ్చు. నాకు చదువు బాగా వచ్చు. నేను మూడో క్లాసు చదువుతున్నా తెలుసా?" గర్వంగా చెప్పింది అరుణ.

"మరి మీ అక్కయ్యకి చదువు రాదుగా. మరి నాన్ను వచ్చా." నవ్వుతూ అన్నాను.

"వూహు. అక్కయ్యకి సంగీతం వచ్చు. బాగా పాడుతుంది. పెట్టె వాయిస్తుంది." కళ్ళు తిప్పుతూ చెప్పుతోంది అరుణ.

"పెట్టేమిటిరా?" ఆశ్చర్యపోతూ అన్నాడు రవి.

"పెట్టె తెలియదూ పెట్టె. యిలా వాయిస్తారూ......." సైగ చేస్తూ అన్నది అరుణ.

"వో...... హార్మణా" అంటూ నవ్వాడు రవి.

"ఆ..... అదే....." అన్నది అరుణ.

"మీ అక్కయ్య పేరేమిటి?" అన్నాను.

"అరుంధతి....."

ఆ రోజు రవి నాకో ప్లాన్ చెప్పాడు. నా కిష్టమైన పాట పాడమని నేను అరుణతో అరుంధతికి కబురు చేయటం. అరుంధతి ఆ పాట పాడుతుందో లేదో చూడాలి. అరుంధతి నేను కోరుకొన్న పాట పాడితే ఆమెకి నేనంటే యిష్టం వున్నట్లే......

"మీ అక్కయ్యకి రార వేణూ గోపాలా పాటవచ్చా." అరుణని అడిగాను.

"వో...... నాకూ వచ్చు. రా....... ర..... వే...... ణూ......." అంటూ అందుకొంది అరుణ.

"నీకు కాదమ్మా. మీ అక్కయ్యకి వచ్చా....."

"అక్కయ్యకంటే నాకే బాగా వచ్చు. పాడనా... రా......... ర........."

"అరుణా ఆపమ్మా. మా అమ్మకదూ......"

"వూఁ. నేను పాడతాను...." రాగం అందుకొంది అరుణ.

"సరేపాడు......" అన్నాను.

తనకి వచ్చినంతవరకూ పాడింది అరుణ.

"ఇంట్లోకి వెళ్ళగానే మీ అక్కయ్యని ఈ పాట పాడమను. నువ్వు బాగా పాడావో, మీ అక్కయ్య బాగా పాడిందో తెలుస్తుంది. చెప్తావా......" అన్నాను.

"వో........"

"ఎవరు పాడమన్నారని చెప్తావు." అన్నాడు రవి.

"ఈయన....." నన్ను చూపిస్తూ అన్నది అరుణ.

"ఆయన పేరు నీకు తెలియదుగా." అన్నాడు.

"ఎదురింట్లో తెల్ల చొక్కా కాలేజి అబ్బాయి పాడమన్నాడని చెప్తాను." అని అన్నది.

"గట్టిపిండమే" అనుకొన్నాను.

"కాలేజీ అబ్బాయి కాదు. ఆఫీసులో పనిచేసే అబ్బాయని చెప్పు." అన్నాడు రవి.

అరుణ పరిగెత్తుకొంటూ వెళ్ళిపోయింది.

"ఆపిల్ల ఎలా తెలుసురా......" అన్నాను.

"నేను ఆఫీసునుండి వస్తూవుంటే, అరుణ స్కూల్ నుండి వస్తోంది. మీ అమ్మతో చెప్పి మా యింటికిరా చాకలెట్లిస్తానని చెప్పాను. లోపలికి వెళ్ళి ఐదు నిమిషాలలో వచ్చేసింది." అన్నాడు రవి.

పావుగంట తర్వాత హార్మణి వాయిస్తూ 'రా..... ర...... వేణూ.........' పాట వినపడింది. మారవి సంతోషంతో చప్పట్లు చరిచాడు.

మర్నాడు ప్రొద్దుట ఆమె నన్ను చూసి నవ్వింది. నావైపు చాలాసేపు చూసింది.

రోజులు హాయిగా దొర్లిపోతున్నాయి. నేనే పాడమని అడిగిన ప్రతిపాటా పాడుతోంది అరుంధతి.

"మీ అక్కయ్యకి పెళ్లి చేయాలను కొంటున్నారా?" ఒక రోజు అరుణని అడిగాను.

"నాకు తెలియదు. నేను పెద్దయ్యాక పెళ్ళి చేసుకొంటాను." అన్నది.

"పోనీ యిప్పుడే చేసుకో." అన్నాను.

"ఛీ.... నీకు తెలియదూ. చిన్నప్పుడు పెళ్లి చేయరు." నవ్వుతూ అన్నది అరుణ.

"ఇంటికి వెళ్ళగానే మీ అక్కయ్యని సినిమాలో నర్గిస్ పాడినపాట పాడమను." అన్నాను.

"ఏ సినిమాలో......" అన్నది అరుణ.

"మీ అక్కయ్యకి తెలుస్తుందిలే. మీ అమ్మా, నాన్నా ఎవరూ చూడకుండా అడుగు." అన్నాను.

"ఏం పరవాలేదు. రోజు అమ్మా, నాన్నా ఎదురుగానే చెప్తున్నాను. మొన్న అక్కయ్య పాడనంటే నాన్న కోప్పడి పాడించారు."

నాతల గిర్రున తిరిగిపోయింది.

"నిజంగానా?"

"నిజమే. మా నాన్న ఏమీ అనరు. మీరు ఏపాట పాడమన్నా అక్కయ్యచేత పాడిస్తారు." అన్నది అరుణ.

అరుణని పంపించి వూహాలోకంలో తేలిపోతూ ఆలోచిస్తున్నాను. ఆ రోజు రాత్రి మా రవి ఎదురింటి వాళ్ళ న్యూస్ కొంత సేకరించాడు. ఆయన మంచి ఆఫీసరు. ఇద్దరే కూతుళ్ళు. తెలుగువాళ్ళే కానీ మా కులంకాదు. అయినా తెగించాను. అరుంధతి మీద నమ్మకం వుంది. మర్నాడు నాన్న వుత్తరం వ్రాశారు. పెళ్లి చూపులకి రమ్మని. ఆ వుత్తరం చదివి అవతల పడేశాను. సాయంత్రం నీటుగా తయారై ఎదురింటికి వెళ్లాను. ఆయన నన్ను ఎంతో గౌరవంగా పలకరించారు.

ఇల్లంతా చూపించారు. మేడ చాలా బాగుంది. పై భాగంలో వాళ్ళుంటున్నారు. క్రింద ఏదో ఆఫీస్ వుంది.

"మా అమ్మాయి అరుంధతి" పరిచయం చేశారు.

"నమస్తే........" అన్నది అరుంధతి సూటిగా నావైపు చూస్తూ.

"ఎంత ధైర్యం" అనుకొన్నాను, ప్రతి నమస్కారం చేస్తూ.

"మీ పాటలు చాలా బాగుంటాయి" అన్నాను.

"ఏం బాగులే నాయనా. దాని దురదృష్టం అలా వుంది. ఎంత సంగీతం వస్తే ఏం లాభం. వో అయ్య చేతిలో పెట్టి భారం వదుల్చుకొనే ఆశ లేదుకదా. చూస్తూ చూస్తూ గుడ్డిదానిని ఎవరు కట్టుకొంటారు." అన్నా రాయన.

నా చెవులని నేనే నమ్మలేకపోయాను. అరుంధతి వైపు చూశాను. ఆమె నావైపే చూస్తోంది. కళ్ళల్లో నీళ్ళు తిరిగి వున్నాయి.

"వస్తానండీ......." అంటూ వచ్చేశాను. ఆయన పిలుస్తున్నా వినిపించుకోకుండా.

"ఆఫీసుకి టైం అవుతోంది లేవండి" శ్రీమతి అరుస్తోంది.

బద్దకంగా లేచాను.

"ఇంకా ఆ పిల్ల గురించి ఆలోచిస్తున్నారా?" నవ్వుతూ అన్నది సుజాత.

అరుంధతి కథంతా శ్రీమతికి చెప్పేశాను.

"అరుంధతికి కళ్ళు లేవని తెలియగానే పెళ్ళి చూపులకి పారిపోయారా" నవ్వుతూ అన్నది శ్రీమతి.

నేను సుజాతతో ఆ తర్వాత ఏం జరిగిందో చెప్ప బోతున్నాను. పక్కింటావిడ పిలిస్తే వెళ్ళింది సుజాత.

మరోవారం తర్వాత మామూలుగా ప్రొద్దుటే లేచి ఆమె వైపు చూస్తున్నాను.

"ఆమె పేరు అరుంధతి కాదు రాధిక. నాతో అరుంధతని చెప్పారే." అన్నది శ్రీమతి కోపంగా.

"అవును. ఈ పిల్లపేరు అరుంధతి కాదు. అరుంధతికి ఆపరేషన్ చేయిస్తే కళ్ళు వస్తాయన్నారు. రెండేళ్ళు ఆగాను. ఆపరేషన్ జరిగింది కానీ కళ్ళు రాలేదు. పైగా అరుంధతికి అప్పటికే టి. బి. ముదిరి పోయింది. అందుకే ఆమెని వదులుకున్నాను. అరుంధతి వాళ్ళ నాన్నగారికి, ఫారిన్‌లో ఏదో మంచి జాబ్ వస్తే వెళ్ళిపోయారు. ఆయన వెళ్ళిపోయిన తర్వాతనే మన పెళ్ళి స్థిరపడటం జరిగింది." అన్నాను.

"అరుంధతి రోజూ మిమ్మల్ని చూసి నవ్వేది అన్నారు....." నెమ్మదిగా అన్నది శ్రీమతి.

"అని అనుకొన్నాను. అరుంధతికి ఆ రోజులలో ప్రకృతి వైద్యం మొదలు పెట్టారు. ఉదయపు సూర్య కిరణాలు కళ్ళమీద పడాలని అలా నిలబడేది." అంటూ నిట్టూర్చేను. "ఈ పిల్ల ... అంటే రాధిక. గుడ్డి పిల్ల కాదుకదా" అన్నాను భయంగా.

"కాదు. మూగది" విషాదంగా అన్నది శ్రీమతి.



# ఎందుకని?



## పద్మనాభం

(ప్ర) భూమి గుండ్రముగాతిరుగును. ఎందుకు?

యస్. భాస్కరరావు, మహబూబ్‌నగర్.

జ : మనిషిలాగా అడ్డ దిడ్డాలుగా తిరగడం, పాపం దానికి చేత కాదుగా మరి.

(ప్ర) మగవారు కొందరు పత్రికలకు తమ రచనలను మగువల నామధేయాలతో పంపుతారు, ఎందుకు?

యస్. అనసూయ, హైదరాబాద్.

జ : మగతనం లేక.

(ప్ర) సినిమాల్లో విలన్‌లకు పాటలుండవు. ఎందుకు?

ఎస్. వి. ఎస్. గాంధి (ఖరగ్‌పూర్)




జ : తీరా హీరోయిన్ విలన్‌ను "లవ్" చెయ్యడం మొదలు పెడితే కథ అడ్డం తిరుగుతుంది అందుకు.

(ప్ర) అందమే ఆనందం అంటారు. అందాన్ని చూసి ఆనందించలేనివారి నేమనాలి?

ఆర్టిమస్ (బొబ్బిలి.)

జ : అంటే వేదాంతులనండి, వళ్ళు మండితే అసూయా పరులనండి.

(ప్ర) సినిమాలో నటించడం కేవలం డబ్బు కోసమా, లేక కీర్తి ప్రతిష్ఠలను పెంచుకోవడానికా?

యం. జితేందర్, నిర్మల్.




జ : నాయనా "ధనమూలమిదం జగత్". ముందు డబ్బుంటే తరువాత కీర్తిప్రతిష్టలు వాటంతటవే వస్తాయి.

(ప్ర) అత్యుత్తమ ప్రశ్నలంటే ఎలాంటివిసార్?

సి. జె. నాయుడు, తిరుపతి

జ : యిలాంటివిమాత్రం కాదు సార్.

(ప్ర) మన నిర్మాతలు సహజంగా ఉండేటట్లు సెక్సప్పీలు లేకుండా ఫిల్ములు తియ్యరు, ఎందుకు?

టి. సరస్వతిదేవి, కర్నూలు

జ : ఏం? సహజత్వంలో సెక్సు లేదని మీ ఉద్దేశమా?

(ప్ర) వెన్నెలలో చల్లదనం ఎందుకు?

జి. కోటయ్య, రామవరం.

జ : ఎండలో వెచ్చదనం ఉన్నందుకు.

(ప్ర) పూరకరారు మహాత్ములు. ఎందుకు?

యస్. రామచంద్రరావు, విజయవాడ.

జ : ఊరికే వస్తే పాపాత్ములంటారని!

(ప్ర) పెద్ద పెద్ద తారలందరు కళాసేవ చేస్తున్నామని చెప్పుకుంటూ నిర్మాతలతో బేరం చేస్తారు ఎందుకు?

పి. యస్. ఆర్. పట్నాయక్, కోరాపుట్.

జ : అదీ ఒక కళే!

(ప్ర) తెలుగు సినిమాల్లో ప్రేయసీ ప్రియులు ముద్దు పెట్టుకున్నపుడు—హాల్లో ప్రజలు ఘొల్లుమని నవ్వుతూ అల్లరి చేస్తారు. అదే దృశ్యం ఆంగ్ల చిత్రంలో ఉంటే ఎవరూ ఏవిధమైన శబ్దమూ చేయరు ఎందుకు?

బి. బి. రెడ్డి, సికింద్రాబాదు.

జ : వాళ్ళకూ మనకూ ముద్దు కద్దు. కాని మన సభ్యత కది రద్దు. యిప్పుడా గోడవెందుకూ? వద్దు. వద్దు!

(ప్ర) ఆకాశంలోని తారలకు మీకు ఏమిటి భేదం? ఎందుకు ఆ భేదం?

ఎ. వి. స్వామి, కరీంనగర్.



జ : అవి రాత్రిళ్ళు మాత్రమే కనిపిస్తాయ్. మేము పగలు, రాత్రి కనిపిస్తాం. భూమి మీద నివసిస్తాం.

(ప్ర) ఈమధ్య ప్రతిచిత్రంలోనూ ఒకే పాట రెండుసార్లు ఉంటోంది. ఎందుకు?

జి. యస్. చంద్రరేఖ, గుంటూరు.

జ : మీరు, మరచిపోదామనా, మరచిపోకుండా చెయ్యడానికి.

(ప్ర) అయ్యయ్యో, పిచ్చివాడు ప్రేమించగలడా?

యస్. హుసేన్, దేవరకొండ.




జ. ప్రేమించాకనే పిచ్చివాడయ్యాడేమో!

(ప్ర) పౌరాణికాలలో ''రొమాన్స్'' ఎందుకు?

కె. వి. యస్. ఎల్లాజీరావు, భిలాయినగర్.

జ. నాయనా! రొమాన్స్ ఈ రోజుల్లో కంటే ఆ రోజుల్లోనే ఎక్కువ వుండేది. రొమాన్సు లేకుండా ఏ పురాణం వుంది?

(ప్ర) సార్, సార్ అసలు సందేహాలెందుకు వస్తాయి?

కె. భారతి, గుంటూరు.

జ: అసలు మన దేహమే సందేహం కదా!

(ప్ర) లేతమనసులు చిత్రంలో మీ నటన చాలా చాలా బాగుంది. ఎందుకనంటారు?

జె. యస్. కిషోర్, అనకాపురం.

జ: నవరసాలు మిళితమైన ఆ పాత్రలో లేత తనం, జీవం కలిసి వున్నందుకు.

(ప్ర) సినిమాలో పల్లెటూరి అమ్మాయి పాట పాడేప్పుడు మద్రాసు పబ్లిక్ గార్డెన్స్ చూపిస్తా రెందుకు?

కె నిగమాంతం, కర్నూలు.

జ పబ్లిక్ గార్డెన్స్ - మద్రాసులో లేదు బ్రదర్! హైదరాబాద్‌లో వుంది. పాట బాగుంది, అమ్మాయి బాగుంటే ఏ గార్డెన్స్ అయితే ఏం బ్రదర్!

(ప్ర) మన చిత్రాలలో హీరో, విలన్ స్టంటు చేసేటప్పుడు పక్కన ఖాళీసీసాలు, డబ్బాలు ఎందుకు ఉంచుతారు?

పి. జగపతిరావు, మచిలీపట్నం.

జ: స్టంట్ కంటే వాటి మోత ఎక్కువ వినపడాలని.

(ప్ర) సినిమా పరిశ్రమయొక్క ముఖ్యోద్దేశ మేమిటి?

ఏ. సత్యనారాయణబాబు, తిరుపతిపాలెం.

జ: వినోదాన్ని, విజ్ఞానాన్ని, ఉద్యోగాన్ని కలిగించడమే!

(ప్ర) మిస్ వరల్డ్‌ను ఎన్నిక చేసినపుడు మిస్టర్ వరల్డ్‌ను ఎందుకు ఎన్నుకోకూడదు?

కె. సత్యనారాయణ, ఖమ్మం.

జ: ఎందుకు ఎన్నుకోరు? మిస్టర్ యూనివర్స్‌లు చాలమంది ఉన్నారండోయ్-మీరు ఎక్కువ స్త్రీ లోకంలో వుంటారనుకుంటా!

(ప్ర) కొంతమంది దర్శక నిర్మాతలు మన తెలుగు చిత్రాలలో కూడా ముద్దులు వుండాలని కోరుతున్నారెందుకు?

కొత్త నాగేశ్వరరావు, వేటెండ్ల.

జ: ముద్దులున్న సినిమాలు చూసి చూసి విసిగిపోయారనీ, ముద్దులూ, సుద్దులూ, చూస్తే మీకు కోపం వస్తుందనీ, ముద్దులైతే మీరు ముగ్ధులైపోయి కనక వర్షం కురిపిస్తారని...

(ప్ర) పెద్దలు సినిమాలు చూడవద్దంటారు ఎందుకు?

టి చంద్రమౌళి, కుమ్మరికుంట్ల

జ: వాళ్ళలాగే పిన్నలు చెడిపోతారని.

(ప్ర) నిర్మాతలు అసభ్యకరమయిన దృశ్యాలు తీయడం ఎందుకు? సెన్సారు వారి చేత కట్ చేయించుకోవడం ఎందుకు?

బి. పుష్పలత, వరంగల్.




జ: యింకా, యింకా వాళ్ళు తీసినా, వీళ్ళు కట్ చేసినా మీకోపమే.

**బహుమతి పొందిన ప్రశ్న**

★(ప్ర.) ఇంతగా నవ్విస్తున్న మీరు ఏదో ఒకనాడు మమ్మల్ని విచారములో ముంచేస్తారేమోనని భయంగా ఉంది.

వి. వి. ఎస్. ప్రసాదరావు, పర్చూరు.



జ: తనువులు శాశ్వతమైనవి కావు. ఎప్పటికైనా గాలిలో కలిసి పోవలసిందే! అప్పుడు మీ పూరిమైన ప్రయాణం చేస్తూ మిమ్మల్ని అడిగేది ఒక్కటే. "యిన్నాళ్ళు నన్ను చూసి నవ్వారు, యిప్పుడు నన్ను తలచుకొని నవ్వండి."

(ప్ర) మీ దగ్గర కూడా 'బుట్ట రాక్షసుడు' ఉన్నాడేమో అని నాకు భయము!

కె. రవీందర్‌రెడ్డి, ఆదిలాబాద్.

జ: ఉన్నాడు - కాని వాడికి నోరుకన్నా తెలివి తక్కువ.

(ప్ర) దర్శకులందరూ ఒక చిత్రంలో నటిస్తే ఆ చిత్రం ఎలా ఉంటుందండి?

ఇ. ప్రభాకరరావు, విశాఖపట్నం.

జ: చిత్రం విచిత్రంగా వుంటుంది.

(ప్ర) స్త్రీ స్వాతంత్ర్యం విస్తరించనపుడు నాటకాల్లో మగవాళ్ళు ఆడవేషం కట్టేవాళ్ళు. స్త్రీ స్వాతంత్ర్యం విజృంభించాక ఆడవాళ్ళే మగ వేషం కట్టాల్సి వస్తుందా?

విభారావు, హైదరాబాద్.

జ: వేషం వరకూ అయితే మోసం వుండదు.

పద్మనాభం




జమునారమణారావు

## 4

మాస్కోనుంచి 'కీవ్' 560 మైళ్ళు. ఉదయం ఎనిమిదిన్నరకు కీవ్ చేరాం. సినిమా పరిశ్రమకు చెందిన పెద్దలు, ప్రముఖ సినీతారలు ముగ్గురు— మమ్మల్ని రిసీవ్ చేసుకునేందుకు రైల్వేస్టేషన్‌కి వచ్చారు. రద్దీగావున్న ఆ స్టేషన్‌లోంచి బయటికి వచ్చాం. హోరున వర్షం కురుస్తోంది. ఒకగంటలో హోటల్‌కి వెళ్ళాం. ఈ హోటల్ రూమ్స్ కాంతి వంతమయిన దీపాలతో, మోడరన్ ఫర్నిచర్‌తో అందంగా ఉన్నాయి. స్నానాదికాలు ముగించుకొని, బ్రేక్‌ఫాస్ట్ తీసుకుని బయటపడేసరికి పన్నెండు అయింది. సినిమాటోగ్రఫీ సభ్యులను కలుసుకోవడానికి వెళ్ళాం. ఛైర్మన్‌గారికి పరిచయం చేయబడ్డాం. ఒక గంటసేపు అక్కడ గడిపాము.

ఒంటిగంటకు టెలివిజన్ ఇంటర్‌వ్యూ వుంది. అందర్నీ టెలివిజన్ స్టూడియోకి తీసుకువెళ్ళారు. టెలివిజన్ స్టూడియోకి నేను వెళ్ళడం అదే మొదటిసారి. మద్రాసులో మా షూటింగ్స్ జరిపే స్టూడియో ఫ్లోర్ అంత ఉన్నదా స్టూడియో. రెండు కెమెరాలు పని చేస్తున్నాయి. ఒక చోట వరుసగా కుర్చీలువేసి, మమ్మల్ని అక్కడ కూచోబెట్టారు. మా లీడర్ నందిని సత్పథి— మన చిత్రపరిశ్రమ గురించి, మన చిత్రాల గురించి, మమ్మల్ని గురించి పరిచయ వాక్యాలు చెప్పింది. మేము కూడా కొద్దిగా మాట్లాడాము. ఎక్కడికి వెళ్ళినా మేం యింగ్లీషులో మాట్లాడేవాళ్ళం. మాకు ఒక లేడీ ఇంటర్‌ప్రెటర్‌ని, ఒక మేల్ ఇంటర్‌ప్రెటర్‌ని యిచ్చారు. అందువల్ల మాకు ఎక్కడికి వెళ్ళినా భాషా సమస్య రాలేదు.

ఓవర్‌కోట్స్ బయటకు వెళ్ళినపుడు తప్పితే, లోపల ఉన్నపుడు ఎవరూ వేసుకోరు. బయట కార్లో కూచున్నప్పుడు కూడా గజగజ వణికిన మాకు, స్టూడియోలో ఆ దీపాలముందు అందరికి చెమటలు పట్టసాగాయి. మన స్టూడియోల్లో ఉన్నట్లు జూనియర్ లైట్స్, బేబీలైట్స్‌వున్నా— యిక్కడ ఒక ప్రత్యేకత కనిపించింది. 30, 40 ఫ్లడ్ లైట్స్ ఒకే ఫ్రేమ్‌లో బిగించి, మేము కూర్చున్న ప్రదేశానికి దగ్గరగా అయిదారు పైనుంచి వేలాడగట్టి ఉన్నాయి. ఆ వేడి భరించలేక అంతటి చలిదేశంలోనూ మాకు చెమట పట్టింది. మా కార్యక్రమాలు అయ్యేసరికి గంట పట్టింది.

అక్కణ్ణించి మమ్మల్ని కీవ్‌లో ప్రసిద్ధిచెందిన కెథడ్రల్‌కి తీసుకు వెళ్ళారు. ఎంతో పెద్ద చర్చి అది. ఏసుక్రీస్తు విగ్రహం, వారి మత సంబంధమయిన అనేక చిత్రాలు— చిత్రించబడివున్నాయి, గోడలమీద. అక్కడ అదంతా చూసి మూడింటికి హోటల్ చేరాం. లంచ్‌కి మా మామూలు టైమ్ నాలుగున్నర అయింది. తిరిగి అరగంటలో తయారయి సినిమాటోగ్రఫీ కార్యాలయానికి వెళ్ళాం. వారికి అక్కడ ప్రత్యేకంగా ఒక చిన్న థియేటర్ వుంది. మాకు స్థానిక స్టూడియోలో తీసిన వాళ్ల భాష (యుక్రేనియన్) చిత్రం చూపించారు. మనదేశంలో లాగా వాళ్లదేశంలోనూ అనేక ప్రాంతీయ భాషలు. వేషధారణలో కూడ భిన్నత్వం కనిపిస్తూ వుంటుంది. కాని, 'రష్యన్' భాష చాలా మంది మాట్లాడగలరు. ఈ చిత్రం చూస్తున్నంతసేపు— ఆ చిత్ర దర్శకుడు యుక్రేనియన్ భాషని రష్యన్‌లో మా యింటర్‌ప్రెటర్‌తో చెప్తే అతను మాకు ఇంగ్లీషులో చెప్పేవాడు. ఆ చిత్రం ఇంగ్లీషు పేరు "ది షాడోస్ ఆఫ్ ఫర్‌గాటెన్ ఏన్సెస్టర్స్.". ఇతివృత్తం రోమియో— జూలియట్ లాంటిది. విషాదాంతం. చిత్రం రెండు గంటలసేపు ఉంది.

ఎనిమిదింటికి అదే థియేటర్‌లో రష్యన్ భాషలో నిర్మించిన "వార్ అండ్ పీస్" రెండవభాగంచూశాం. చాలా అద్భుతంగా వుంది. ఎంతో రిచ్‌గా నిర్మించారు. 'నటాషా' పాత్ర ధరించిన "లుద్మిలా సవలీవా" చాలా చక్కగా నటించింది. ఆమెలో 'ఆడ్రీ హెప్ బర్న్' పోలికలు కనిపించాయి. ఇది ఆమె మొదటి చిత్రం అట. లుద్మిలా మంచి నర్తకి అని కూడా తెలుసుకున్నాను. మూడు గంటలసేపు ఉన్న యీ సినిమా చూసి— రాత్రి పన్నెండింటికి మా డిన్నర్ ముగించాం.

ఉదయం పదింటికి అందరం తయారయి— నటీనటుల్ని, సాంకేతిక నిపుణుల్ని కలుసుకునేందుకు వెళ్ళాం. వారిని మాకు, మాకు వారిని పరిచయం చేశారు. ఆ తారలు నన్ను చీరలో చూసి ఎంతో అభినందించారు. నా మొహాన బొట్టు చూసి అదెందుకని ఒకరూ, మంగళసూత్రాలు చూసి అవేమిటని ఇంకొకరూ— ఇలా ప్రతిది అడిగి తెలుసుకున్నారు. చిత్రాల ప్రసక్తి వచ్చినపుడు నేను 96 చిత్రాల్లో నటించానని చెప్పగానే వాళ్ళు చాలా ఆశ్చర్యపడి చూడటం గమనించాను. అక్కడి తారలు 20 చిత్రాలకంటే ఎక్కువ నటించిన వారెవరూ లేరు. ఇంటర్‌వ్యూలు పూర్తి చేసుకుని హోటల్‌కి వెళ్ళి, లంచ్ ముగిసే సరికి మామూలు వేళ అయింది.

తిరిగి అయిదున్నరకి పబ్లిక్ థియేటర్‌కి వెళ్ళాం. ఆ దేశాల్లో సినిమా మొదలు పెట్టడానికి ముందు లాంజ్‌లో మ్యూజిక్ ఏర్పాటు ఉంటుంది. జనం అంతా అక్కడచేరి సంగీతం వింటూ ఆనందిస్తున్నారు. మేమూ అక్కడ నించుని వింటున్నాం. అంతమంది జనం పాట వినడం మానేసి నా వైపు విచిత్రంగాను, ఉత్సాహంగాను చూడసాగారు. నేనూ వారివైపు ఛీర్‌ఫుల్‌గా చూస్తున్నా. ఇంతలో మాలో ఒకరికి నా చేత పాట పాడించాలనే భావం కలిగి, నన్ను పాడమన్నారు. చాలా రోజుల తర్వాత స్టేజిలో పాట పాడటం...... ఏమిటో 'కొత్త' అనిపించింది. చిన్నతనంలో స్టేజిలో పాడటమే గాని, సినిమాతారనయ్యాక పాట పాడే అవకాశం కలగలేదు. అయినా ధైర్యంగా మొదలుపెట్టాను.

భారతీయ జానపదగీతం అని చెప్పి— 'గోదారి గట్టుంది' పాడాను. విని ముగ్ధులైన అక్కడి జనం ఆగకుండా అయిదు నిమిషాలవరకు కరతాళ ధ్వనులు చేశారు. ఇంకొకటి పాడమని ఒత్తిడి చేశారు. నాకెంతో యిష్టమయిన హిందీ పాట 'ఆప్‌కీ నజరోంనే సమ్‌ఝా' పాడాను. ఈసారి చాలా సేపు చప్పట్లు కొట్టారు. ఆ తర్వాత మేమంతా స్టేజి ఎక్కి మన జాతీయగీతం పాడి వినిపించి, వారి జాతీయగీతాన్ని ప్రేక్షకులందరిచేతాపాడించాం. మన భారతీయులన్నా, మన సంగీతమన్నా వారికి ఎంత యిష్టమో, యీ సంఘటనతో బోధపడింది. ప్రతి ఒక్కరి మొహం పట్టరాని ఆనందంతో ఎర్రగ కందిపోయి కనిపించాయి నాకు.

ఆడవాళ్ళందరూ నన్ను చుట్టుముట్టారు. నేనెంతో అందంగా ఉన్నానుట! కళ్ళు చాలా బాగున్నాయిట. చీర అద్భుతంగా ఉందిట. కరోష్, కరోష్ (అంటే బ్యూటిఫుల్ అని అర్థం) అంటూ ఒకటే మెచ్చుకోవటం మొదలుపెట్టారు. ఇంతలో సినిమా ప్రారంభిస్తున్న సూచనగా గంట మోగింది. అందరం థియేటర్‌లోపలికి వెళ్ళాం. అక్కడి థియేటర్స్ చాలా విశాలంగా పెద్దవిగా ఉంటాయి. [illegible]

థియేటర్స్— డ్రామా థియేటర్లలా ఈ సినిమా హాల్స్ అంత అందంగా కనిపించవు. కాని, పరిశుభ్రంగా, కుషన్ కుర్చీలతో ఉంటవి. స్టేజిపైకి మమ్మల్ని ఆహ్వానించి, పూలగుత్తులతో సత్కరించారు. మా మినిస్టర్ మమ్మల్ని పరిచయం చేసింది. మా అందరి తరఫున రాజేంద్రకుమార్ మాట్లాడాడు.

ఎనిమిదిన్నరకి హోటల్లో— సినిమాటోగ్రఫీ ముఖ్యులు, ప్రముఖ నటీనటులు కలసి డిన్నర్ తీసుకుంటున్నాం. పదింటికి మా టెలివిజన్ ఇంటర్వ్యూ 'రిలే' వచ్చిందని, మమ్మల్ని కింద హాల్లోకి తీసుకు వెళ్ళారు. సగం భోజనాలు మధ్యలోనే వదిలేసి పోలోమని పరుగెత్తాం. ప్రతిరోజూ మా ప్రతిబింబాలు మేము చూసుకుంటూనే వుంటాం, సినిమాల ద్వారా........ కాని, టెలివిజన్లో ప్రజాబింబం చూసుకునేందుకు చిన్నపిల్లల్లా అలా పరుగెత్తుతూంటే నాకు నవ్వు వచ్చింది.

టెలివిజన్ ఇంటర్వ్యూ చూసి తిరిగి భోజనాలకు వెళ్ళాం. మా భోజనాలు పూర్తి కావడానికి రాత్రి ఒంటి గంటన్నర అయింది.

21 వ తేదీ ఉదయం పదింటికి కీవ్లో ప్రసిద్ధికెక్కిన 'దోజాంకో స్టూడియోస్'కి కొనిపోబడ్డాము. అక్కడ స్టూడియో డైరెక్టర్ మాకు వారి స్టూడియో అంతా తిప్పి చూపించారు. అందులో రెండు ఫ్లోర్స్ ఉన్నవి. చాలా విశాలమైనవి. ఫ్లోర్స్ని వారు 'పెవిలియన్' అంటారు. ఆ రెండు పెవిలియన్స్లోనూ రెండు స్విమ్మింగ్పూల్స్ ఉండటం— దాని ప్రత్యేకత! ఆ స్విమ్మింగ్పూల్స్ పెద్దవైన చెక్కలతో మూయబడి ఉంటవి. వాటిపై ఎంతటి బరువయినా పెట్ట వచ్చు. అంటే వాటి మీద సెట్స్ వేయవచ్చు, లేదా క్రేన్స్ నిలబెట్ట వచ్చు, మామూలు నేలలా ఉపయోగించవచ్చు. స్విమ్మింగ్ పూల్ అవసరం ఉంటే— మూయబడిన ఆ చెక్కల్ని తొలగించి ఉపయోగిస్తారుట!

సాధారణంగా వాళ్ళు సెట్స్ ఎత్తయిన ప్లాట్ఫారమ్ మీదే వేస్తారు. ఆ రోజు షూటింగు పన్నెండు గంటలకు ఉన్నదిట. మాకు టైమ్ లేనందున చూడలేకపోయాము. మన స్టూడియోల్లో ఉండేవాటికంటే చాలా ఎత్తయిన క్రేన్స్ మూడు ఉన్నవి. వారి ఎక్విప్మెంట్ చూపారు. స్పెషల్ ఎఫెక్ట్స్ కెమెరా, దానికి సంబంధించిన పరికరాలు చూపించారు. వాటిని గురించి విశదంగా తెలుసుకోవాలంటే తగినంత టైమ్ కావాలి. ఆ టైమే మాకు చాలా తక్కువ. అందువల్ల అన్నీ గబగబ చూడవలసి వచ్చింది. ముఖ్యంగా అక్కడ మమ్మల్ని కదిలించే సంఘటన ఒకటి చూశాం. కొన్ని సంవత్సరాల క్రిందట వారి ప్రఖ్యాత కవి, దర్శకుడు— 'దోజాంకో' చనిపోతే ఆయన స్మృతి చిహ్నాలను ఎంతో జాగ్రత్తగా భద్రపరిచారు. అంటే ఆయన వాడిన సామగ్రిని, ఆయన దుస్తులు ఉపయోగించిన కలాలూ, కళ్ళజోళ్ళూ, బూట్స్, కుర్చీలు, బల్లలు, భోంచేసిన పళ్ళాలు, ఆయన రచించిన పుస్తకాలు, చదివిన గ్రంథాలు, డైరీలు, ఆయన చిన్ననాటి ఫోటోలు— ఇలాంటి స్మృతి చిహ్నాలను అపురూపంగా దాచి ప్రత్యేకంగా ఒక విశాలమైన హాల్లో మ్యూజియమ్లా అమర్చారు. మన నెహ్రూ, గాంధీల మ్యూజియమ్లలా........

అంతేకాదు; ఆ స్టూడియో పేరుకూడా ఆయన పేరున మార్చబడింది 'దోజాంకో స్టూడియోస్' అని. విశాలమైన ఆ స్టూడియో ఆవరణలో ఆయన పాలరాతి శిల్పాలు అక్కడక్కడ ఉంచబడ్డాయి. మాకు ఇదంతా ఎంతో ఆశ్చర్యాన్ని కలిగించడమేగాక, హృదయాన్ని ద్రవింపజేసింది. ఈ దేశంలో కళాకారులకు ఇచ్చే గౌరవం, అభిమానం మనదేశంలో మనం చూడలేమేమో అనిపించింది. ఒక్క సినిమా కళాకారులే కాదు. నృత్య కళాకారులకి, శిల్ప కళాకారులకి, పెయింటింగ్ చేసే కళాకారులకి, సంగీత కళాకారులకి— ఇలా లలిత కళలకు సంబంధించిన ప్రతి ఒక్కరికి ప్రజలు — ఆ దేశపు రాజకీయ నాయకులపట్ల ఎంతటి భక్తి శ్రద్ధలు కనపర్చగలరో, వీరి పట్ల అంతటి భక్తి శ్రద్ధలు చూపించుతారని మేము గమనించగలిగాము. కళాకారులుగా మా హృదయాలను పులకింప చేసిన దృశ్యం అది.



కీరూట్లో (కెబవాన్)—గుమ్మడి, జమున, మధుసూదనరావు

స్టూడియో చూశాక 'చిల్డ్రన్స్ పయనీర్'కి తీసుకు వెళ్ళారు. ఇది మాస్కోలో మేం చూసిన దానికన్నా చాలా పెద్దది. పిల్లలు ఆడుకునే యీ భవనంలో పపెట్ షో థియేటర్, ఫిల్మ్ షో థియేటర్, సినిమా తీసే ఒక చిన్నఫ్లోర్..... కెమెరా, లైట్స్, ఎక్విప్మెంట్ అంతా అక్కడి పిల్లలకి వుంది.

సినిమాల పట్ల ఉత్సాహం ఉన్న పిల్లలు కొంత మందికి దానిలో తర్ఫీదు ఇచ్చి, ఆ పిల్లలచేతే సినిమాలు తీయిస్తారు. అలానే పపెట్ షో కూడా. వారికి శిక్షణ ఇచ్చేందుకు ఉపాధ్యాయులు ఉన్నారు. ఒక గదిలో పిల్లలు సంగీతం నేర్చుకుంటున్నారు. ఇంకోచోట ఆడపిల్లలు మిషన్ల కుడుతున్నారు. వారు తయారుచేసిన వివిధ రకాలయిన దుస్తులు మాకు చూపించారు. మరోచోట పిల్లలు బొమ్మలు తయారు చేస్తున్నారు. పిల్లలు సినిమా తీసే ఫ్లోరు చూశాం. అక్కడ కెమెరా, లైట్స్ బూమ్ మొదలైన సరంజామా అంతా వున్నది. కథ రాసుకోవడం దగ్గర్నుంచి, దర్శకత్వం, సంగీతం, కెమెరా మున్నగు అన్ని శాఖలూ పిల్లలే నిర్వహించటం, ఆ చిత్రాలలో పిల్లలే నటించటం చెప్పుకో దగ్గ గొప్ప సంగతి.

ఆ పిల్లలంతా కలసి తీసిన ఒక అరగంట రంగుల చిత్రాన్ని మాకు వారి ప్రత్యేకమయిన థియేటర్లో చూపించారు. వారి క్రిస్మస్ పండుగ వేడుకల్ని తీశారు. రంగుల్లో ఎంతో అద్భుతంగా చిత్రీకరించారు పిల్లలు. ఆ చిత్రం చూసి పిల్లల సాంకేతిక నైపుణ్యానికి, వారి మేధాసంపదకీ మా బృందంలో అందరూ ముగ్ధులైపోయారు. ఆనందాశ్చర్యాలతో ముంచెత్తబడ్డ మేము ఒక్కసారి ఆ పిల్లల్ని కౌగిలించుకుని ముద్దుపెట్టుకొన్నాం.

ఆ దేశంలో సినిమాలకి కూడా ఎంతో ప్రాముఖ్యత ఇస్తారు. ప్రతిచోట యాక్టింగ్ స్కూల్స్ వున్నాయి. టెక్నికల్ కోర్సులు ఉన్నాయి. అందుతో అభిరుచిగలవారికి తగిన అవకాశాలు ఉన్నాయి. ప్రతి ఒక్కరికి ముఖ్యంగా సంగీతం, చిత్రలేఖనం తప్పకుండా వచ్చి వుంటాయి. కళలపట్ల విపరీతమయిన ఆసక్తి కనపర్చుతారు. మేము బాలే నృత్య కళాశాల చూడాలనుకున్నాం. కాని అవకాశం లేకపోయింది. ఆ పసిపిల్లలందరూ మాకు— వారు స్వయంగా తయారు చేసిన చిన్న చిన్న వస్తువులను తమ జ్ఞాపక చిహ్నంగా ఇచ్చారు. 'నేటి బాలలే రేపటి పౌరులు' అనే మాటలో ఎంతో సత్యం ఉన్నదని తెస్తుంది, వారి పెంపకం చూస్తే...

(సశేషం)

# ఎప్పుడూ అందంగా కనిపించాలి!

## శ్రీమతి విద్యాకనకతంగం

అందంగా వుంటేనే ఆనందం లభిస్తుంది. ఆనందంగా వుంటేగాని ఆరోగ్యం సరిగా వుండదు. అందములో ఆకర్షణ వుంటుంది. కొందరు అందంగా లేకపోయినా వాళ్ళను మళ్ళా చూడాలని పిస్తుంది. అధికారకమైన ఆకర్షణ ఆకర్షణకోసం తాపత్రయ పడేవాళ్ళు అందంగా వుండడానికి తగువిధమైన జాగ్రత్తల్ని పాటిస్తారు. శుచి శుభ్రతలో కూడా అందం వుంటుంది. నీటుగా వున్నవాళ్ళూ ఆకర్షింప బడతారు. అందుచేత ప్రాథమిక సూత్రాల్ని అనుసరించడం ఉత్తమం.

### సమస్యలకు సమాధానాలు

శ్రీమతి యస్.యమ్. (గూడూరు), కె. పి. (నెల్లూరు), పి. యస్ (అనంతపురం), పి. (భీమవరం) పి. సి. యమ్ (కర్నూలు)

కడుపు పెద్దదిగాను, పొట్ట దగ్గర చర్మం ముడతలు పడి వుంటుంది. నివారించే ఉపాయమున్నదా?

* పెళ్ళయి, పిల్లలతో వున్న స్త్రీలకు ఇది సహజం. ప్రసవించిన మెల తర్వాత తేలికయిన వ్యాయామం చేయడం అవసరం. సాధారణ ప్రసవం అయివుంటేనే యిలా చేయాలి. లేకపోతే డాక్టరు సలహా తీసుకోవాలి. వ్యాయామం ఎప్పటి నుంచి ప్రారంభించవచ్చునో డాక్టర్ని అడిగి తెలుసుకుంటేనే మంచిది. వ్యాయామంవల్ల ఇలాంటి దుర్గుణం నివారింప బడడానికి అవకాశముంటుంది. బ్యూటీ క్లినిక్సులో సైంటిఫిక్ ట్రీట్‌మెంటొకటి వుంది.

శ్రీమతి యస్. ఆర్. (తిరుపతి) జె యస్. ఆర్. (నెల్లూరు) కుమారి జి పి. (హైదరాబాదు)

మొటిమలు బిరుసుగా వుండి పగులుతూవుంటాయి. ఏంచేస్తే నయమవుతుంది?

* పైత్య శరీరమైతే ఇలా ఎక్కువగా జరుగుతుంది. విటమిన్ 'సి' చాల మేలు చేస్తుంది. 250 మి. గ్రా. రోజూ తీసుకోవాలి ఒక గ్లాసు తాజా నిమ్మరసం ఉప్పు, పంచదార లేకుండా తీసుకోవాలి. పగిలినచోట మాసె, వేసలీనులాంటి దేదైనా రాస్తే మెత్తబడుతుంది. 'విటమిన్ సి స్కిన్ క్రీమ్' మంచి పని చేస్తుంది. బాగా మర్దనా చేయాలి. పాదాల్ని సబ్బుతో శుభ్రంచేస్తూ ంజా పడుకోకపోయేముందు ఇలాచేస్తే తొందరగా నయమవుతుంది.



బ్యూటీ ట్రీట్‌మెంట్.

*రంగుమార్చేవిధానం గురించి చాలామంది రాస్తున్నారు. పద్ధతిని వివరంగా ఇస్తాను. ఈ విధంగా ఇంటి దగ్గర చికిత్సపొందచ్చు:

### కావలసిన వస్తువులు

విటమిన్ బ్లీచింగ్ క్రీమ్, విటమిన్ బ్లీచింగ్ మాస్క్, విటమిన్ కాంప్లెక్షన్ లోషను. పది రోజులకు సరిపడా అమ్ము పెట్టుకోవాలి ఇవి బ్యూటీఎయిడ్స్ లభించే ఏ పెద్ద షాపులోనైనా దొరుకుతాయి.

### చి కి త్స

ప్రతి ఉదయం ముఖాన్ని, మెడని సబ్బుతో శుభ్రం చేసుకోవాలి. చన్నీళ్ళతో కడిగి పొడి తువాలుతో తుడుచుకోండి. మెడ భాగానికి, ముఖానికి 'వయిట్ క్రీమ్' రాయండి చెవులకు కూడా పట్టించండి, పది నిమిషాలదాకా వేళ్ళతో మెల్లిగా మర్దనా చేయండి. తర్వాత పొడితువాలుతో దాన్ని తుడి వేసి గోధుమరంగుతోవున్న బ్లీచింగ్‌మాస్క్ వేయండి. (ఇది పేస్టులా వుంటుంది) ఇలా ముఖానికి, మెడ భాగానికి పట్టించండి. పెదవులకు, కనుబొమలకు కళ్ళ దగ్గరున్న మృదువైన చర్మానికి క్రీమును రాయవద్దు. ఇది ఎండడానికి సుమారు పదిహేను నిమిషాలు పడుతుంది. ఫాన్ కింద కూర్చుంటే పది నిమిషాలేచాలు. ఆరిపోయిన తర్వాత తువాలును తడిపి మెల్లిగా 'మాస్క్'ను తుడిచివేయండి. తువ్వాలు చన్నీళ్ళలోనే తడపాలి. తర్వాత చన్నీళ్ళతో ముఖాన్ని కడిగేయండి. సబ్బు అవసరంలేదు కొద్దిగా 'కాంప్లెక్షన్ లోషన్' రాయండి. వెంటనే ఎక్కడికైనా వెళ్ళాలనుకుంటే పౌడరు రాసుకోవచ్చు. పది రోజుల్లో మీ చర్మం కొద్దిగా రంగు మారుతుంది. మొదట్లో వరుసగా రోజూ చేయాలి. తర్వాత వారానికి రెండుసార్లు, ఆ తర్వాత వారానికొకసారి ఇలా చేసుకోవచ్చు. ఇది తాత్కాలికం కాదు జీవితాంతందాకా అలానే వుంటుంది. చర్మం మృదువుగాను అందంగాను వుంటుంది.

### ఆహార నియమాలు

తాజాపళ్ళు, కూరగాయలు విరివిగా వాడాలి. మలబద్ధం రాకుండా జాగ్రత్త తీసుకోవాలి.

ఈ క్రీములు, లోషన్లకు అంతా కలిపి ఎనభై రూపాయలకు ఎక్కువకాదు రెండు వారాల చికిత్సకయితే ఇరవై అయిదు రూపాయల్లోనే సమకూర్చుకోవచ్చు — క్రీములన్నీ సిద్ధం చేసుకున్న తర్వాత ఈ వ్యాసాన్ని దృష్టిలో వుంచుకుని అలాచేసి ఫలితాన్ని పొందండి. అందమే ఆనందం!

వ్యక్తిగతంగా సమాధానాలు కోరేవారు పూర్తి అడ్రసు తెలియపరుస్తూ 15 పైసల తపాలా బిళ్ళను జతచేయాలి. వందలకొద్దీ ఉత్తరాలు వస్తున్నాయి గనక వీలువెంట అన్ని సమస్యలకూ సమాధానాలు ఇస్తాను. సమస్యలు శ్రీమతి విద్యా బాక్సు నెం. 1000, కేరాఫ్ ఆంధ్రపత్రిక, మద్రాస్—1 కి పంపాలి. ●



"మా మంచి అత్తయ్య"లో

# రెండు దశాబ్దాలుగా విభిన్న పాత్రలలో రాణించినా ఉత్సాహం తరగని నటి అంజలీదేవి

నటిగా శ్రీమతి అంజలీదేవి వెండితెర జీవితంలో ఇరవై సంవత్సరాలు గడచిపోయినవి. 1946 జనవరి 13 న మద్రాసుకు వచ్చిందామె. మొదటిసారిగా "గొల్లభామ" చిత్రంలో వాంప్‌గా నటించింది. అప్పటినుంచి "శ్రీలక్ష్మమ్మకథ" వరకూ నర్తకి భూమికలూ, వాంప్‌రోల్సూ వేస్తూ వచ్చింది. శ్రీ లక్ష్మమ్మ కథలో బరువయిన వేషం తొలిసారిగా పోషించే అవకాశం స్వర్గీయ ఘంటసాల బలరామయ్యగారు కల్పించారు.

నాటి గొల్లభామనుంచి నేటి రంగులరాట్నం వరకూ శ్రీమతి అంజలీదేవి నటించిన చిత్రాల సంఖ్య 124. ఈ నూటయిరవైనాలుగు చిత్రాల్లోను తెలుగు 64, తమిళం 50, హిందీ 10 ఉన్నవి. ఇవన్నీ స్ట్రెయిట్ టేక్ చిత్రాలు. పరదేశి, ఇలవేలుపు, వదినగారిగాజులు, లవకుశ, నిర్దోషి (హెచ్. ఎం. రెడ్డిగారిది), చరణదాసి, జయసింహ, అనార్కలి, చెంచులక్ష్మి, సతీసక్కుబాయి, రంగుల రాట్నం చిత్రాలలో వైవిధ్యంగల భూమికల్ని ధరించింది. వాటిలో జీవించింది. ప్రేక్షక హృదయాలలో నటిగా అంజలీదేవి ఒక ప్రత్యేకస్థానాన్ని సంపాయించుకోగలిగింది. మెప్పుకోళ్లు అందుకోగలిగింది.

ఇటీవల నేను ఆమెను కలుసుకున్నపుడు "ఇన్ని చిత్రాలలో నటించారుకదా, వాటిలో మీకు నచ్చిన వేషాలు ఏమిటి?" అన్న నా ప్రశ్నకు అంజలీదేవి సమాధానం చెబుతూ, "నటించిన చిత్రాలతోనే తృప్తిపడిపోతే నటించే చిత్రాల్లో ఏం చెయ్యగలను? నటిగా నాకు సంతృప్తి కలుగలేదు. ఇంకా చక్కటి వేషాలు వస్తాయనే ఆశ, పోషించాలనే ఉత్సాహం నాలో ఉన్నాయ్" అన్నది. "ఎపుడయినా మీరు నటించేందుకు చాలా శ్రమ తీసుకోవడం సంభవించిందా?" అని అడిగిన మరో ప్రశ్నకు జవాబు యిస్తూ, "సంభవించింది. నా శక్తి అంతా ధారపోసి శ్రీ లక్ష్మమ్మలో పని చేశాను. కథానాయికి వేషానికి బలరామయ్యగారు నన్ను తీసుకుంటే—నాట్యకత్తె వేషాలువేసే అమ్మాయికి యీ వేషమేమిటి వద్దు అని ఎంతోమంది ఆయనకు సలహా యిచ్చారు. బలరామయ్యగారు దృఢసంకల్పం కలవారు. ఆ పాత్రకు కావలసిన లక్షణాలు నాలో ఉన్నాయని, ముఖ్యంగా ఆ అమాయకత్వం నా మొహంలో ఉందని చెప్పి ఒప్పించారు. ఆయన పరువు నిలుపడానికీ, నా ప్రజ్ఞను ప్రదర్శించుకోవడానికీ చాలా శ్రమ తీసుకునే నటించవలసి వచ్చింది. కీర్తిశేషులైన బలరామయ్యగారికి నేను కృతజ్ఞతలు చెప్పుకోవలసి ఉంది" అన్నదామె.

*　　*　　*

అంజలీదేవి చలన చిత్ర పరిశ్రమలో ప్రవేశించి రెండు దశాబ్దాలు దాటినా, 124చిత్రాల్లో నటించినా నిత్య నూతన నటిగానేవున్నది నేటికీ. శరీరాన్ని కాపాడుకోవడంలోను. సౌందర్యాన్ని ఇనుమడింపచేసుకోవడంలోను ఆమె తీసుకునే శ్రద్ధ, జాగ్రత్త అభినందించదగ్గవి. కొందరు తారలు అందం పెంపొందించుకొనేందుకు వళ్లరసం తాగుతారు. అంజలీదేవికి వళ్లరసం తాగే అలవాటులేదు!

*　　*　　*

ఈ ఇరవై ఏళ్ల చలనచిత్ర జీవితంలోనూ అంజలీదేవి కృషికీ, అభ్యున్నతికి మార్గదర్శకుడుగాఉండి అండగా నిలచిన వ్యక్తి—ఆమె జీవిత భాగస్వామి, ప్రసిద్ధ సంగీత దర్శకుడు శ్రీ ఆదినారాయణరావు. ఈ విషయం ఆమె ఎన్నడూ మరచిపోలేదు, పత్రికా విలేఖరులముందు స్పష్టంగా వెల్లడించింది కూడా.



"కాంభోజరాజు కథ"లో

26 జనవరి 1967 న యింతకాలమూ తన అభివృద్ధిని కాంక్షిస్తూ, తన బాగోగులను ప్రజలకు తెలియపరుస్తూ, నటనలో మంచిచెడుల్ని సహేతుకంగా విమర్శిస్తూవస్తున్న పత్రికలకు తన కృతజ్ఞత తెలుపుకునేందుకు శ్రీమతి అంజలీదేవి తన స్వగృహంలో రిపబ్లిక్ డే నాడు తేనీటి విందు ఇచ్చింది.

దాదాపు 150 మంది తెలుగు, తమిళ, ఆంగ్ల పత్రికా ప్రతినిధులు హాజరయిన ఆనాటిసభలో ప్రసంగిస్తూ, "ఈ ఇరవై ఏళ్లూ నాకు తోడ్పడిన నిర్మాతలకు, సాటి నటీనటులకు, దర్శకులకు యితర సాంకేతిక నిపుణులకు, పత్రికా ప్రతినిధులకు నా హృదయ పూర్వక కృతజ్ఞతాభివందనాలు. వారి సహకారం, అభిమానం లేకుండా నే నీనాడు నటనలో ఇంత ఉన్నతిని సాధించిఉండటం సంభవించి ఉండేది కాదేమో! ....నాకు ఎప్పటికప్పుడు చక్కని సలహాలనిస్తూ, నాకు అండదండలుగా నిలచిన నా భర్తగారికీ యీ సందర్భంలో నేను కృతజ్ఞత తెలుపుకొంటున్నాను" అన్నది శ్రీమతి అంజలీదేవి.

ఈ మాటల్లో ఆమె చిత్తశుద్ధి, సహృదయత, మంచితనం, ఉన్నత సంస్కారం వ్యక్తం అవుతున్నవి! అంజలీదేవి ఇరవై ఏళ్ల తెరజీవితంలో కొన్ని ముఖ్య సంఘటనలు— 1950: సౌతిండియన్ ఫిలిమ్ ఛాంబర్ ఆఫ్ కామర్స్‌లో వైస్ ప్రెసిడెంట్. 1951 : ఉత్తమ నటనకు మద్రాసు రాష్ట్ర ప్రభుత్వపు ఫిలిమ్ అకాడమీఅవార్డు. 1955, 1957 ఉత్తమ నటనకు మద్రాసు ఫిలిం ఫాన్స్ అసోసియేషన్‌వారి అవార్డులు. 1958: శ్రీ వెంకటేశ్వర యూనివర్శిటీలో సెనేట్ మెంబరు. 1959: సౌతిండియన్ ఆర్టిస్ట్స్ అసోసియేషన్‌కి ప్రెసిడెంట్ (మొదటి మహిళ.) 1963: ఉత్తమ నటనకు భారత ప్రభుత్వపు అవార్డు. 1964: ఉత్తమ నటనకు ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడెమీ అవార్డు. 1965: నాటకరంగం పైనా తెరపైనా గణనీయమైన సేవ చేసినందుకు మద్రాసు రాష్ట్ర సంగీత నాటక అకాడెమీ అవార్డు. ఆంధ్ర నాటక కళాపరిషత్తులోను, ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడెమీలోను శ్రీమతి అంజలీదేవికి సభ్యత్వం ఉన్నది.

—మోహన్ కుమార్

# చిత్రలహరి

శ్రీయుతులు సుందర్‌లాల్ నహతా, డూండీలు తమ కొత్త చిత్ర నిర్మాణానికి సన్నాహాలు పూర్తి చేసుకున్నారు. కృష్ణ, వాణిశ్రీ, కాంచన, నాగభూషణం, రావి కొండలరావు, పద్మశ్రీ నాగయ్య యింతవరకు యీ చిత్రంలో నటించేందుకు ఎన్నుకోబడినారు. సంభాషణలు: భమిడిపాటి రాధాకృష్ణ, సంగీతం: టి. చలపతిరావు, కళ: యస్. కృష్ణారావు కెమేరా: యస్. వెంకటరత్నం, కూర్పు: ఎన్. ఎస్. ప్రకాశం, దర్శకత్వం: వి. రామచంద్రరావు బి. ఏ (ఆనర్స్.) రంగులరాట్నం చిత్రం ద్వారా ప్రేక్షకులకు పరిచితుడయిన కొత్త నటుడు చంద్రమోహన్ యిందులో ఒక ముఖ్యభూమిక పోషిస్తు



'కాంభోజరాజు కథ'లో వాణిశ్రీ, రాజశ్రీ.

న్నాడు. యీ చిత్రం తాలూకు షూటింగ్ ఫిబ్రవరి 9 నుంచి ఆరంభం కాగలదని దర్శకుడు శ్రీ వి. రామచంద్రరావు నాతో చెప్పారు. ఆయన టైగర్ ప్రొడక్షన్స్‌వారి మూడవ చిత్రానికి కూడా దర్శకత్వం వహిస్తున్న విషయం పాఠకులకు తెలిసిందే.

* * *

బి. ఆర్. ఫిలిక్స్ అనే కొత్త సంస్థ తమ తొలి ప్రయత్నంగా ఉత్కంఠత రేకెత్తించే చక్కని చిత్రాన్నొకదాన్ని నిర్మిస్తున్నది. నట సార్వభౌమ శ్రీ యస్. వి. రంగారావు మొదటిసారిగా ఇందులో ద్విపాత్రాభినయం చేస్తున్నారు. ఈ పాత్రల పోషణలో ఆయన సంచలనం సృష్టించబోతున్నారు. కృష్ణ, రాజశ్రీ, రామ్మోహన్, రాజబాబు, చదలవాడ యితర ముఖ్య తారాగణం. ప్రసిద్ధ నవలా రచయిత శ్రీ ప్రసాద్ యీ చిత్రానికి కథ, సంభాషణలు రాశారు. గీతాలు: ఆరుద్ర, సి. నారాయణ రెడ్డి, సంగీతం: యస్. రాజేశ్వరరావు, యస్. రామలింగేశ్వరరావు, కళ: సోమనాథ్, కెమేరా: యస్. యస్. లాల్, నిర్మాత: బి. రామారావు, నిర్వహణ: 'చిత్ర' నరసింహారావు, దర్శకుడు: కె. శ్రీనివాసరావు. ఈ యువకునికి దర్శకత్వశాఖలో మా



'పిన్ని'లో రేలంగి, దేవిక.



'శభాష్ రంగా'లో జయలలిత.



'పిన్ని'లో విజయనిర్మల.

ఎడిటింగ్‌లోను విశేషమైన అనుభవం ఉన్నది, గత పదమూడేళ్ళుగా చిత్ర పరిశ్రమలోవుంటూ పలువురి ప్రముఖ దర్శకులవద్ద సహాయకునిగా పనిచేసి ఎన్నో మెళుకువలూ, మెలకువలూ గ్రహించిన యువ దర్శకుడు.

* * *

పద్మశ్రీవారి ''ప్రాణమిత్రులు'' చిత్రం అవుట్‌డోర్‌కుగాను యూనిట్ వారి బృందం విశాఖపట్నం వెళ్ళారు. 'మార్చి' మాసాంతానికి ఆంధ్రఅంతటా విడుదలకానున్న యీ చిత్రంలో నాగేశ్వరరావు, జగ్గయ్య, గుమ్మడి, రేలంగి, సావిత్రి, కాంచన, గీతాంజలి, గిరిజ, రావి కొండలరావు, శాంతకుమారి, చదలవాడ ముఖ్య భూమికలు పోషిస్తున్నారు. సంభాషణలు: ముళ్ళపూడి వెంకటరమణ, సంగీతం: కె.వి. మహదేవన్, కెమెరా: సెల్వరాజు, కళ: కృష్ణారావు, సూరన్న, కూర్పు: ఎస్. ఎం. శంకర్. దర్శకుడు: పి. పుల్లయ్య; నిర్మాత: వి. వెంకటేశ్వర్లు.



'కాంభోజరాజుకథ'లో ఎల్. విజయలక్ష్మి.



'మావదిన'లో కృష్ణకుమారి.

సుజాత ఫిలిమ్స్‌వారి అపరాధ పరిశోధక చిత్రం "హంతకుని హత్య" ఫిబ్రవరి చివరలో ఆంధ్ర అంతటా ఈస్టిండియా ఫిలిం కంపెనీవారి ద్వారా విడుదల కాగలదని తెలుస్తున్నది. సావిత్రి, కె. ఆర్. విజయ, యస్. వి. రంగారావు, చంద్రబాబు, మనోహర్, తంగవేలు ప్రధాన పాత్రధారులు. సంభాషణలు: మహారథి, గీతాలు: అనిసెట్టి, సంగీతం: విశ్వనాథం, పాండ్యన్, కెమెరా: లక్ష్మణ్ గోరే, కూర్పు: ఎస్. ఎన్. ప్రకాశం, దర్శకుడు: చంద్రబాబు, నిర్మాత: పి. బాల్జి.

* * *

రేఖా అండ్ మురళీ ప్రొడక్షన్స్‌వారి "శ్రీ శ్రీ శ్రీ మర్యాద రామన్న" చిత్రం ఏడు రీళ్ళు తయారయింది. పద్మనాభం, గీతాంజలి, రాజనాల, రాజబాబు, ప్రభాకరరెడ్డి, బాలకృష్ణ, మీనాకుమారి మున్నగువారు ముఖ్యభూమికలు పోషిస్తున్న యీ చిత్రంలో రాజశ్రీ, కృష్ణ, హరనాథ్, రామకృష్ణ, శోభన్‌బాబు అతిథి నటులుగా పాల్గొంటున్నారు. దర్శకుడు: కె. హేమాంబరధరరావు, నిర్మాత: బి. పురుషోత్తం, సంగీతం: కోదండపాణి.

—మోహన్‌కుమార్



'ఇద్దరు మొనగాళ్లు'లో సుకన్య.



'కంచుకోట'లో జయశ్రీ.

# పుస్తకాలు

## గాజుబొమ్మలు (నవల)

రచన: కుమారి గంటి వెంకటరమణ. 149 పేజీలు. వెల: రూ. 3 లు. ప్రచురణ: నవజ్యోతి పబ్లికేషన్స్, ఏలూరురోడ్, విజయవాడ—2.

"జీవితాలు గాజుబొమ్మల్లాంటివి. కొన్ని బొమ్మలు పగిలిపోతాయి. కొన్ని బీటువోయి ఇటు పగలలేక అటు పూర్వపు రూపు పొందలేక పరిగి పోతాయి. బజార్లో బీటు బొమ్మలకు విలువ లేదు. సమాజం ఇంతే,"—అనే భావాలకు రూపకల్పన ఈ నవల.

భర్త పోయిన విజయ, మోసపోయిన రాజేశ్వరి, వంచకుడు బలదేవ్, బతుకు బరువయిన సుభద్ర, అకాల మృత్యువు పాలైన శ్రీకాంత్, పెళ్ళి బతుక యిన రాఘవ, భగ్నప్రేమకు బలి అయిన గీత— ఇందులో వచ్చే అసంపూర్ణ జీవితాలు.

ఏటికి ఎదురీదక, పరిస్థితులకు అనుగుణంగా జీవితాలను మలుచుకు రాణించిన వ్యక్తులు—రఘు పతి, శ్రీలత, రామకృష్ణ.

విజయ, రాఘవ, రాజేశ్వరి నిస్సహాయంగా చైతన్యం లేకుండా మిగలటంతో నవల ముగుస్తుంది.

రచయిత్రిలో గొప్ప ఉబలాటం, కథావిధానం లో కమకలతో ఒడుదుడుకులతో వడపాలనే కుతూహలం కనిపిస్తుంది. శైలి ఇంకా పాకాన పడాలి. అనాటుగా—కొబ్బరివక్కు— రాగవ వంటి మాటలు తెలుగువారికి ఎబ్బెట్టుగా వుంటాయి.

"ఒక చేతిని తలుపు పై చివరకు చేర్చి కుడికాలు గుమ్మం మీద పెట్టి దూరం నుంచే రాఘవ్‌ని చూసి మొహం నిండా నవ్వును పులుముకుని 'రండి' అంది గీత ఆప్యాయంగా" (పేజి 51.) ఇంతదూరం— ఇంత పొడుగున వాక్యం సాగదియ్యటంతో ఆ ఆప్యాయత కాస్తా హరించిపోవటం లేదూ?—

ధనిక, మధ్యతరగతి కుటుంబాలను రచయిత్రి చక్కగా చిత్రించారు. స్త్రీలోని బలహీనతను, జీవితంలో సమాజంలో ఆమెను ఎదుర్కొనే సమస్యలను ఎంతో సహజంగా తీర్చిదిద్దారు.

ముఖచిత్రం ముచ్చటగా ఉన్నా, ముద్రణలో అశ్రద్ధ పాఠకులకు ఇబ్బంది కలిగిస్తుంది.

—శివకుమారి

## మార్క్సిస్టు కమ్యూనిస్టుపార్టీ ఆరోపణలకు జవాబులు

శ్రీ భూపేష్‌గుప్త, ఆంధ్రప్రదేశ్ కమ్యూనిస్టు సమితి, హైదరాబాదు. (ధర 40 పైసలని వెనుక అట్టమీద జాబితానుబట్టి వూహించవచ్చు.) ప్రతులు విశాలాంధ్ర ప్రచురణాలయం, ఏలూరు రోడ్డు, విజయవాడ వద్ద దొరుకుతాయి.

కొన్ని సంవత్సరాలక్రితం బెర్ట్రాండ్ రస్సెల్ ఒక చిన్న కథరాశారు. ఒకానొక దేశంలో మతాధికారుల అధికారం అధికం అయి నరబలికూడా వాడుక అవుతుంది. ఒక విప్లవవాది ప్రారంభించిన ఉద్యమం మతాధికారుల పరిపాలనని పడగొట్టివేసి, కొత్త ప్రభుత్వం స్థాపించవేస్తుంది. కొంతకాలం తర్వాత కొత్త ప్రభుత్వం సిద్ధాంతాల ప్రకారం ఈ విప్లవవాది దేవుడితో సమానుడయిపోయి క్రమంగా 'అతనిమతం' ఒకటి బయలుదేరుతుంది. చివరికి ఈ దేవుడికి నరబలి ఇవ్వటం ప్రారంభిస్తారు. ఇది అన్ని మతాల చరిత్రలోనూ గమనించేదే. ఒకదశలో మతానికి చెందనివారికన్నా మతంలోనే వుండి తమకే ఆ మతం సందేశం విడమరచి చెప్పే అధికారం, యోగ్యత ఉందని వాదించే 'చీలిక వర్గాల'వారి పరస్పర ద్వేషాలు ఉధృతంగాఉంటాయి. నేడు మనదేశంలో 'కుడి', 'ఎడమ' కమ్యూనిస్టు పక్షాలమధ్య కొట్లాట దీనికి మరొక నిదర్శనం. పై పుస్తకంలో 'కుడివైపు'కి చెందిన శ్రీ భూపేష్ గుప్త ఎడమవైపువారి వాదనలకి లేదా దూషణలకి జవాబు చెప్తారు.

"శ్రీ రణదివే. మతాధిపతి పీఠంమీద కూర్చుని శిష్యులకు బోధలు చేస్తున్న పద్ధతిలో ఆయన ప్రకటనలు చేస్తున్నారు. కాని రాజకీయాల్లో హేతుబద్ధమైన చర్చ ఆవిధంగా కొనసాగించబడదు" అన్నారు రచయిత (అనువాదంలో) ఒకచోట (11 వ పుట). రాజకీయాలే అయినప్పటికీ, ఇదంతా కమ్యూనిస్టుపార్టీవారి అంతరంగిక కలహం. రష్యా చైనాలమధ్య పోట్లాట ఈవిధంగా 'సిద్ధాంత రూపం' దాలుస్తున్నదని వూహించినా తప్పులేదేమో!

అనువాదం మాత్రం చాలా కష్టంగా ఉంది. 'చొరబాటుదారులు, విపక్ష, భౌగోళిక సమగ్రత, ఖాకరింపు, సామ్రాజ్యవాద ప్రపంచ సంఘటన, జేబుసంస్థ' వంటి మాటలు ఆహ్లాదకరంగా ఉంటాయి.

కె. టి. రావు.

## సమగ్ర ఆంధ్ర సాహిత్యం

తాళ్ళపాక—తిమ్మక్కగారి సుభద్రా కల్యాణానికీ, విజయవిలాసంలోని కొన్ని పద్యాలకూ పోలికలు కానవస్తున్నాయి. సుభద్రాకల్యాణాన్ని తిమ్మక్క వ్రాసినదని శ్రీ తాపీవారు ఒప్పుకోలేదు. తిమ్మక్క దాన్ని రచించినదని నిర్ణయిస్తూ, ఆమెను ప్రశంసించిన 'క్షేత్రయ్యలు' సుప్రసిద్ధ విద్వత్సమర్థకులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి ప్రభృతులు నొకని, ఆయనను అనుసరించి మన పండితులు, పరిశోధకులు, అధ్యాపకులు అందరు పెద్ద బన్సు ప్రమాదంలో చిక్కుకున్నారనీ ఆయన తమ పీఠికలో వ్రాశారు. తమ అభిప్రాయానికి సమర్థకాలయిన కొన్ని ప్రమాణాలను చూపారు. కాని, అవి బలమైనవి కావు. శ్రీ తాపీ వారిని బలపరచడానికి ఆరుద్రగారు చూపిన ప్రమాణం కూడా సరియైనది కాదు. రంగనాథ రామాయణాన్ని కాపీ చేసినంతమాత్రాన తాళ్ళపాక తిమ్మాచార్యులు సుభద్రా పరిణయాన్ని రచించామనుకోవడం (పుట 122) సబబుగాలేదు. ఇంతకూ చేమకూర కవి పూర్వకవులను అనుకరించినట్లు ఒప్పుకోవచ్చునుడు, తిమ్మక్కను అనుకరించినట్లు చెప్పడం ఔచిత్యానికి దూరంకాదు గదా!, సుభద్రాపరిణయం, అని తాళపత్ర ప్రతిలో ఉండగా, శ్రీ శాస్త్రిగారు 'సుభద్రా కల్యాణ' మని మార్చారనీ, దాన్ని 'సుభద్రా పరిణయం, అనడమే న్యాయమనీ, శ్రీ తాపీవారి అభిప్రాయం. (చూ. పీఠి.) లా మార్చడం కంటె 'సుభద్రాపరిణయం' అని మార్చడమే న్యాయమని తోస్తుంది. వ్రాతప్రతులు అసమగ్రంగా విచిత్రరీతులలో ఉండడంవల్లనూ, తిమ్మక్క కర్తృత్వానికి అవకాశం కానవస్తూ ఉన్నందుననూ శ్రీ శాస్త్రిగారు ఆవిధంగా నిర్ణయించారు. అనిశ్చితమయిన ఉపపత్తులను చూపి, శాస్త్రిగారి నిర్ణయాన్ని కాదనడం, ఆక్షేపించడం మాత్రం ఉచితంగా తోచడంలేదు.

ఏడవ ప్రకరణంలో తిట్టుకవిత్వం చెప్పే కవులను గురించిన విషయాలు ఎన్నో చూపబడి ఉన్నవి. ఎనిమిదో ప్రకరణంలో పుష్పగిరి తిమ్మన్నను గురించి వ్రాస్తున్న సందర్భంలో 'సమీరకుమార విజయం' లోని కథ చక్కగా, చమత్కారంగా వివరించబడింది. ప్రబంధాలలోని కథలను ప్పుజనాకర్షకంగా చక్కగా తీర్చిదిద్ది నడుమ నడుమ మంచి మంచి పద్యాలు చేరుస్తూ చెప్పడంలో ఆరుద్రగారు సిద్ధహస్తులు. ఈ సాహిత్య చరిత్ర సంపుటాలకు ఈరీతి కథాకథనం ఎంతో మెరుగు కూరుస్తున్నది.

ధరణిదేవుల రామయమంత్రి దశావతార చరిత్రకూ, పోతన్నగారి భాగవతానికీ ఉన్న పోలికలను చూపుతూ చేసిన సాహిత్య విమర్శ మెచ్చుకోదగి ఉన్నది. ఈ విధంగానె కట్టా వరదరాజు ద్విపద రామాయణాన్ని గురించీ, అయ్యలరాజు వెంకయ్య సారథివిజయాన్నిగురించీ, కుమారధూర్జటి కృష్ణరాయ విజయాన్ని గురించీ చేసిన సమీక్షలు వాఙ్మయాభిమానుల మనస్సుల కెక్కతగి ఉన్నాయి. కృష్ణాధ్వరిని గురించి, చెప్తూ ఆరుద్రగారు శ్లేషకవులను గురించి చాలా విషయాలు చెప్పారు. ద్వ్యర్థి, త్ర్యర్థి, చతుర్థి కావ్యాల పట్టికను ఇచ్చి ఎంతో ఉపకారం చేశారు. పెద్దాపుర సంస్థానకవులను గురించీ, నాయకరాజుల కాలంలోని ఇతర కవులను గురించీ ఈ సంగ్రహ చరిత్రలో ఇంతవరకూ అందుబాటులోలేని సంగతులు చూపారు ఆరుద్రగారు. ఎంతో శ్రమపడి, అపూర్వమైన గ్రంథాలు సేకరించి, దీక్షతో వాటిని పరిశీలించి, అందరికీ ఉపయోగపడే రీతిని ఈసాహిత్య చరిత్రను వ్రాస్తున్న ఆరుద్రగారి యొక్కయు, ప్రకాశకులు శ్రీ శేషాచలం కంపెనీవారి యొక్కయు కృషి మిక్కిలి ప్రశంసించదగినది. — అంగీరస.




గంట తేలికగా చూసుకునేందుకు కొత్తరకం అర్మన్ గడియారం: (యు. పి. ఎస్ 'డాడ్')

# వెండడుకి వేత

**జవాబులు**

(క) పెద్ద గణిత శాస్త్రజ్ఞుడికెవరికైనా ఈ సమస్యను ఇస్తే "ఇన్‌ఫినిట్ సీరీస్"తో చాలా హడావిడి చేస్తాడు. నిజానికి దీనిని ఊహామాత్రంగా సాధించవచ్చు. ఢిల్లీ ఆగ్రాల మధ్య దూరం 120 మైళ్ళు. ఆ రైళ్ళు ఎదురెదురుగా ఒక్కొక్కటి 40 మైళ్ళ వేగంతో వస్తున్నాయి. కనుక బయలు దేరిన 1 న్నర గంటల తరువాత ఆ రెండు రైళ్ళూ మధ్యలో కలుసుకుంటాయి. ఈ గంటన్నరసేపూ మన గండుతుమ్మెద అటూ ఇటూ తిరిగింది. దానివేగం 60 మైళ్ళు కనుక అది ఎగిరిన మొత్తం దూరం $60 \times 1\frac{1}{2} = 90$ మైళ్ళు.

(చ) ఎగువమైలు 15 మైళ్ళ వేగంతో వెళ్లేడు కనుక దిగువమైలు 45 మైళ్ళ వేగంతో కారు నడుపుతే సరాసరి 30 మైళ్ళు అవుతుంది అని కదూ మీ సలహా? ఈ సమస్యనే మరోవైపు నుంచి చూద్దాం.

దూరము $\times$ వేగము = కాలము అని తెలుసు. ఇందులో అనుమానమేమీ లేదుకదా?

రెండు మైళ్ళకీ సరాసరి వేగం 30 మైళ్ళు అయితే అన్నవరం నుంచి కూనవరం చేరుకోడానికి గంటలో 2/30 వ వంతు— అంటే 4 నిమిషాలు పడుతుంది. మొదటి మైలు కొండపైకి 15 మైళ్ళ వేగంతో కారు నడిపేడు కనుక కొండ శిఖరం చేరుకోడానికి అతడికి గంటలో 1/15 వ వంతు — అంటే 4 నిమిషాలు పట్టింది. అంటే ఇంక కొండ శిఖరం నుంచి కూనవరం నున్న సెకనులలో చేరుకోవాలన్న మాట! అంటే కిందికి అనంతకోటి మైళ్ళ వేగంతో ప్రయాణం చేస్తేనే సరాసరి వేగం 30 మైళ్ళు అవుతుంది అన్నమాట! ఇంతవేగంతో ప్రయాణం చేయడం మానవ మాత్రుడికి కాదు కదా, ఆఖరికి ఫాలాక్షుడికి కూడా సాధ్యంకాదు!

ఒకవిధంగా ఆలోచిస్తే కిందికి 45 మైళ్ళ వేగంతో ప్రయాణం చెయ్యాలనీ, మరోవిధంగా చూస్తే సరాసరి 30 మైళ్ళ వేగం అయేలా కారు నడపడం అసాధ్యమనీ రెండు పొందికలేని సమాధానాలు వచ్చాయి. ఈ రెండింటిలో ఏది సరియైనది? రెండవదే! 15 కీ 45 కీ సరాసరికడితే 30 వస్తోందికదా మరి ఇందులో తప్పుఎక్కడ?

మొత్తందూరాన్ని— మొత్తం కాలంచే భాగిస్తే సరాసరి వేగం వస్తుంది. మన మొదటి సమాధానంలో మొదటి మైలుకి గంటలో 1/15 వ వంతు, రెండవ మైలుకి 1/45 వ వంతు వ్యవధి పడుతుంది. మొత్తం $1/15 + 1/45 = 4/45$ కనుక సరాసరి వేగం $= 2 \div 4/45 = 22.5$ మైళ్ళు. అంతేకాని 30 మైళ్ళు అవదు.

కొంతదూరం 40 మైళ్ళ వేగంతో ప్రయాణం చేసి, తరువాత సరిగ్గా అంతేదూరం 60 మైళ్ళ వేగంతో ప్రయాణంచేస్తే సరాసరి వేగం 50 మైళ్ళు అవదు. అక్కడే వుంది పొరబాటు. కొంత కాలంపాటు 40 మైళ్ళ వేగంతోనూ, తరువాత సరిగ్గా అంతే కాలంపాటు 60 మైళ్ళ వేగంతోనూ ప్రయాణం చేస్తేనే సరాసరి వేగం 50 మైళ్ళు అవుతుంది. మొత్తం మీద అదీ కథ! ●

# రామశాస్త్రి

(15–వపేజీ తరువాయి)

సరి. లేకపోతే నీ తల తీసేస్తా!" అని బెదిరించాడు.

"ఈ కత్తి నాచేతిలో ఉండగా ఎలా తీస్తారో చూస్తాను".

చంఫాజీ అమాంతంగా గుర్రం ఎక్కి, శ్యామాని సునాయాసంగా ఎత్తి తన వెనుక కూర్చోపెట్టుకున్నాడు. "ఇక రండి మీసంగతి చూస్తాను!"

"శిలేదార్! మళ్లీ చెప్తున్నాను! కేవలం ఒక బానిసపిల్లకోసం ప్రాణాలు వదులుకోకు—"మోస్టిన్ మరొకసారి బెదిరించి చూశాడు.

"నా బొందిలో ప్రాణం ఉండగా ఏ మరాఠా దేశపు ఆడపడుచు మాన మర్యాదలకి భంగంరాదు! పవిత్రమయిన మా మతాన్ని వదులుకోను!"

చంఫాజీ సాహసం చూపరులలో చాలామందిని ఆకర్షించింది. మొదట అతను దోపిడీదారుడే అనుకున్నవారుకూడా అతని ధైర్యాన్ని మెచ్చుకోకుండా ఉండలేకపోయారు. 'శభాష్' అని అతన్ని ప్రోత్సహించారు. ఇది యుద్ధానికి పిలుపేమో అన్నట్టుగా మోస్టిన్ గుర్రాన్ని ముందుకితోలి చంఫాజీ మీదకి కత్తిఎత్తాడు.

చంఫాజీకన్నా మోస్టిన్ చాలా పొడుగు. కండబలం కూడా ఎక్కువగానే కనిపిస్తున్నది. అతనిది మంచి అరబ్బుజాతి అశ్వం. జీను, కళ్లెం వెండితో నగిషీ చేసి ఉన్నాయి. చంఫాజీది చిన్న గుర్రం. జీను, రికాబులు సయితంలేవు. అయినా ఆ గుర్రంజాతి మంచిది. దేహనిర్మాణం లక్షణంగా ఉన్నది. 'భీమ్‌తాడే' గుర్రాలు అన్నీ అంతే. ('భీమ' నది పారే ప్రాంతంలో ఒక జాతి గుర్రాలకి ఈ పేరుపెట్టారు. ఇవి మంచి యుద్ధాశ్వాలు.)

"శ్యామా నువ్వు భయపడకు! నీ తండ్రి పెద్ద వీరుడని జ్ఞాపకం ఉంచుకో! నీ ప్రియుడుకూడా మరాఠా దేశభక్తులలో ఒకడు! పానిపట్‌లో రక్తం ధారపోసిన వారిలో ఒకడు—" ఆమెకి ధైర్యం చెప్పి చంఫాజీ కత్తియుద్ధానికి ఉద్యుక్తుడయ్యాడు. శ్యామా, "అంతా దేవుడి దయ!" అని అతన్ని గట్టిగా కవుగిలించుకుంది.

మోస్టిన్‌కి తన విగ్రహపుష్టిమీద చాలానమ్మకం ఉంది. ఒక్కవేటులో చంఫాజీని హతమార్చాలని అతనిమీదకి ఉరికాడు. చంఫాజీ మోస్టిన్‌ధాటికి తేలికగా తట్టుకున్నాడు. అతి చాకచక్యంతో అతని మొరటు దెబ్బలని తప్పించుకుని చికాకుపరిచాడు. చంఫాజీ ఎదురుచూసినట్లే మోస్టిన్‌కి కోపంతో వళ్లు తెలియలేదు. మీద కలయబడ్డాడు. చంఫాజీ తన గుర్రం చెవిలో ఏదో వూదాడు. ఆ 'భీమ్‌తాడీ' అశ్వం వెంటనే ముందు కాళ్ళు పైకిఎత్తి డెక్కలతో మోస్టిన్ గుర్రం డొక్కలో మోదింది! ఆ దెబ్బకి తట్టుకోలేక ఆ పెద్ద గుర్రం బాధతో సకిలుస్తూ నేలకూలింది. అదే సమయంలోచంఫాజీ కత్తివేటుకి మోస్టిన్‌చేతిలోని ఖడ్గం తునాతునకలయిపోయింది; ఆ వేటుకి మోస్టిన్ దేహం కూడా దిమ్మెత్తిపోయింది. నేలమీద పడినవాడు లేవలేక అలాగే ఉండిపోయాడు.

"శభాష్ శిలేదార్! శభాష్ భీమ్‌తాడీ!" అనే అరుపులు అక్కడ ధ్వనించాయి.

పరిస్థితిని అర్థం చేసుకున్న మోస్టిన్ మాట్లాడకుండా లేచి, బట్టలు దులుపుకుని ఈ దృశ్యాన్ని ఆశ్చర్యంతో చూస్తున్న ప్రయిన్‌వద్దకి వెళ్ళిపోయాడు.

"రా, మై. స్టీవ్ మనం వాళ్లతో తగువు పెట్టుకోవటం మంచిదికాదు! జరిగింది మర్చిపో....." అని అతన్ని ఓదార్చాడు. ప్రయిన్.

"నిజంగా ఈ మరాఠా సైనికులలో మంచి వీరులే ఉన్నారు! చూడు నీతో పోట్లాడినవాడు తన ప్రియురాలిని గుర్రంమీద కూర్చోపెట్టుకుని ఎలా వెళ్ళిపోతున్నాడో! మన 'నైట్ ఎర్రాంట్'లు జ్ఞాపకం రావటంలేదూ! అదిగో ఆ పావురంచూడు వాళ్ల వెంటనే ఎలా ఎగిరి వెడ్తోందో......."అన్నాడు. విశాల హృదయుడూ సానుభూతి అధికంగా కల ఆ ఇంగ్లీషు అధికారి ఆ దృశ్యాన్ని అలా చిరునవ్వుతో చూస్తూవుండిపోయాడు.

(సశేషం)

# అప్పులలోని ఆంతర్యం

(13వ పేజీ తరువాయి)

రేపు జీతాలు గదాని! ఈ నెల ఏదైనా సర్దగలనేమో నని అడగటానికి వచ్చారు."

"ఏమోయ్! కృష్ణమూర్తి మీ హెడ్‌క్లర్కు గదాని నువ్వు ఎంత వెనకేసుకొచ్చినా లాభంలేదు. ఆయన సంగతెవరికీ తెలీదు. ఎవరి వద్ద చూసినా అప్పులే! అలాంటి వాడు నీకు అప్పు పెట్టటమా? నేనేం చిన్నపిల్లవాణ్ణి అనుకున్నావా నీ మాటలు నమ్మటానికి."

"మీకు తెలియదండీ! ఆయన చేసే అప్పుల్లో సగం ఇతరుల కిచ్చేందుకే! ఆ తీసుకున్న వాళ్ళు సమయానికివ్వకపోతే తన గౌరవం కొరకు తనే యిచ్చుకుంటాడు." అని కృష్ణమూర్తిగొంతు వినిపిస్తోంది.

"నువ్వేమయినా చెప్పవోయ్! అతని మీద నాకేమీ సదభిప్రాయంలేదు. ఎంత సేపటికీ యితరుల నుంచి సహాయం ఆశిస్తాడేగాని, ఇతరులకు ఇసుమంతయినా సహాయం చెయ్యడు. అంతా 'వన్‌వే ట్రాఫిక్'. నేను అప్పుడప్పుడు డబ్బు సహాయం చేస్తూ వుంటాను గదా, మా వెంకటేశాన్ని గురించి ఏదో చేసి పెట్టమని అడిగాను. యింతవరకు అజాపజా లేదు. పర్సనల్ బ్రాంచిలో వున్నాడు గదా ఎప్పటి కయినా ఆయనతో అవసరం వస్తుందని, అడిగిన చోటల్లా అప్పులు వుడలాయిగాని లేకపోతే ఆయన ముఖం చూసే వారెవరయ్యా పిచ్చి కృష్ణయ్యా! ఉద్యోగం పలుకుబడిని డబ్బుగా మార్చుకుంటున్నాడయ్యా. అది అర్థంగాక నువ్వేమో ఆయనంత మంచివాడు యీ ప్రపంచంలోనే లేడంటావు."

ఇంక అక్కడి మాటలు వినలేక క్షణంలో నుండి వెళ్ళిపోయారు గోపాలంగారు.

మరో వారంరోజులకు గోపాలంగారికి గుంతకల్లుకు ట్రాన్స్‌ఫర్ అయింది. తన ఆఫీసులోని వారందరూ పై ఆఫీసరుని కలుసుకుని ట్రాన్స్‌ఫర్ ఆర్డర్సు రద్దు చేయించుకోమన్నారు. కాని తనే ఈ ట్రాన్స్‌ఫర్ కొరకు అడిగినట్లు పాపం వారికేం తెలుసు? ●

Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor: S.Sambhu Prasad.

